

మలబారు పడుచు —చిత్రకారుడు: 'ఉన్ని'.



సంపుటం. ౧౬. బహుధాన్య, మాఘమాసము (ఫిబ్రవరి 1939) సంఖ్య. ౨

# యాత్ర

రాయప్రోలు సుబ్బారావు

౧

కావికొంగులు లాగికొని తన
కనకభాండముతోడ బిరబిర
సాగిపోయెడు సందెచిన్నది
సందడింపుడు త్రోవరుల్.

౨

మూసికొనె ఆకాశవాటము
ముసుగుఁబడె ఆకాశదీపము
అలసించిన కల దపాయము
అంధకారము పైకొనున్.

౩

బుసలుకొట్టుచు ఈ ప్రవాహము
కవరిరేగెడు నల్లత్రాచటు
దాటదలచిన తొందరింపుడు
బాటసారులు తెలివితోన్.

౪

పల్లెవాడో క్రొత్త, నదియును
అల్లకల్లోలముగ పొంగెడు
ఒడలు తెలియక మిడిసిపడియెడు
గడుసుతరగలు కైపునన్.

౪

గర్భఘాత సహింపజాలక
దుర్భరంబుగ దుఃఖపడునీ
పుడమితల్లి కఠోరకంఠము
భోరుభోరని వినబడున్.

౫

పొంగిపొరలు నదిం గనుంగొని
క్రుంగిపోవగ నేటికో యిటు
నావపయి చుక్కాని త్రిప్పగ
నావికుడు నిలుచుండగన్.

౬

కాళవక్త్రము తెఱచి చీకటి
కలియుచున్నది మ్రింగుమాదిరి
వేగిరింపుడు ఏటియావలి
కేగదఁచిన యాత్రికుల్.

౭

ఏటిసందిట ఆడుచున్నది
ఆటబొమ్మవిధాన నావయు
కేకిసలుగొట్టుచు సుడింబడు
కెరటములు పయి కెగిరెడిన్.

౮

కన్నులుండియు కానరావిక
తెన్నుదిక్కును తోఁపదాయి
తోఁడునీడలు లేనివాడలు
కూడదందురు పెద్దలున్.

౧౦

ఈమహోత్సవ మధురసంధ్యల
ఏటికోపము ఏటితల్లికి
దాటిపోదము రండు పథికులు
తల్లి చేతుల మీఁదుగా.

౧౧

నమ్మనందుకు ఏమి హేతువు
నావికుని ప్రియమైనపిలుపును.
నమ్మిచెడిరే యాత్రికులు మును
ఇమ్మహీవలయమ్మునన్.

# సంస్కృతాంధ్ర
# నరసభూపాలీయములు

మానవల్లి రామకృష్ణకవి

ఆంధ్రభాషా గ్రంథములలో నరసభూపాలీయ మను నామాంతరముగల కావ్యాలంకారసంగ్రహమును జదువని పండితు లుండరు. రాయల రాజ్యకాలములో బట్టుమూర్తియను నొకకవి ప్రఖ్యాతుఁడై యుండెనని పండితేతరులు నెఱుంగుదురు. కొందఱు వసుచరిత్రయు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించిన రామరాజభూషణుఁ డనుకవియు బట్టుమూర్తియు నొక్కఁడే యందురు. ఇతరులు వార లిరువురు భిన్ను లనియుఁ జినతండ్రి పెదతండ్రికుమారు లనియు జెప్పుదురు. ఎట్లున్నను మూర్తి నరసభూపాలీయము రచించె ననుటకు సందేహము లేదు కదా. అది యలంకారశాస్త్రగ్రంథము. అది యళియ రామరాయలతోఁబుట్టు వసులక్కమాంబకుఁ గుమారుఁ డగు తోరగంటి నరసభూపతి కంకితమయ్యె. దీనిలో నరసరాజునకు వీరపురుషుఁడను కుమారుఁడు పుట్టియున్నట్లు వర్ణింపఁబడియె. నరసభూపాలీయము క్రీ. శ. ౧౫౪౦మో లేక ౧౫౫౦ ప్రాంతమున రచింపఁబడియుండు నని యూహింపఁదగియున్నది. ఈనరసరాయల తల్లికి నోబమాంబ యను నొకసోదరి గోబ్బూరి తిమ్మభూపతికిఁ బత్నియై నరసభూపతి యను పుత్త్రుని గనెను. ఆనరసపతికి సంస్కృతమున నరసభూపాలీయ మను నలంకారశాస్త్ర మంకితముగాఁ గృష్ణకవిచే విరచింపఁబడియె. గోబ్బూరి నరసరాజు సైతము విద్వత్పక్షపాతియై యయ్యలరాజు రామభద్రునిచే రామాభ్యుదయకావ్య మంకితముగాఁ గొనియె.

సంస్కృత నరసభూపాలీయమును జూచినంత నాంధ్రగ్రంథమునకును దానికిని సంబంధము గలదేమో యనుసందియము తప్పక కలుగునుగదా. కృతిపతు లిరువురును చినతల్లి పెదతల్లికొడుకులు. వీనిలో నేది పూర్వకృతియో దాని మఱియొక నరసరాజు చూచి కీర్తిలో భుఁడై యట్టిదానిఁ దనయాశ్రితునిచే రచియింపఁజేసి యంకితఖ్యాతి చెందెనో యనుట యసంభవము కానేరదు. ఈరెంటిని జదువఁగా సంస్కృతగ్రంథమే పూర్వకృత మని మాకుఁ దోచుచున్నది. ఈరెంటిఁగూర్చి యిందుక చెప్పుటయే వ్యాసోద్దేశము.

ఆంధ్రభాషలో దౌర్భాగ్యవశముననేమో యలంకారగ్రంథములు పెక్కులు గానరావు. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి భాషలోఁ దజ్జాతికృతులలో ముకుటాయమానముగా నున్నది. దానికిఁ దర్వాత గణనకు రాఁదగినది నరసభూపాలీయము. అనంతకవి రచించిన రసాభరణము మిక్కిలి చిన్నగ్రంథము. దానిలో నాయికానాయక విషయములే యత్యల్పముగాఁ జర్చింపఁబడియె. శృంగార రసాలవాలము, ఆంధ్రచంద్రాలోకము, కువలయానందము మొదలగునవి ప్రఖ్యాతికి రావయ్యె. నేఁటికాలమున గావ్యాదర్శము, కావ్యప్రకాశము, కావ్యమీమాంస, కావ్యకల్పలత మొదలగునవి పండితులచేఁ దెనిఁగింపఁబడుచున్నవి. భామహ దండి మమ్మటాభినవగుప్తాదుల గ్రంథములు ప్రసన్నపదబంధము లయ్యు గంభీరార్థనిబంధము లగుటచేఁ దెనిఁగించువార లించుక వద్దర్శనీ పరిచయహీను లైనచోఁ బ్రమాదాపభ్రంశములపాలై చిక్కువడుదురు. ఉన్న కొన్నియైనను మనభాషలో నలంకారమున సంస్కృతములోవలెఁ దర్కపరిష్కారముతోఁ బదార్థచర్చ చేసి పూర్వపక్షసిద్ధాంతప్రక్రియగా రచింపఁబడిన గ్రంథము కానరాదు. అట్టిప్రక్రియకు ననేకశాస్త్రపరిజ్ఞానమును విషయవివేచనాశక్తియుఁ దత్తత్పారిభాషికపదప్రయోగకౌశలమును సైజముగా నలవడుట యత్యావశ్యకము. అట్టిసామర్థ్యము గలవాఁడు సంస్కృతముననే గ్రంథరచన సేయ నుత్సహించుఁగాని సుకుమార మతిమనో

మోహన మను సంగ్రహవాక్యమున నతికర్కశమనీషో దర్కమను తర్కపరిష్కారము జేసుపంగోరెండు కావున నీ కావ్యాలంకారచూడామణియు నాంధ్రసరసభూపాలీయమును నొకవేళ కేవల మాంధ్రలోకమునకుఁ బ్రౌఢగ్రంథములుగాఁ దోచినను వానిలోఁ దర్కనిక్షేప ధారలకు నిలువఁగల వజ్రసారము పస్యమెుం డైనను గానరాదు. చిన్నకోట పెద్దన మ్మనుమఁడనుగాఁ బద్యములఁ గూర్చి చేర్చినను గావ్యదర్పణములలోనుండి తెనిఁగించిన లక్షణభాగము లన్నియు నస్పష్టపదార్థకములై యవ్యాప్త్యతివ్యాప్త్యాది దోషములకు లక్ష్యభూతములై యున్నవి. ఆగ్రంథమే యట్లుండ నరసభూపాలీయమునకు నేమి? వేంకటగిరి సంస్థానాధీశ్వరుల వారి ప్రేరణమునఁ గొల్లాపుర స్థానపండితులచే రచింపఁ బడిన నరసభూపాలీయవిమర్శమే తజ్జాతిగ్రంథము లెంతి పరీక్షకములలో దాని మధ్యోషింపఁజాలు. వారును చిన్నకపై బ్రహ్మాస్త్ర మేల యని కాఁబోలు విషయముఁ జైఁజైఁ దర్కించి విడిచిపెట్టిరి.

సంస్కృతగ్రంథమును రచించినకవి సుష్ఠుకృష్ణ యజ్వ వాధూలసగోత్రుఁడు. సూరిభట్టోపాధ్యాయ పుత్త్రుఁడు, "సర్వశాస్త్రరహస్యజ్ఞుఁడు సర్వాలంకారకోవిదుఁడు", కృతిపతి యగు గొబ్బూరి నరసరాజు కవి నలంకారశాస్త్రమును రచింపు మనఁగా నతఁడు —

తేనాలంకృతిశాస్త్రతత్త్వసరణి
ప్రవ్యక్తయే ప్రేరితః
సాహిత్యార్ణవకైరవప్రణయినాం
సత్ప్రీతయే సాదరమ్,
వక్ష్యామి క్రమశోఽత్ర వర్ణగణయోః
శబ్దార్థయోశ్చ ధ్వనే
ర్వృత్తేర్నేతృరసస్య దోషగుణయో
శ్చాలంకృతేర్లక్షణమ్.

అని వర్ణగణ, శబ్దార్థప్రతిపాదన ధ్వని నిరూపణ, వృత్తిస్వరూప నాయకాదిగుణ విస్తరణ, రసవిచార, గుణదోషవివరణాలంకార లక్షణములుగల గ్రంథమును రచించెనఁట. ఇందులో నాయుల్లాసములే లభించె; శేషమది యగు నలంకారభాగము సహితము తక్కినభాగముల వలె గుణవంతమై యుండవచ్చును. కవి నానాశాస్త్రముల నెఱింగియు నిర్నిమిత్తముగా శుష్కతర్కమునకు దిగక సాహిత్యశాస్త్రమర్యాద ననుసరించి మధురాక్షరములతో నిచ్చే మధురతరముగ నుపాదేయాంశముల నిరూపించుచున్నాఁడు. లక్షణముల సామాన్యముగా విద్యానాథు ననుసరించి చెప్పినను లక్ష్యభాగమునఁ దా నిచ్చిన లక్షణమునకుఁ బొందికగా న్యూనాధికతలు లేక యుదాహరణము లిచ్చుచున్నాఁడు. ప్రాయశః ప్రతిలక్షణమునకును రెండుదాహరణము లిచ్చుచుండును; క్షుద్రకావ్యములకుఁ దన రచనానైపుణియు సాహిత్యపరిశ్రమము గోచరించునట్లు విద్వజ్జనశ్లాఘ్యములుగా నుదాహరణములు గూర్చెను.

ఇఁక రెండు నరసభూపాలీయముల పరస్పర సంబంధ మూహించుటకుఁ బూర్వము సామాన్యముగా నలంకారశాస్త్రరచనాప్రణాళిక నెంచి యించుక యతిప్రసంగమైనను విషయవివేకమునకుఁ దోడ్పడవచ్చునని కొంతయవకాశము వేఁడుకొనుచున్నాను.

సాధారణముగా నలంకారశాస్త్రమునఁ గావ్యకర్తలకును గావ్యపాఠకులకును శబ్దార్థరచనారహస్యము, తద్వైచిత్ర్యము, కవివైదగ్ధ్యము నెత్తిచూపునట్టి వస్తువిమర్శను గలది. సంస్కృతమున దీనిఁ గవిశిక్షాగ్రంథ మందురు. భోజాదులు రచించిన శృంగారప్రకాశాది గ్రంథములు చదువఁగా మహాకావ్యము లేరీతిగాఁ జదివి పరిశీలించిన వానందమును ధర్మాదిజ్ఞానవిశేషమును గలుగునో యా పద్ధతియు నుపదేశించుచున్నందునఁ గవులకే కాక తక్కినవారలకు నలంకారశాస్త్రము ప్రయోజనకారియే యని చెప్పఁదగు. అది సామాన్యముగా రసప్రధానమై కథావస్తుశరీరము నాశ్రయించి యొక సరణియు, కేవలము శబ్దార్థరచనాప్రధానమై కవినైపుణి ప్రదర్శించునట్టిది రెండవ సరణియుగా నిరుదెఱఁగ వెలయుచుండును. రుద్రటుని శృంగారతిలకము, భానుదత్తుని రసమంజరి, భావప్రకాశము, శృంగారప్రకాశోత్తర భాగము మొదటి సరణి నాశ్రయించినవి. కావ్యప్రకాశ, ప్రతాపరుద్రీయాదులు రెండవసరణిలోఁ జేరినవి. నరసభూపాలీయములు రెండును రెండవ తెగయగు రచనాప్రసక్తి ప్రధానముగఁ గలవి. దీనిలో గావ్యనాయక లక్షణములు శబ్దవృత్తిస్వరూపము, ధ్వని, గుణదోష

ములు, స్థూలముగా రసస్వరూపము, శబ్దార్థాలంకార లక్షణములు ప్రతిపాదింపఁబడును. ఇట్టిగ్రంథములు సాధారణముగా మమ్మటుని కావ్యప్రకాశము ననుసరించుచు నించుక న్యూనాధికతలతో నొప్పుచుండును. నరసభూపాలీయములు రెండును ప్రతాపరుద్రీయము ననుకరించును. విద్యానాథుని గ్రంథమున ముఖ్యవిశిష్టగుణ మేమనఁగా కావ్యప్రకాశకారాదులు లక్షణమునకు లక్ష్యమును ప్రాయికముగాఁ బ్రాచీనగ్రంథములనుండి ఏరి యిత్తురు. ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు తానే రాజుపేరట లక్ష్యములఁ గల్పించి శాస్త్రరచన చేసెను. అట్టి యేకనాయక ప్రశంసాలక్ష్యములు గ్రంథకర్తృకల్పితము లగుటలో లక్షణము సరిగా సమన్వయమునకు రాక యవ్యాప్త్యతివ్యాప్తులు చెందుటయు, సర్వత్ర హృదయావర్జకములగు భావములు స్ఫురింపకుండుటయుఁ, గేవల మర్త్యనాయకులయందు ధీరోదాత్తులగు రామాదుల దివ్యగుణముల నారోపించి వర్ణించునపు డతిశయోక్తిచ్ఛాయ నవలంబించి మిథ్యాత్వము గలగొల్పుటయు, బహుమతభేదగహన మగు నలంకార శాస్త్రమున విషయవివేకము సల్పునపుడు గ్రంథకర్త పొందుచున్న భ్రాంతి సంక్రాంతిదోషములకు లక్ష్యముల నిలుపుటయు, మొదలగు పెక్కుదోషములు సంభవిల్లెను. ప్రాచీనకవిప్రయోగముల లక్ష్యములుగాఁ జూపువారి కిట్టికష్టములు లేకున్నను అవాంతరభేదములకు సకరముగా లక్ష్యములు లభింపకుండుటయు, బహుగ్రంథ పరిశీలన మతినిపుణముగాఁ జేయవలసివచ్చుటయుఁ, దుట్టతుదకు స్వప్రతిభాద్యోతము గాక యసామర్థ్యము నవలంబించుటయుఁ దటస్థించుచుండును. మఱియుఁ బూర్వుల లక్షణములఁ బెక్కు మార్చి నూతనముగా మార్గనిర్మాణము సేయుట యెల్లరకును సులభసాధ్యము కాదు. మహాత్ములు చూసినత్రోవఁ బలువురచే క్షుణ్ణమగుటచే దానినే చక్కఁబెట్టి పునఃప్రతిష్ఠసేయుట యుత్తమ మని తలఁతురు. కావునఁ బ్రాచీనలక్షణములు వస్తువిభాగమును భరతాదిమహర్షులచే నిరూపింపఁబడినందున వానిని నిరసించుటకును క్రొత్తత్రోవ సృజించుటకును సుకుమారమతుల కలవికాదు. కావున నలంకారశాస్త్రకారులు లక్షణభాగములఁ బూర్వులవలన గ్రహించి లక్ష్యముల జేసియో స్వయముగాఁ గూర్చియో గ్రంథరచన సేయుదురు. ప్రతాపరుద్రీయ, నాగభూపాలీయ, కావ్యాలంకారసంగ్రహ, సాహిత్యదర్పణాదులు బాలురకుఁ బ్రథమశిక్షకర్హములే కాని ప్రౌఢమతులకు తోడ్కువములు గావు. కావ్యప్రకాశము విషయగాంభీర్యముచే వీనికంటె నించుక మేలైనది. ఈశాస్త్రమున నేకదేశభాగముల విస్తరముగా నిరూపించు గ్రంథములలో— ధ్వన్యాలోకము, వక్రోక్తిజీవితము, కావ్యకౌతుకము, శృంగారప్రకాశము, సహృదయదర్పణము, వ్యక్తివివేకము మొదలగునవి ప్రాయశః నూతనపక్షప్రౌఢము లగాధముగా నుండుట గావునఁ బ్రథమశిక్షకుచితములు గావు. శాస్త్రము లభ్యసించినపిదపనే వానిఁ బరిశీలింపఁదగు. ఇఁక లఘుగ్రంథములు ప్రాయశః గతానుగతికములుగా నొకటికి వేఱొకటి ఛాయారూపము వహించుచుండును. తద్గ్రంథకర్తలు బహువిషయపరిజ్ఞానము లేకున్నను పూర్వలక్ష్యములకు నిపుణముగాఁ బ్రతిబింబములమాత్రము నిర్మింపఁగలిగిరేని క్రొత్తగ్రంథములు సేయ సమర్థులగుదురు.

> తే ఏవ పదవిన్యాసా
>     స్తా ఏవార్థవిభూతయః
> తథాపి నవ్యం భవతి
>     కావ్యం గ్రథనకౌశలాత్"

అనఁగా పూర్వవస్తువులోనిదే బంగారము, దానిలోనివే రత్నములు దానిఁ జెడిపి మఱియొకయాకారమునఁ గట్టినచోఁ గ్రొత్తయాభరణ మగుచున్నది. అన్నట్లు అలంకారగ్రంథములు పెక్కులు పుట్టెను. రెండు నరసభూపాలీయము లట్టివే. ఇది గ్రంథచౌర్యము కాదా యని మా మిత్రులు ప్రశ్నింతురేమో ? శాస్త్రకారులకు వస్తుసంహారము నియతము, స్వకపోలకల్పనము శాస్త్రాతిదేశమై ప్రమాదజన్య మగును. కావున "ఇది నాయభిప్రాయ" మని యుద్ఘోషింపఁజాలక పండితులు పూర్వకాలమున రాజసభలలో బహుముఖప్రతిభాకంతుల యెదుట నెగ్గఁజాలక "న స్వాతంత్ర్యేణ మార్గాశ్చ కోఽప్యర్థో విహితః క్వచిత్" అని యాప్తప్రామాణ్య మనుసీడలో నాత్మరక్షణము సేసికొనుచుండిరి. ఇప్పుడు స్వాతంత్ర్యమునకు భంగములేనందున నిరంకుశముగా స్వకీయా పరకీయా శబ్దములకు నర్థపరివర్తనము సేసి రచించినను నడుచు

వారు లేరు. సంస్కృతాంధ్ర నరసభూపాలీయములలో సంస్కృతగ్రంథమే పూర్వరచితమని తోచుచున్నది. లక్షణభాగమున నిరువురును ప్రతాపరుద్రీయాదులలో నుండి వస్తువు గ్రహించిరి. లక్ష్యభాగమునఁ గృష్ణయజ్వ రెండు రెండుదాహరణము లిచ్చుచు సాధ్యమైనంతవఱకు నూతనకల్పనలే యిచ్చెను. భట్టుమూర్తి యనేక గ్రంథములలోనుండి కల్పనలు గైకొని పరివర్తనవిన్యాసవిశేషములచే నాంధ్రమున నూతనము లని తోచునట్లు వివరించెను. కృష్ణకవిశ్లోకములు లక్షణార్థము ననుసరించి న్యాయాధికరిలు లేక లక్ష్యము లగుచుండును గాని యాంధ్రకవి యిచ్చిన యుదాహరణములు లక్షణమునకు సరిగా నుండక యవ్యాప్త్యతివ్యాప్త్యలసదోషములకు లక్ష్యభూతము లగుచుండును. మఱియు నొకయుదాహరణమునందే నాలుగైదుచమత్కృతులు గలిగియుండుటచే లక్షణలక్ష్యసమన్వయము సులభముగాఁ గానేరదు. ఆంధ్రగ్రంథములోని యుదాహరణకల్పన లలంకారగ్రంథములలోనుండియు సంస్కృతనరసభూపాలీయమునుండియుఁ గూడఁ గైకొనఁబడినను గల్పనాపహరణమునందును భట్టుమూర్తి కొంత చమత్కృతి చూపియున్నాఁడు. సంస్కృతమున నేలక్షణమున కది యుదాహృతమో దానికేగాక దానిఁ దెనిఁగించి మఱియొకలక్షణమునకు మూర్తికవి దానినే యుదాహరించును. అట్లయినచోఁ జమత్కృతి భేదల్లి లక్షణమున కెట్లు సమన్వయించు నని పండితు లడుగుదురేమో! అయిననేమి? మా యాంధ్రలోకమునకు శ్రావ్యముగాఁ బద్యము లున్నం జాలుఁగదా శాస్త్రచర్చలను సమన్వయసిద్ధాంతము లను మా కేల? వలయువార లుండిరేని యానిష్ణాతబుద్ధులు స్వశక్తివిశేష రసగంగాధరాదుల గ్రంథికంటక ప్రఘట్టముల యథారుచి సంచరింతురుగాక. మూర్తికవి సకలలక్ష్యముల గ్రహించునపుడు కేవల మేకగ్రంథమునుండి గైకొనక నానాకృతులలోనుండి కొనుటయే కాక భిన్నలక్షణములకు లక్ష్యము లగువానినిగూడఁ దీసికొని యించుక పర్యాయశబ్దప్రయుక్తిచే రూపాంతరముఁ బొసంగించుచుండును. ప్రతాపరుద్రీయమునుండి లక్షణములే కాక లక్ష్యములం గూడఁ గొన్నిటిని గైకొనెఁగదా; ఎట్లన—

ఖండితానాయిక కుదాహరణముగాఁ బ్రతాపరుద్రీయమున—

రాత్రిర్యామత్రయపరిమితా కల్పభా స్తే సహస్రం
మార్గాసక్త్యా మమ గృహమపి ప్రాతరేవాగతోఽసి,
కిం కర్తవ్యం వద నృపతిభి ర్వీతలజ్జా హి సర్వాః
కో వా దోషస్తవ పునరహం కామమాయాసయిత్రీ.

నృపులకు నెల్లవారల భ
    రించుట యోగ్యముగాన నేటిరే
యపరిమితోత్సవంబునఁ
    బ్రియాసదనంబుల కేగివేసి యా
నెపమున మద్గృహంబునకు
    నీ వరుదేరఁ బ్రభాతమయ్యెఁ గా
కిపుడు నృసింహ నీపయి నో
    కింపక వంచన లేదలంచెదన్ ॥

ఈ రెంటిలో నర్థమున నత్యల్పభేదము కలిగినను వాక్యార్థము సమనమే. సంస్కృతమున నాత్మోపాలంభనవాక్యమగు "పునరహం కామమాయాసయిత్రీ" యను నది తెనుఁగున వ్యక్తముగాఁ గానరాదు.

మఱియు — "ఈర్ష్య" కుదాహరణముగా—

లక్ష్మీ ర్యస్య విలోలనాబ్జవసతిః
    నేత్రా త్వదాలోకనే
వక్త్రోస్థా చ సరస్వతీ న సహతే
    సాకం త్వయా భాషణమ్,
లీలాకర్షణకుఘ్నకృత్ త్వయి మహీ
    బాహుస్థితా కాకతి
క్షోణీంద్రేన హి కైరవాని సభగే
    మా సేవ కిఁ తామ్యసి?"

వదనాగ్రంబున వాణి యున్నది మనుజ్
    వాత్రసవ్యనీ యిందిరా
మదిరాక్షీమణి యున్న దక్షుల మనుజ్
    మన్నించి వీక్షింపనీ
దరియుంగాక నృసింహ! నీవిపులబా
    హాశ్లేష మేనొంద నో
ర్వదు భూదేవి బహుప్రియాదరత ! నినుం
    బ్రార్థింప నింకేటికిన్?

రసార్ణవసుధాకరములోనుండి కొన్ని చాలోదాహరణములు చూపవచ్చును. విస్తృతి మను చెప్పెడు దృష్టాంతము సింగభూపతి యిట్లు రచించెను.

అద్యాపి తన్మనసి సంపరివర్తతే మే
రాత్రౌ మయి క్షుతవతి క్షితిపాలపుత్ర్యా।
జీవేతి మంగళవచః పరిహృత్య కోపాత్
కర్ణేఽర్పితం కనకపత్ర మనాలపన్త్యా.

బాలిక యల్కతో మరలఁ
 బల్కకయుండియుఁ బ్రాణనాథుఁ డ
చ్చో క్షుతం బొనర్పఁ గడు
 వేగఁ జిరాయు వటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయ
 సంభ్రమముల్ మది దొమ్ములాడ నీ
లాలక కుండలద్వయ ము
 దగ్రగతిన్ ఘటియించె వీనులన్.

అని మూర్తికవి తెనిఁగించె.

ఇట్లే శృంగారచేష్టలలోఁ బ్రథమభేద మగు భావము "రసజ్ఞానయోగ్యతామాత్రి" మగు మనఃపరిస్పంద మని నిర్వచించి సింగభూపాలునియుదాహరణము నిట్లు తెనిఁగించె—

వరుఁ డని చేర్కొనన్ శిరము
 వాంచుఁ దలోదరి సాలభంజికా
పరిణయవేళ నెచ్చెలుఁ
 బాయక యొప్పటియట్ల కేళికాం
తర మొనరింపఁబోదు చనె
 నా యెదఁ బయ్యెదఁ జేర్చి పిన్నవం
బరఁగుఁ బ్రియాంగనాకృతి
 భావన కేళికిఁగాఁగ నిచ్చలున్.

దీనికి మూలశ్లోకము—
బాలా ప్రసాధనవిధౌ విదధాతి చిత్రం
దత్తాదరా పరిణయే మణిపుత్రికాణామ్,
సా శంకతే నిజసఖీజనమందహాసై
ర్లక్ష్యతే తదిహ భావనవావతారః.

ఇందు సఖీజనహాసశంకను గాఢలజ్జానుభావముగా మార్చుటచే మూర్తికవి "భావము మనస్సునఁ బ్రథమపరిస్పంద మనుట మఱచి యుత్తరావస్థను జూపెనేమో!

ఇట్లే మూర్తికవి కావ్యప్రకాశాది గ్రంథములలో నుండియు లక్ష్యములు గైకొని తనకృతి కొనసాగించు కొనెను. పాణినిశ్లోక మగు—

పాణౌ పద్మధియా మధూకముకుళ
 భ్రాన్త్యా తథా గణ్డయో
ర్నీలేన్దీవరశఙ్కయా నయనయో
 ర్బన్ధూకబుద్ధ్యాధరే,
లీయన్తే కబరీషు బాన్ధవజన
 వ్యామోహజాతస్పృహో
దుర్వారా మధుపాః కియన్తి సుతను
 స్థానాని రక్షిష్యసి.

అని నాయిక యభినయించు శిలీముఖశోభను నాయకుఁడు దానిమౌగ్ధ్యను నుపాలంభించినట్లు సౌందర్య మహిమను బ్రకటించును. దాని నిట్లు మూర్తికవి తెనిఁగించె—

వదనసరోజవాసనకు వచ్చిన కేఁటి నదల్చి చూడఁగా
నది యసితోత్పలంబు లని యక్షుల వాలినఁ జే విదుర్పఁగా
నది మరలం బయోజమని హస్తయుగంబున వ్రాలనవ్వెన
మ్మదవతి యేమి సేసినను మాన దిదేమి యటంచు
 నెంతయున్.

దీనిలో మూలములోని ఛాయమాత్రము గ్రహింపఁబడి వ్యంగ్యరూపముగా నాయకుని దృఢప్రయత్నము తెలుపుచున్నది.

తిర్యగ్జంతువుల శృంగారవిలసనము రసాభాస మని విద్యానాథ సింగభూపాలుల యభిప్రాయము ననుసరించి మూర్తికవి విద్యానాథుని యుదాహరణమే తెనిఁగించెను.

ప్రాసాదగర్భవలభీషు కపోతపాల్యాం
పారావతీం రమణచుమ్బితచఞ్చుకోటిమ్,
ఆవిర్భవత్సురతకూజితరక్తకణ్ఠీ
మాలోక్య కాకలిభిః స్మిత మాతనోతి॥

అలఘువికీర్ణపక్షయుగ
 మై యమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవముల్ దలిర్పఁ బ్రియ
 కాంతకు ముద్దులు వెట్టి యుబ్బునం

బలుమఱు మేడపై కెగసి
పక్షము ద్రిప్పచుఁ గుంచితాస్యమై
పాలతుకఁ బిల్చు విభ్రమత
పోతము హుంకృతనాదమాధురిన్.

అని మూలమును బుష్టిచేసి తెనింగించె. తిర్యక్శృంగారము రసాభాసము కాదని కృష్ణకవి సిద్ధాంతపఱచి దండియుదాహరణ మగు—

కలక్వణితగర్భేణ కణ్ఠేనాఘూర్ణితేక్షణః,
పారావతః పరిక్రమ్య రిరంసు శ్చుమ్బతి ప్రియామ్.

అని సూచించి—

బాధో ముఖ్యరసస్య స్యాదుక్తార్థాదప్రవృత్తినా,
యత్ర హ్యఙ్గరసే నైవ రసాభాసః ప్రకీర్తితః.

అని సంగ్రహశ్లోకమున స్వసిద్ధాంతమును బ్రకటించెను.

కాళిదాసకుమారసంభవమున "మధు ద్విరేఫైః" ఇత్యాది శ్లోకచతుష్టయము రసాభాసము కా దని భోజుఁడు శృంగారప్రకాశమునఁ బదౌజ్జ్వల్యము నొక్క ప్రకాశమున నతివిస్తరముగా వర్ణించెను. మాయురాజు తాపసవత్సరాజమునఁ దృతీయాంకమున—

కిఞ్చిత్కుఞ్చితచఞ్చుచుమ్బనసుఖ
స్మేరీభవల్లోచనా
స్వప్రేమోదితచారుచాటుకరణై
శ్చేతోఽర్పయన్తీ ముహుః,
కూజన్తీ వితతైకపక్షతిపుటే
నాలిఙ్గ్య లీలాలసం
ధన్యం కాన్త ముపాన్తవర్తిన మియం
పారావతం చుమ్బతి॥

అని విరహాక్రాంతుం డగు వత్సరాజు తనదౌర్భాగ్యము ధ్వనించునట్లు "చిక్కని రాలు ద్రింగియుఁ సదా కాముత్తులైయుండు" పారావతములచర్యను వినూత్నముగ వర్ణించెను. కృష్ణకవిమతానుసార మిది యంగరస విలసనమగుటచే దోషము కానేరదు. సింగభూపతిమత మే మూర్తికవి గ్రహించె.

ఆంధ్ర సంస్కృత నరసభూపాలీయములలో సంవాదబహులము లగు ప్రఘట్టముల నొండు రెండు చూతము.

అపరాంగమున కుదాహరణము—

భవద్భటావశ్యశిపుత్రికాభి
ర్గృహీతకంఠా విషమాస్త్రవిద్ధాః,
నృసింహభూవల్లభ భూరిరాగాన్
ద్విషోఽభిజగ్ముః సురతానుభూతిమ్.

అత్ర వీరస్య వాక్యార్థస్య శృంగారోఽఙ్గతయా ప్రతీయతే ఇత్యపరాఙ్గమ్.

మెడఁ ద్రుచ్చి కౌఁగిలించును
నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్
వడి మోహనిద్రపుచ్చును
బుడమి నృసింహేంద్రుఖడ్గపుత్రిక యారా.
—II. 151.

రంగుగ వీరమెడ ధ్వనియగు
శృంగారము రౌద్రరసని శేషమునకుఁ దా
నంగంబై విలసిల్లుచు
సంగతి నపరాంగ మనఁగ సన్నుతి కెక్కున్.

ఇందు వీరరసమే యంగియగుఁగాని మూర్తికవి తలఁచినట్లు రౌద్రము కాదు. దానికిఁ దగిన విభావములు ధ్వనింపవు.

కటాక్షవర్ణనమున :—

సాభిప్రాయైః సదరహసితైః
సత్రపైః సానురాగై
ర్లీలాలోలై రలసవలితై
రాదరానందగర్భైః,
కందర్పాజ్ఞా మయుత మనిశం
కల్పయద్భిః కటాక్షై
శ్శ్రీ బ్బారీనరసనృపతిం
ప్రేక్షతే పంకజాక్షీ॥

అలసాలోలములై యచంచలములై
యాకేకరాగ్రంబులై
యలఘువ్రీడములై యనిందితములై
యానందపూర్ణంబులై
సులభాసాయములై సుతీక్ష్ణరుచులై
సువ్యక్తరాగంబులై
చెలువంబొందెడు చూపు లింతి నెఱపెన్
శ్రీనారసింహేంద్రుపైన్.

ఇందుఁ దృతీయచరణములలోఁ జాడ్యులు నానా
విషమదనరాగజనకంబు లను సంస్కృతమునకుఁ బ్రణయ
కోపప్రసాదసూచకంబు లని తెనుంగున మార్పుట
ప్రతిభావైచిత్రియే.

గొబ్బూరి తిమ్మభూపతిఁ గృష్ణకవి యిట్లు వర్ణించె-

చిత్రం కీర్తిరహీనతామహిపతే
ర్ముష్ణాతి కృష్ణాత్మతాం
క్షీరాబ్ధిం విలయం నయత్యపహర
త్యబ్జస్య బిమ్బం మహత్।
ఐకానీం శ్రియ మావృణోతి కురుతే
గఙ్గాం సభఙ్గాం దివో
వాణీం వర్ణవిగర్హితాం వితనుతే
తిమ్మక్షమాధీశితుః॥

అతద్గుణాలంకారమున కుదాహరణము—

బలరిపుభోగ ఘనాబనర
పాలనృసింహ భవద్యశంబు చేఁ
దెలుపగు నిందులాంఛనము
దెల్పగుఁ బ్రాక్తనభోగిభోగముల్
దెలుపగు శక్రకంధరము దెల్పగు
భారతికొప్పు గాని త్వ
త్ఖలరిపుదుర్యశోరుచివి
తానము తెల్పయి యుండ దన్నఁడున్॥

ఇందు సంస్కృతమున మహిపతిప్రభృతులకు
సహజదోషముల నాపాదింప నాంధ్రమున శత్రుజనుల
యపకీర్తిమాత్రము తెలుపుగాదయ్యె ననుట సరసతరమగు.

ఇరువురు నవతారికలో నాత్మప్రగల్భత నిట్లు
వర్ణించుకొనిరి—

మాఘస్యాఘనిరాకృతౌ నిపుణతాం
కాంతే ర్ధురం భారవే
ర్భాణస్యార్జవ ముజ్జ్వలం మధురిమో-
త్కర్షం మయూరధ్వనేః।
హర్షస్యానుసరన్ ప్రకర్ష మసమం
కుర్వన్ మురారేః పద
భ్యాసం కాంచిదలంక్రియాం ప్రథయతే(?)
ప్రీత్యై నృసింహప్రభోః.

బాణవేగంబును భవభూతి సుకుమార
తయును మాఘుశైత్యంబు దండిసమత
యల మయూరసువర్ణకలన చోరునియర్థ
సంగ్రహమ్ము మురారిశయ్య పెంపు
సోమప్రసాదంబు సోమరాజుల నియ
మంబు భాస్కరునిసన్మార్గఘటన,
శ్రీనాథునిపదప్రసిద్ధి ధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖదృష్టి
నీక కల దటుగాన ననేకవదన
సదనసంచారఖేదంబు సడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనెఁ గదె
మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర!

పైపద్యములలోఁ గేవలము ఛాయారూపమగు
సంవాదము కలదు కాని రెంటను బ్రస్తుతార్థము హీనమై
యప్రస్తుతము పుష్టమగుట నీరసముగా నున్నది. శ్లేష
కుఁగాఁ దత్తత్కవిగుణవిశేషముల మార్చి లేనివాని నారో
పించుట కేవలము హాస్యాస్పదము. కావున నీరసత్వము
రెంటికిని సామాన్యము. బాణునకు వేగము, భవభూతికి
సౌకుమార్యము, సోమునకుఁ బ్రసాదము, సోమరాజికి
నియమము, భాస్కరుని సన్మార్గము తత్తత్కవులకు
ముఖ్యగుణము లని గ్రంథజ్ఞులు తెలుపరు.

ఇఁక నిరువురి వస్తువిభాగ నిర్వచనలక్ష్య సమ
న్వయభంగులఁ గొంత విచారింతము.

కథానాయకగుణము లెవన—

గుణా మహాకులీనత్వ ముజ్జ్వలత్వ ముదారతా
తేజస్వితా మహాభాగ్యం ధార్మికత్వం విదగ్ధతా
పాండిత్యం ధీరతేత్యేవమాద్యా నేతు రుదాహృతాః.

కులము మహాభాగ్యము న
జ్జ్వలత యుదారత మహోవిశాలత ధర్మ
కలనయు వైదగ్ధియు నన
నిల నాయకగుణము లమరు నివి దేర్పఁ బటుల్॥

సంస్కృతమునఁ బాండిత్యధీరత లితరగుణము
లలో నంతర్భావము నొందు నని కొందఱు దెనుఁగున
పరిహరించి విద్యానాథుని మతమునే యాశ్రయించె.

కాంతాసమ్మితమునకావ్యోపదేశమువలనఁ గలుగు ఫలశ్రుతి నిట్లు వర్ణించిరి.

కీర్తిం యా కురుతే౽త్ర కార్తికకన
జ్జ్యోత్స్నాప్రతిస్పర్ధినీం
శక్రశ్రీసదృశీం శ్రియం దిశతి సం
సూతే కళాకౌశలమ్
చింతాశాంతి ముదఞ్చయత్యపి పరా
నన్దం విధత్తేతరాం
కాన్తాసమ్మితయా తయా విహరతే
కో వా న కావ్యశ్రియా॥

"అంగనాజన విలాసాలాపలీలాసమప్రాదుర్భావము"
పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతివిఖ్యాతసా
గరచంద్రోదయమిష్టసంఘటనరేఖాదివ్యధేనూత్తమం
బురుకార్పణ్యదశానిశాదినముఖం బుద్వేలనిర్వాణధ
న్యరసాస్వాదరసాయనంబనినఁ గావ్యం బెన్న
సామాన్యమే.

తెనుఁగున రూపకాలంకారముచే మూలములోని భావఖండములు బహుళీకృతములై శోభిల్లుచున్నవి.

ఆంధ్రగ్రంథము సర్వజనులకుఁ జిరపరిచితసౌందర్యనిలయమే కావున నముద్రితమగు సంస్కృత నరసభూపాలీయమును గుఱించి యించుక విచారింతము. భరత రాహుళ రుద్రట భోజ ప్రభృతులు నానారసభావ నిర్మాణమున దక్షులై యనేకలోకానుభవ శాస్త్రావగతులఁ గృతశ్రమలను మహావిద్వాంసులకునైన నుపయోగకముగా గ్రంథరచన యొనర్చిరి. అట్టి ప్రబంధములు సహృదయజన మనోహరములై యుండఁగా నరసభూపాలీయాదులలో వర్ణింపఁబడిన లక్షణములకు నిష్కృష్టార్థతయు సర్వాంకషతయుఁ గానరా వనుట యచ్చెరువు కాదు. ఇవి యన్నియుఁ గేవల ముదరపోషణార్థము పాలసులై విద్యాపరిశ్రమ వేదిత్వకీర్తికాములగు భూవల్లభులకు నిష్కించనులచే ముఖస్తుతిపుస్తకములుగా రచింపఁబడినవి. ఇట్టివానిలోఁ గించిద్వైచిత్రియున్నది కవిప్రతిభాద్యోతకమే యండ్రు. అఖండరసవాహినులఁ బుణ్యావగాహము లభింపనివారి కల్పసరస్సుసహితము సురదీర్ఘికయేకదా.

స్థాలీపులాకనీతిగాఁ గొన్నిటి నెత్తి చూపుదము. రసోద్బోధకములగు సంచారిభావములలో సుప్తి యనునది యొకటి. 'నిద్రయా యః సముద్రేకః సా సుప్తిః పరికీర్తితా' అని నిర్వచించి కృష్ణకవి—

స్వప్నే దష్టాధరకిసలయా చుమ్బితా ఫాలభాగే
శ్రీకొబ్బూరీ నరస ! భవతా భావికారాగరమ్యమ్ !
పశ్యత్యేవ ప్రణయిని జనే బాలికా జాతకమ్పా
ముగ్ధా హస్తే కలితముకురా పశ్యతే ప్రాతరాస్యమ్॥

ఇందు గాఢనిద్రావశమున సంభవించిన స్వప్నాయితవృత్తము యథార్థమని తలఁచి సఖీజనుల సాన్నిధ్యము నెఱుఁగక యే నాయిక దర్పణాలోకనముచే శంకాత్రపాద్యనుభావములు ప్రకటించును. సింగభూపాలుఁడు—
ఉద్రేకఏవ నిద్రాయాః సుప్తిః స్యాత్తత్ర విక్రియా—
అని సుప్తిని లక్షించె. నాట్యదర్పణమున సుప్తం నిద్రాప్రకర్షో౽త్ర స్వప్నాయితఖమోహనే (నష్టేంద్రియానవభావము) అని యుపలక్షింపఁబడెను. భోజుఁడు— నిద్రాధికార్యం సుప్తం అని నిర్వచించి చతుర్థియగు సంపర్కావస్థకుఁ గుమారసంభవములోని

త్రిభాగశేషాసు నిశాసు చ క్షణం
నిమీల్య నేత్రే సహసా వ్యబుధ్యత
క్వ నీలకణ్ఠ వ్రజసీత్యలక్ష్యవా-
గసత్యకణ్ఠార్పితబాహుబన్ధనా.

అని స్వప్నాయితవృత్తానుబంధిని యగు చర్య నుదాహరించె.

మూర్తికవి — 'అతినిద్ర సుప్తి' యని

లలన నృసింహుని కౌఁగిట
నలసి రేయి పవ లెల్ల నిద్ర నందెడి నెలమిన్
నెలపొందున కే ముద్దులు
గులికె పగల్ నిద్రవోవు కుసుదినికో లెక్క.

అని దివాసుప్తవైభవము సుషమాలంకారరంజితముగా వర్ణించినను శాస్త్రచమత్కృతి యిందుఁ గానరాదు. స్వప్నాయితవృత్తమే రసపోషణ ప్రధానమని ప్రాచీనులు గ్రహించిరి. రాహులాది శాస్త్రాచార్యులును మాతృగుప్తుఁడును నిద్ర యనుసంచారిభావమున నంతర్భావమును నని సుప్త్యవస్థను వేఱ వర్ణింపక తత్స్థానమున శౌచమను నవీనసంచారిని సృష్టించిరి. తన్మతానుసారులు—

దౌర్బల్యాలస్యవిపద్విత్తాభిశ్చ ప్రజాయతే నిద్రా।
నిద్రేత్యా సుఖగౌరవజృంభాస్వప్నాయితై
ర్వికారైః పా॥

యథా—

భీమో నిద్రాం గతో హన్మి
కీచకత్వాం కృతా దితి।
స్వప్నాయితేన కృష్ణాయాః
పాణేరే వాగ్ర మాక్షిపత్॥

అని భీముఁడు స్వప్నమున నొనర్చు కీచకవధోద్యోగము ద్రౌపదీకరాకర్షణ మనుభావముగాఁ గావ్యచమత్కృతి నుదాహరించిరి.

కొంద ఱుత్తమనాయకులకు ప్రకృతిశాస్త్రవివేకములచే జనించిన దమశమసత్యాద్యనుభావములుఁ బ్రవర్తిత మగునని బౌద్ధులమతము. నర్వాచీనులు భరతమతవిరుద్ధ మనియుఁ జమత్కారరహిత మనియు గాబోలుఁ బరిహరించిరి. రసభావోత్కర్షకారి యగు చమత్కృతి లేక కేవలము గాథసప్తిలో మఱిగినది.

నేరక నిద్రించినవాఁ
డారయ మేల్కొనఁగ నేరఁ డాజన్మమునన్

అని చెప్పఁదగు.

విరహాతిరేకమున నాయికానాయకులలోఁ గలుగు దశావస్థల నిరూపించుచోట నిరువురుకవులును భిన్నాభిప్రాయము లగుచున్నారు.

కృష్ణకవి—

దృక్ప్రీతిర్మనసః సఙ్గః సఙ్కల్పో౽థ ప్రలాపితా
జాగరః కృశతా ద్వేషో విషయేషు త్రపాచ్యుతిః
జ్వరోన్మాదౌ తతో మూర్ఛా మృతి
ర్ద్వాదశ తాః స్మృతాః॥

మూర్తి—

ఇలఁ జూచుట చింతించుట
తలఁచుట గుణవినుతి యరతి తాపము లజ్జా
స్ఖలనము గమనము మూర్ఛయు
నల ధన్యత యన నవస్థలను నెట్లన్నన్

అని ద్వాదశభేదముల నొక్కఁడును దశవిధముల నితరుఁడును వర్ణించె. ఈభేదము సంస్కృతగ్రంథాంతరములలోను గలదుగాని మూర్తి విప్రలంభోద్దిష్టమగు మరణావస్థకు మాఱుగా సంభోగశృంగారాంతర్భేదమగు ధన్యత యను క్రొత్తయవస్థఁ దెచ్చిపెట్టి లోకశాస్త్రమర్యాదల నుల్లంఘించి యవస్థావిశేషమును బొందుచున్నాఁడు. వస్తుతత్త్వము బాహ్యాభ్యంతరములఁ జక్కఁగాఁ బరిశీలించి విషయవిభాగ మొనర్చిన భరతాదులకంటె మూర్తికవి ధన్యతను దశమావస్థగాఁ జేర్చినను దా ధన్యతఁ జెందఁడయ్యె. మరణావస్థ యన ప్రాణచ్ఛేదము. నాయికానాయకులలో దాని వర్ణించినచో గథావిచ్ఛేద రసభంగము లగునని కవులు వర్ణింపరు. పునరుజ్జీవనము కలుగునేని గాదంబరిలోఁ జంద్రాపీడాదుల మృతిఁబోలె వర్ణింతురు

"చంద్రాపీడస్య మరణం యత్ప్రత్యుజ్జీవనాంతిమమ్,
కల్పితం భట్టబాణేన యథా శారదచన్ద్రికా"

అని శారదాతనయుఁడును, తస్యైవంవిధస్యమరణస్య లక్షణ మనంగవృత్తిత్వా దాచార్యేణ నోపవర్ణిత మల మహోపన్యాసేన॥ యథాహ—

ఇతి మరణ మనఙ్గవర్తి ముక్త్వా
నటతి నటీవ యువత్యశేషభావాన్।
నటతి ఖలు యువాపి బాలలబ్ధ
స్మరలలితాతిశయః కదాచిదేవమ్॥

అని సాగరుఁడును ప్రాచీనమతోద్దేశము నెత్తిచూపిరి. శారదచంద్రికయనునది కాదంబరిలోఁ జంద్రాపీడమరణ కథాభాగమునకుఁ బేరగు. అనంగవృత్తయన సంగాభావస్థితిచే ననుభావాప్రతిపత్తి గలుగుట.

మూర్తికవి ధన్యతయను దశమావస్థ కిట్లు లక్ష్య మొసంగె.

శుకవర్గం బోకమాటలో మెలఁగె నా
మానాయకుం డాగ తరం
గిఱుఁడై యుండె మరాళి మొక్కనడకం
గ్రొల్లుచ్చి వర్తించెఁ బా
యక వేడ్కం సుముఖత్వ మొందె శశి మా
యబ్జాక్షి సేమంబుతో
నలంకస్థితి నీవు గూడ నరసింహా రాజకంఠీరవా!

అని దీని నెవ్వరును విప్రలంభావస్థ యని లక్షింపరు. కావున నవావస్థలే నిక్కముగా నుద్దేశించి మరణ మ వర్ణ్యమని వర్ణింపఁడయ్యెఁగాని "దశమీం దశామ్" అను లోకోక్తి నెట్టు ఖండింపఁగలఁడో!

ఉద్దీపన విభావమును వర్ణించుచుఁ గృష్ణకవి యిట్లు కూర్చె—

ఆభాత్యమ్బరచుమ్బి చమ్పకరజో
 నాసీరరేణూపమం
లీల కామాళకూజితస్య కురుతే
 పుంస్కోకిలానాం స్వనమ్,
భాటీనూనమటత్యయుగ్మవిశిఖః
 సాకం వసన్తేన త
ద్విక్తానాం కుచశైల ధూర్వరహితాం
 యూనాం గతి ర్నా పరా.

మూర్తి—
బిగువుఁగటారితోఁ జెఱకు
 సింగిణితో నలరంపసంపుతో
నిగనిగమించు చెంగలువ
 సేజముతో వడిఁ జిల్క తేరిపై
మగటిమి నెక్కి కూరుఁడయి
 మారుఁడు కోకిలకంఠకాహళుల్
సెగడ లతాంగిపై నడరె
 నేఁడు నృసింహ! యెటుంగఁ జెప్పితిన్.

ఈ రెంటికిని జన్యజనక భావము లేకున్నను సాదృశ్యరేఖ గలదు. ఆంధ్రపద్యమును మెచ్చుకొని రసిక జనమనోరంజనకారుఁడు దానిఁ బ్రతిబింబము నిర్మించి తనచమత్కృతియో ప్రతిభాదారిద్ర్యమో చూపెను.

ఉభయగ్రంథములలో నిట్లే వస్తువర్ణనావిశేషములు పరీక్షింపఁ జెక్కు లు గలవు. "సంక్షిప్తవస్తు రమ్యేఽర్థేన కదాచిన్ విరజ్యతే" అన్నట్లు బహూపాదానము నైరస్యహేతువని యీప్రసంగ మింక నిలుపుచున్నారము. కృష్ణకవి గద్యమున—శ్రీమద్వాధూశ గోత్రతిలక కుష్ఠుపదాంక సూరిభట్టోపాధ్యాయతనయ కృష్ణయజ్వవిరచితే అలంకార ముక్తావళ్యపరపర్యాయే నృసింహభూపాలీయే — అని ప్రవరము చెప్పుకొనెను.

నైషధ పారిజాతీయాదిగ్రంథరచయిత యగు కృష్ణయజ్వ మఱియొకఁడు గలఁడు. అతఁడు తంజాపురి రఘునాథుని యాస్థానకవి. మనకృష్ణయజ్వ తంజాపుర కృష్ణాస్వరికంటె నించుక సాహిత్యశాస్త్రముల నెక్కువగాఁ బరిశ్రమించియుండునని వారలగ్రంథపరిశీలనము వలనఁ దోచుచున్నది.

కేవలము గ్రంథపరిచితిదోషముచే భిన్నకాలముల భిన్నావస్థలలోఁ గూర్పఁబడిన యీ వ్యాసమున నసంగతత్వ మతి జాడ్యాదిదోషము లుండెనేని దోషజ్ఞులు క్షమింతురుగాక!



# జీవనభారం

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

౧

క్షీరకంఠు॥మెత్తని చిన్ని యెదల
లోన, అనురాగవేదనాజ్ఞానముగ్ధ
సుందరీ నిశ్చలాపాంగ శోభలందు,
కసటు సంసారవాసన గడగి, యాత్మ
వేయి రేకుల తమ్మిలో విరియ, ఒకయ
లౌకికావస్థనందు విరాగియందు,
బాలభానుని లే కిరణాలచిరుత
వెచ్చతనముల కన్నులు విప్పి నవ్వ
మృదుల సుమబాలసుస్నిగ్ధవదనమందు
బ్రతుకులో తెగమోసిన బరువు దించి
నడువలేక నడువలేక బడలి వచ్చు
మానవుల నాదరించు శ్మశానమందు
చెదరు మునిమాపు వెల్గులో చేరవచ్చి
హృదయమునకొత్తు తల్లిలోరెక్కలందు
పారలికనుమూయుచిన్నారి పులుగునందు
విశ్రమించిన శాంతి దేవీ! 'నమస్తే'.

౨

కరము హృన్మర్మనిర్భేద కారణమ్ము
ఆజవంజవ పరివర్త నానుభవము
రాసి అంపాన బెట్టిసదోసి — యెపుడు
శాంతిదేవత మృదుపద స్పర్శలేక —.

౩

కర్షకుండయి కేదార ఖండములనో
పేదబానిసనై ప్రభు పాదములనో
అడగిపడియుండబోక — ఈ యాత్మ కేల
తరిమి బ్రతుకెల్ల కాల్చు సౌందర్యచింత.

౪

అసలు నా కీప్రపంచమే అర్థహీన
గూఢ మూఢ కావ్యమ్ముగా గోచరించు
విషపునవ్వులు - కంటక వీక్షణములు
ప్రతిపరిచ్ఛేదమున - అడ్డుపడును నాకు.

# నేటి తెనుగుకవిత : కొత్తపోకడలు

శ్రీరంగం శ్రీనివాసరావు

[ఈనడుమ మద్రాసు రేడియోస్టేషనునుండి శ్రీరంగం శ్రీనివాసరావుగారు చేసిన ప్రసంగ మిది.—భా. సం.]

౧

రష్యన్‌వైమానికుల నిర్విరామగమనం, పికార్డ్ మహాకాశయాత్ర, ఐన్‌స్టైన్ రిలెటివిటీసిద్ధాంతం, ఫ్రాయిడ్ మనస్తత్వపరిశోధనలు, గాంధీ అహింస, స్పెయిన్‌లో, చీనాలో స్వాతంత్ర్యసమరం- ఆధునికజీవితం ఎన్ని దిక్కులనుండి ముసురుకొని వస్తున్నది! నీమెదడు కేంద్రంగా వివిధపరిధులలో విస్తరిల్లిన సుడులు కావా ఇవి? నీటిలో విసరిన రాయిచుట్టూ వలయాలుగా బయలుదేరే కెరటాలు. ఇదే ఆవర్తం (Vortex) శిల్పంలో ఇటువంటి సుడిగుండాలను స్ఫురింపచెయ్యడమే ఆవర్తవాదం (Vorticism).

కళాప్రపంచంలో ఇటువంటి విప్లవాన్నే ఇటలీనుండి సీనార్ మారినెట్టీ (Signor F. T. Marinetti), భావికళ (Futurism) అనే పేరుతో బోధించాడు. అవి యూరప్‌లో మహాసంగ్రామం తీవ్రంగా సాగుతున్న రోజులు. దేశదేశాలమధ్య చెలరేగిన ద్వేషాగ్నికి పవిత్రమైన వస్తు వేదీ కనిపించలేదు. గ్రంథాలయాలు, వైద్యశాలలు, విజ్ఞానపరిశోధనాలయాలు, చిత్రవస్తుశాలలు, మానవ నాగరికతా చిహ్నాలన్నీ ఈదావానలంలో దగ్ధపటలం అయిపోతున్నవి. మారినెట్టీ సాహిత్యాన్ని నాశనంచెయ్యడానికి నిశ్చయించాడు. ఈశిథిలాలనుండి నూతనశిల్పం బయలుదేరుతుందనీ, అదే భావికళ (Futurist art) అనీ ఉద్ఘాటించాడు. ఇతడాదినాలలో ప్రకటించిన కరపత్రాలు, చేసిన ఉపన్యాసాలు లెక్కకు మిక్కిలిగా ఉంటాయి. ఐతిహాసికులను, ప్రేమగీత రచయితలను, విశ్వవిద్యాలయ పండితులను, విమర్శకులను, వ్యాకరణాలను, నిఘంటువులను, నాటకశాలలను, శిల్పాలయాలను నిర్మూలించమన్నాడు. లెంపకాయలను, పిల్లిమొగ్గలను ప్రశంసించాడు. నూతనసృష్టి చెయ్యడానికి నూతనవిధానం కావాలి. యంత్రాలనుండి, చలనచిత్రాలనుండి, వార్తాపత్రికల శీర్షికలనుండి, కావ్యవస్తువులను స్వీకరించమన్నాడు. ధ్వనులే సంగీతం, మాటలే కవిత్వం, రంగులే శిల్పచిత్రాలు అన్నాడు. ఇతడు వ్రాసిన "ట్రిపోలీయుద్ధం" కేవలం ధ్వన్యనుకరణలతో నిండిఉంటుంది.

ఈసమయంలోనే ఫ్రాన్సులో క్యూబిజం (Cubism) జర్మనీలో ఎక్స్‌ప్రెషనిజం (Expressionism) అమెరికాలో ఇమేజిజం (Imagism) బయలుదేరాయి. భూగోళం మూలమూలలనుండి ఉద్యమాలు, కార్యక్రమాలు, ప్రయోగాలు చెలరేగినవి.

మోటారు కారు, గ్రామఫోను, సినీమా, రేడియో, వాయువిమానంవంటి నవీన యంత్రాలయుగం- క్యూబిజం, ఫ్యూచరిజం, ఎక్స్ప్రెషనిజంవంటి ఉద్యమాలను ప్రసవించింది.

అనేకవిధాల క్షణక్షణ పరిణామం పొందుతున్న ప్రపంచానికి కళాకారులే పురోగాములు. వీరి దూరదృష్టిలో ప్రజ్వరిల్లిన ఆదర్శలోకమే కాలక్రమాన భౌతిక లోకంలో రూపుకడుతుంది. నిజమైన తిరుగబాటు కళాప్రపంచంలోనే వస్తుంది. రాజకీయవాదులు తర్వాత వీటినే ప్రచారం చేసి నూతనరాజ్యం స్థాపించామంటారు.

సంప్రదాయాలను ధ్వంసం చేయడం కళాకారులి కొక క్రీడ కాదు. ఎంతో అవసరం కలిగి, వీటి వినాశనంవల్లనే లోకాన్ని ముందుకు తీసుకు వెళ్ళవలసి ఉంటుం దన్నప్పుడే అత డిందుకు ఉద్యమిస్తాడు. తన ప్రజ్ఞాతిశయంవల్ల నూతనసంప్రదాయాలను విధిస్తాడు.

క్యూబిస్టు చిత్రకారులు సంప్రదాయాలు ధ్వంసించడంలోని రహస్యం ఇదే: సమకాలికుల అభిరుచిమీద తిరుగబాటులేవనెత్తి తమ బాహ్యేంద్రియాలకు, అంతరింద్రియాలకు గోచరించిన పరమసత్యాలను అపూర్వపద్ధతులలో ప్రదర్శించారు. క్యూబిజం సాహిత్యంలోనికి కూడా ప్రవేశించి రచనావిధానాలను సమూలంగా ఉద్రూత లూపివేసింది. ఈ రచయితలు అన్వయం, అలంకారం, వ్యాకరణం, ఛందస్సు అన్నింటినీ అధిగమించి క్రొత్తక్రొత్తగమనాలు, లయలు, సంగతులు నిరూపించారు.

యుద్ధంరోజులలోనూ, యుద్ధం గడచిన క్రొత్తదినాలలోను బయలుదేరిన ఉద్యమం డాడాయిజమ్ (Dadaism). ఇది కేవలం విధ్వంసనమే, నిరసనమే, నిరాకరణమే పనిగా కలది. ఏది వ్రాసినా నిష్ఫలం అనీ, మాటలకు అర్థం లేదనీ, ఏమాటనైనా, ఏఅర్థంలోనైనా ఉపయోగించవచ్చుననీ ఈ వర్గం వారు బోధిస్తారు. ఏదో ఒక అక్షరం తీసుకొని దానితో ప్రారంభించే మాటలతో ఒక రంగవల్లిక తయారుచెయ్యడం. ఒకొక్క మాటనుండి ఎన్నోవిధాల ఎన్నో అర్థాలు సాధించడం, వార్తాపత్రికలలో మాటలు కత్తిరించి తిరిగి వాటిని ఇష్టం వచ్చినక్రమంలో పేర్చి పద్యం అల్లడం! సాహిత్యంలో అరాజకత్వానికి ఇది పరమావధి అనవచ్చును.

ఈ యువకోద్యమాన్ని ఫ్రాన్సులోని పెద్దలలో ప్రముఖు లనేకులు ఆదరించారు. కరడుగట్టిన అలవాట్లను కరగగొట్టే మందుగాను, కవితాసామగ్రిని పరుకొనడానికి శిల్పికి దొరికిన నూతనస్వాతంత్ర్యంగాను దీనిని అంగీకరించారు.

కాని సంహారమే ప్రధానంగా గల డాడా, నూతనసృష్టి ఏదీ చెయ్యలేకపోయింది. ఇది ఆరిపోతూన్నసమయంలో దీనిలోనుండి క్రమశిక్షణతో, సుతీక్ష్ణ తేజస్సుతో బయలుదేరిన మహోద్యమమే సర్ రియలిజం. డాడావల్ల విడుదలపొందిన పదజాలం ఈ ఉద్యమంలో మళ్లీ ప్రాణప్రతిష్ఠ పొందినవి. దీనికితోడు ఫ్రాయిడ్ సాగించిన మనస్తత్వ పరిశోధనలు సర్ రియలిజముకు అమూల్యమైన తోడ్పాటు కలిగించాయి. ఈ ఉద్యమప్రవక్త ఆంద్రే బ్రెటన్ (Andre-Breton) మనోవిజ్ఞానంలో కృషిచేసిఉండడం ఒకవిశేషం. ఇతనిరచనలు, వివరణలు,

వ్యాఖ్యానాలవల్ల సర్ రియలిజమ్ అమోఘ బలం సంపాదించింది. అపస్మారక మనస్సు నుండి స్వప్నలోక రహస్యాలను సంగ్రహించడానికి చేసే ప్రయత్నమని సర్ రియలిజమును నిర్వచించవచ్చును. ఒక్క కవిత్వంలోనే కాదు శిల్పం, చిత్రలేఖనం, చలనచిత్రాలు, జీవితవ్యాపారా లన్నింటిలోను దీనిని వర్తింపజేయవచ్చును. దాలీ (Dali) బొమ్మలు, ఎల్వార్ (Eluard) గీతాలు, మాన్ రే (Man Ray) ఫోటోగ్రాఫులు, బ్యూన్వెల్ (Bunuel) చలనచిత్రాలు, ఆంద్రే బ్రెటన్ విమర్శలు - కవనం ఈఉద్యమానికి శేఖరమైనవి.

కాని దీని నొక "విదేశ సరుకు" గా పరిగణించి తిరస్కరించడానికి వీలులేదు. రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళాప్రపంచంలో సర్ రియలిజమ్ (Surrealism) అట్టిదని చెప్పాలి. ఇది ప్రపంచమంతటా అనేక శాఖోపశాఖలతో వర్ధిల్లుతున్నది. ౧౯౨౪ లో మొట్టమొదట ప్రారంభమయినప్పటినుండి ఇది నేటిదాకా అవ్యాహతంగా సాగిపోతున్నది.

౨

నేడు వివిధదేశాల సాహిత్య క్షేత్రాలలో విజృంభిస్తూన్న ఇన్ని యిన్ని నవీనోద్యమాలు, ఇన్ని యిన్ని భావపరిణామాలు భారత దేశంలోను, ఆంధ్రభూమిలోను తమ ప్రతిధ్వనులను ప్రసరిస్తున్నవి.

ఆధునికాంధ్రకవుల రచనలను సరిగా అర్థం చేసుకోవడానికి వాటివెనుక బాసటగా నిలిచిన ఇతరదేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటిరచనలను విశ్వపర్యాప్తమైన విశాల జీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వ మేదో. కేవలం నిర్జీవ శుష్కానుకరణం ఏదో గుర్తించాలి.

ఒకటిమాత్రం నిశ్చయం. నేటి కవులు అసమర్థతవల్ల పూర్వసంప్రదాయాలను నిరసించలేదు. ఒక అశాంతి, అసంతృప్తి ప్రబలి అంచులను దాటే ప్రయత్నాలతో నానా ముఖాల వీరు పరుగెత్తుతున్నారు. తాము నిరాకరించి వెనుకవదలిన సంప్రదాయాల నిజస్థితి, అంతస్తత్వం వీరికి తెలియనిది కాదు. వాడుకభాష బోధించిన గిడుగు రామమూర్తి పండితునికంటె గ్రాంథికాంధ్రాన్ని చుళుకితం చేసుకొన్నవారు లేరు. ముందు కాలపు అవసరాలనుగుర్తించి ఇతడు, శృంఖలాలను తెగగొట్టివేశాడు. ఆమార్గంనుండి గురజాడ అప్పారావు ప్రవేశించి వాడుకభాషకు కావ్యగౌరవం ఆపాదించాడు. ఆధునికోద్యమానికి మూలవిరాట్టుగా ఇతనికి నవీన కవులు నివాళి ఇస్తారు. గద్యంలో ఇతని నాయకత్వం అందుకొని అనేకులు ప్రథమశ్రేణిలోనికి రాగలగ్రంథాలు వ్రాశారుకాని పద్యంలో వాడుకభాష విజృంభించడానికి ఒకపురుషాంతరం పట్టింది. ఈలోపున అచంచలంగా వాడుకభాషలో కవనంచెప్పినవాడు బసవరాజు అప్పారావు మాత్రమే. ఈ శ్రేణిలోనికే మెంకిపాటలు కూడా వస్తాయి. కాని మెంకిపాటలచుట్టూ సాహిత్యం ఏదీ పెరగలేదు. అందుకు కారణం సంఘంలో రావలసిన తిరుగుబాటు ఇంకా రాకపోవడమే.

ఇప్పుడిప్పుడు నవీనులు గ్రాంథికాంధ్రం వదలి వాడుకభాష స్వీకరించినట్లే పురాతన చ్ఛందస్సులు వదలి ముత్యాలసరాలు, ద్విప

దలు, రగడలు, మొదలైన గేయచ్ఛందస్సు లలో రచనలు సాగిస్తున్నారు. గేయాల లోనే వాడుకభాష జీవితానికి సన్నిహితంగా వచ్చి ప్రాచీనరీతులలోని కృత్రిమత్వాన్ని సమయించి నవీనరీతుల స్వచ్ఛందగమనా లను ప్రదర్శిస్తున్నది

అక్కరలు, ద్విపదలు, ముత్యాల సరాలు మాత్రమేకాక, భుజంగప్రయాతం వంటి వృత్తాన్ని ౨౦ ఏళ్లక్రిందటనే అబ్బూ రి రామకృష్ణరావుగారు తమఊహాగానంలో ఉపయోగించారు. అంతేకాక ఆయన ఆ ఛందస్సులో స్వతంత్రించి నాలుగుకంటె ఎక్కువపాదాలను, రెండేసిపాదాలకే ప్రాస లనూ పాటించి దీనిగేయగుణం ఇనుమడింప జేశాడు. ఇది ఊహాగానంలోని "సాధుగీతి".

లతాంతార్ద్రిరాగంబులన్ బాసు రేటుల్
వసంతమ్ము కాంతిప్రవాహమ్ములందున్
నిసర్గాప్తశోభావినీతిం బ్రియమ్మై
కనుల్గట్టు చందాన కాన్పించు పూవుల్
కనుంగొన్నచో నేకికన్నీళ్లు రాలున్.

అలంకారముల్లేని ఆప్రాణ ముగ్ధో
క్తులన్ లీనమైపోయెదో సాధుగీతీ!

గేయాలలో మహాకావ్య లక్షణాలు చూపించినవారు విశ్వనాథ (కిన్నెరసాని పా టలు), నండూరి (ఎంకిపాటలు), కవికొండల (శివరాత్రిప్రభ), కృష్ణశాస్త్రి (ఏ గేయమైనా సరే). గీతపద్యంమీద సంపూర్ణ ప్రభుత్వం గల కృష్ణశాస్త్రి ఇటీవల వాడుకభాషలో ఈ ఛందస్సును అత్యద్భుతంగా మలచి చూ పించాడు.

బసవరాజు అప్పారావుగేయాలు ఏ సాహిత్యానికైనా శిరోధార్యమైనవి. ఇటీ వలి కొన్ని టాకీలద్వారా వీటికి ప్రచారం వచ్చి ప్రజాబాహుళ్యం అంతటిలోకీ వ్యా పించి నిజమైన కవిత్వం ప్రజాహృదయం లోనికి సూటిగా ఏవిధంగా చొరబడగలదో విశదం చేశాయి.

దువ్వూరి రామిరెడ్డిగారు ఆధునికోద్య మంలో కుడిప్రక్కను నిలుస్తారేమోగాని వీరు రససంపన్నమైన గేయాలు రచించి పరి పక్వమైన కళాభిరుచి ప్రదర్శించారు. వీరి పాన్పదాత్యం చదివినవారు మరచిపోలేరు. చదవనివారు చదివితీరాలి.

జీవనగంగా హారిత తటంబున
చింతావటతరుమూలమువసన్
ఏల యథోముఖునై గడతెంచెద
విన్యధియౌవన వనులన్.

అని యిది ప్రారంభ మవుతుంది.

గ్రాంథిక భాషను విసర్జించినట్లే ఈ గేయాలనుకూడా మనకవులు ఎప్పుడు పరి త్యజిస్తారో ? సాహిత్యపరిణామం గుర్తిస్తే ఇం దుకు ఎంతో కాలం పట్టదని చెప్పవచ్చును. వచనపదాలలోనికి ఒక్క ముద్దుకృష్ణమాత్ర మే సాహసించాడు. అడివి బాపిరాజుగారు సాహసించబోయి సందేహిస్తున్నారు. మల్ల వరపు విశ్వేశ్వరరావు "శ్రీ" అనే కావ్యం లోను, "చెప్పండి జవాబు "లోను వచనపు విరుపులతో రసవత్కావ్యం ఎలా సృష్టించ వచ్చునో ప్రదర్శించాడు.

నిస్సందేహంగా ఇకముందు పదిసంవ త్సరాలూ వచనగమకాలలో క్రొత్తపరిశోధ నలకు వినియుక్తం కాబోతున్నవి. జ్వాల, ఉదయినివంటి పత్రికలు (ఇవి ఆగిపోవడం తాత్కాలికమే అని ఆశించాలి) ఇట్టి అన్వే

షణలకు కర్మాగారాలుగా పనిచేశాయి. ఖండాంతరకవులు ఈమార్గంలో పోయిన పోకడలు మొట్టమొదట వివరించాను. ఈ కార్యభాధ్యత వహించిన కవులు అక్కడక్కడమాత్రమే తెలుగుదేశంలో కనబడుతున్నారు. దురదృష్టవశాత్తూ వీరిని నిరోధిస్తూ బలిష్ఠమైన ఛాందసాలు పనిచేస్తున్నవి. నవ్యసాహిత్యంలోని మితవాద సంస్థలనుకూడా సహించలేని హ్రస్వదృక్కులు అనేకులు కనబడుతున్నారు. తీవ్రవాదులు ఏకీభవించడం లేదన్నమాటకూడా వాస్తవమే. భావకవులలో అతివాదాభిప్రాయాలతో సానుభూతి కలవారందరూ ఈ క్రొత్తవాహినులకు తమబలం ఇచ్చి శ్రేణి తీరుస్తారని ఆశించవచ్చును.

వచనగీతం అంటే చేతికి వచ్చిన వ్రాత కాదు. వ్యర్థపదాలు లేకుండా వచనం రాయడమే ఎంతో చిక్కు. అటువంటి అప్పుడు సమగ్ర సౌందర్యం గల వచనగీతం వ్రాయడం మరీ కష్టం. పద్యరచనలో ఛందస్తీరాలు కవులను కాపాడి నడిపిస్తాయి. వచనగీతంలో బైటినుండి ఇట్టిసహాయం రాదు. కవి తన అంతర్జగత్తులోనుండిమాత్రమే వల్లికలు కల్పించుకోవాలి. వచనగీతం తన రూపం తానే నిరూపించుకొంటుంది. అయితే దీని ప్రాశస్త్యం నిర్ణయించడానికి ఉపయోగించవలసిన ప్రామాణ్యా లేవి? స్థూలదృష్టికి ఇట్టి వేవీ లేవని తోచవచ్చును. కాని ఇవికూడా సంగీతప్రధాన మైనవే. ప్రాచీనచ్ఛందస్సులలో ప్రాచీన సంగీతం గోచరించినట్లే నవీన కల్పనలలో నవీనశ్రావ్యతలు గోచరిస్తాయి. క్రొత్తసంగీతం లోహవిహంగాల, పారిశ్రామికయంత్రాల, ధూమనౌకల, విద్యుచ్ఛకటాల వివిధ విచిత్రఘోషలలోనుండి బయలుదేరుతున్నట్లే నవీన గీతాలు కవియొక్క రసాత్మనుండి అనేక ధోరణులలో ప్రవహిస్తాయి. ఇందుకు కారణం ఈకాలపు పారిశ్రామిక యుగధర్మమే. వీటివల్లనే క్రొత్తకవిత్వం ప్రోక్తమవుతుంది. వచనగీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమనవైవిధ్యం. ఇది సంభాషణలోని యానలూ, కాకువులూ, ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి ఉంటుంది. శైలికి, రీతికి, సంబంధించిన సమస్య లెన్నో దీనినుండి బయలుదేరుతాయి. ఒక్కొక్క కవి తన సామర్థ్యంతో ఒక్కొక్క ప్రత్యేక గుణం ప్రదర్శిస్తాడు.

ఇంతవరకు నేను నవకవిత బహిరాకృతిమాత్రమే చర్చించాను. ఇకమీద నేటి కవులు స్వీకరించిన కావ్యవస్తువులను గురించి కొంత చెప్పవలసిఉన్నది. నవీనకవుల దృక్పథం విస్తరిల్లిందని అన్నాను. వీరు ఆకాశాలలోనికి వెళ్లి నక్షత్రపథాలలో విహరించినట్లే భూమికికూడా చేరువగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటి కోణాలలోనికి కాంతికిరణాలు పంపిస్తున్నారు. నగర జీవితం, పారిశ్రామిక పరిస్థితుల హృదయవిదారక దృశ్యాలు, పతనోన్ముఖ మైన ప్రాతసంఘపు వికిర నృత్యం, తమ కావ్యవస్తువులుగా చేసుకొన్నారు. ఈ మార్గంలో వీరికి రష్యన్ ఫ్యూచరిజమ్ (Russian Futurism) ఆదర్శమవుతున్నది. మాయకొవస్కీ (Mayakovsky), పాస్టెర్నాక్ (Pasternak), మొదలైన కవుల రచనలు పీడితలోకంతో వీరికి సానుక్రోశం కలిగించాయి. కుబేరవైభవం ప్రక్కనే కుచేలదారిద్ర్యం కనబడడానికి వీరు నిర్ఘాంత

పోతున్నారు. ఒక్కసారి తమచుట్టూ చూస్తే సంఘదూషితులైన ప్రవాసజీవితులు, దరిద్ర భిక్షువులు జీవనోపాధికి శరీరకష్టంతప్ప వేరే ఆధారం లేని కష్టజీవులు కానవస్తున్నారు. తమ కవితలో ఈ దారుణదృశ్యాలు ప్రదర్శించి లోకం కళ్లు తెరవడానికి నేటికవులు యత్నిస్తున్నారు.

కాని ఈ వివిధ విభ్రమాలకు కళవళపాటు పొంది నీ పాతకాలపు వ్యక్తి ఇదంతా తన కర్థం కా దంటాడు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. ఆధునికకవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునికజీవితమే అర్థం కాలేదన్నమాట. ఇతడు కళ్లు మూసుకొన్నాడు! వెనుకపడిపోయాడు! అస లితని ప్రపంచమే శిథిలమైపోయింది. ఇతనిని ఉన్నచోటనే వదలిపెట్టి నూతనజీవితం హుటాహుటిగా తరుముకు వస్తున్నది. నవకవులు దీనినే ఆహ్వానిస్తున్నారు. దీనినే ఆరాధిస్తున్నారు

---

# ఆ శ

పుట్టపర్తి నారాయణాచార్యులు

ఆకాశమంతాను నేనైతే
అంతటా చుక్కలే చెక్కుతానేమో!
తీగెలన్నీ కూడ నేనైతే
అంతటా పూవులే పెంచుతానేమో!

సెలయేరు లంతాను నేనైతే
అంతటా కన్నీళ్లె చిలుకుతానేమో!
ఈలోకమంతాను నేనైతే
అంతటా నా ప్రేమ నింపుతానేమో!

---

రచయిత :
నందగోపాల సేనగుప్త

# బంగాళీకథలు

అనువాదకుడు :
యలమంచిలి వెంకటేశ్వరావు

'బంగాళీకథావాఙ్మయం' అంతపురాతనమయింది కాదు. బంకిమచంద్రుడే బంగాళీనవలాసాహిత్యం ఆరంభించినాడు. అయితే మనం ఈనాళ్లలో చూస్తున్న కథలవంటివి ఆయన రాయలేదు. బంకిమచంద్రునికంటె పూర్వం కాళీప్రసన్న సింహుడు రచించిన 'హుతోమ్ పెంచార్ నక్షా'(అంటే గుడ్లగూబవర్ణన)అనే గ్రంథంలో ఒకవిధమైన వ్యంగ్యవర్ణన వ్యంగ్యచిత్రాలు కనుపించుతాయి. దానిలో అక్కడక్కడ చేటికథలవాసనలు కనపడుతాయి. కాని అవి వాస్తవంగా కథలుకావు. కథలు రాయటం ప్రారంభమయింది రవీంద్రునివద్దనుండే. ఆయనరే వీటిని ప్రారంభించాడు. తరువాత ఆయన కలమే మానవంతులు ఈ కార్యాన్ని పూర్తిచేసింది.

మనదేశంలో వెనుకటిరోజుల్లో రూపకథలు, పశుపక్షుల ఉపకథలే చెప్పుకుంటూ ఉండేవారు. రూపకథలు అంతఃపురములోని స్త్రీల జన్మాలపైనవుంటే ఉపకథలు గ్రంథాలలోని పుటలమీద. కథాసరిత్సాగరం, పంచతంత్రం, హితోపదేశం, జాతకకథలు ఇటువంటివే. ఇతరదేశాలలోలాగే మనదేశంలో కూడ ఇప్పుడు ఇవి వెనకపడిపోయినవి. ఇప్పుడు వీటిస్థానాన్ని ఆక్రమించింది మానవుల అనుభవం — వేదనతో కూడుకున్న చిన్న చిన్న కథలు. అయితే ఈ చిన్నికథలకు ప్రాణశక్తిని కలగచేసింది ఈదేశపుమట్టి కాదు. వీటికి దోహదమిచ్చింది పాశ్చాత్యవాఙ్మయం. ఇంగ్లీషువారి అధికారంలో ఉండి ఈయుగంలో చరిత్రకి ఎక్కడలేని వస్తువు నొక దానిని మనం తయారుచేసుకున్నాం - అదినూతనవాఙ్మయం. మనప్రాచీనవాఙ్మయం అనేక శాఖోపశాఖలుగా విభక్తమైవుంది. దానికిని ఇప్పటి ప్రాంతీయభాషలలో పెరుగుతున్న వాఙ్మయానికీ ఎక్కడా దూరపుపోలిక లన్నా కనుపించవు. మనపురాతనసాహిత్యం ఎక్కువగా మతసంబంధమైంది. వస్తువు, అభినివేశం, చరిత్రచిత్రణ, రచనావిధానం అంతా మతాన్ని పురస్కరించుకునే నడిచింది. ఈదేశపు సంస్కృతి, విద్య, అనుశ్రుతి, ఆశాఖోపశాఖలు అన్నింటినీ పోషించుకుంటూ వచ్చాయి. ఎన్నో శతాబ్దాలు వస్తూపోతూ ఉన్నప్పటికీ వైచిత్ర్యవిహీనమై, పెరుగుతరుగులులేక ఒకేమార్గాన పోతూకూడ ఈవాఙ్మయధార నిరంతరం ప్రవహిస్తూ వచ్చింది. ఆంగ్లేయులపరిపాలనాకాలంలో చాలతరాలనుంచి మనరక్తంలో యిమిడిపోయిన సంస్కారములు,సంఘుకట్టడి, విద్యావిధానంలో విజాతీయభావాదర్శం వచ్చి జొరబడి, అందుకు ఫలితంగా అవి నెమ్మది నెమ్మదిగా ఒకక్రొత్తజీవితాదర్శమును మనయెదుట పెట్టినట్టే మనవాఙ్మయంలో కూడ ఎన్నో బంధనాలలో బిగించిన కృష్ణలీలాసంగీతం, శ్యామసంగీతం, గ్రామ్యసంగీతపుచరిత్రలోకూడ పాశ్చాత్యసంపర్కం ప్రళయం తెచ్చిపెట్టింది. మనదగ్గర పోగయిన సనాతనసంపత్తి ఈకల్లోలంలో పడి ఎన్నోమార్పుల పాలయి, అల్లకల్లోలమయిపోయింది. ఈకేడి కొంత చల్లారుతూన్నకొద్దీ కొత్తవాఙ్మయమూర్తి ఒకటి నిర్మింపబడుతూ న్నట్లు మనం గ్రహించాం. యథార్థంగా ఆమూర్తి మనదే. కాని అది మళ్లీ మనకు లభింస్తుందని మన మెప్పుడూ అనుకోలేదు.

నెమ్మదిగా మనజీవితం కొత్తపాతలు రెంటినీ తనలో జీర్ణించుకుంది. అందుకనే పురాతనభగ్నావశేషములు చాలవరకు సంఘశరీరంలో మిగులుగలిగాయి. కాని వాఙ్మయంలో ఈసంబంధమాత్రం పూర్తిగా తెగిపోయింది దీనికి కారణ మేమిటో తెలియదు. ఇదంతా మంచికే జరిగిందా లేక చెడుకా అన్నతర్కం అనవసరం. ఏదుర్లంఘ్యనియతి మనదేశంలో ఆంగ్లరాజ్యానికి శతాబ్దాలనుంచి పాతుకుపోవడంలో సాయపడిందో, దానిదే ఈపనికూడాను. ఈ ఆదర్శ - ఘర్షణలోనే

వంగ సాహిత్యంలో దేవీ - దేవతలకథలకు బదులు మానవులకథలు పుట్టుకు వచ్చినాయి. దేవతా మహత్తు పోయి దేశానికి మహత్తు వచ్చింది. పలువిధములైన ఆచారాలు, అనేకములు గుడ్డినమ్మకాలు, లేనిపోని భావప్రవణత — వీటివల్ల మనదేశీయవాఙ్మయం దారి మరచిపోయింది. దాని ప్రబోధం — ఆశ్రయంలో పెరగబట్టే దేశానికి హ్రస్వదృష్టి యేర్పడింది. ప్రాణహీనమయిన ఈగతానుగతికతమీద గట్టిగా దెబ్బతీసింది ఇంగ్లీషుసాహిత్యం. ఈ బయటిఆదర్శం జాతిని మానవ మాన్యతలవైపును మరల్చింది.. భారతదేశాన్ని, దాని ఆదర్శాన్ని అపురూపవుపంథలో, క్రొత్తపద్ధతితో నిర్మించాలని ప్రేరేపించింది ఆంగ్లసాహిత్యం. వంగసాహిత్యపు నవయుగచరిత్రకు బంకిమచంద్రుడు, మధుసూదనదత్తు మొదటి రెండు అధ్యాయములయి వెలిశారు.

ఇతరప్రాంతాలవాఙ్మయంవలె వంగవాఙ్మయం కూడా మొట్టమొదట ఛందోబద్ధమే. ఆంగ్లమిషనరీలు ప్రచారసౌకర్యంకొరకు వంగభాషలో గద్యరచన ప్రారంభించారు. వంగభాషలో మొట్టమొదట పత్రిక ప్రారంభించిన గౌరవంకూడా వారికే ఇవ్వవలసి వస్తుంది. పిమ్మట కొలదికాలంలోనే రామమోహనరాయ్ అవతరించాడు. ఆయనకూడ ప్రజలలో విద్యాప్రచారం, మతప్రచారంకొరకు వచనం రాయనారంభించాడు. అయిన ఆమిషనరీలూ, రామమోహనరాయిగారూ రాసినవచనం తొట్టతొలుత రాయబడిందికదా అని మెచ్చుకోవలసిందే కాని, దానికి ఎక్కువకాలం నిలువగలతాహతు లేదు. దానిలో జవసత్వములు తక్కువ. అది ఉపదేశాలకుతప్ప ఇంకెందుకూ పనికిరాదు. ఆవచనంలో వాఙ్మయం సృష్టించడం సాధ్యంకాదు. విద్యాసాగరుడు సంస్కృతంలోని లోకోక్తులు వంగభాషలోని కనుపరచి ఒక ధ్వనిబహుళమైన శైలిని సృష్టించాడు. అదేసమయంలో టేకుచందు ఠాకూరు మొదలైనవారు దేశజములయిన భాషీయములతో స్వాభావికమైన గద్యశైలిని వాఙ్మయలోకి తెచ్చారు. ఈరెండుమార్గాలను పొందుపరచి తన క్రొత్తపోకడలతో జీవశక్తిగల రచనాదర్శమును చూపినాడు బంకిమచంద్రుడు. ఈయనగద్యంలో కథాసాహిత్యానికి కుర్రతనం పోయి యౌవనం అంకురించింది. భాషలోని మొదటికూర్పులు ఈరీతిగా వెలసిన తరువాత వాఙ్మయం సాగింది. ఈనవయుగ వాఙ్మయచరిత్రకు వన్నె తెచ్చినవారిలో బంకిమచంద్రుడు ప్రప్రథముడు. అదివరకుకూడ వంగభాషలో వచనం ఉంది కాని సరియైనగద్యవాఙ్మయం లేదు. విద్యాసాగరుని రచనలు, టేకుచందు ఠాకూరు పుస్తకాలు భాషావ్యవికాసక్రమాన్ని తెలుపగలుగుతవేకాని అవి వాఙ్మయమనిపించుకోవు. బంకిమచంద్రుడు తనప్రసిద్ధగ్రంథములు రాయుటకు తొలుత కలంపట్టినప్పుడు ఆయనమనస్సు ఎంతవరకూ ఆదర్శస్థాపనకేనే చూచిందికాని, రససృష్టిప్రయోజనాన్ని అంతగా పరిగణించలేదు. దీనికి కారణం అప్పటి పరిస్థితులు. విజాతీయవిద్య, విజాతీయ ఆదర్శములను ఎక్కువగా అనుకరించడంవల్ల భారతీయులకు దిగ్భ్రమ హెచ్చినరోజులవి. వారిని సరియైన మార్గానికి తిప్పి, యథాస్థానంలోకి తీసుకురావడానికి గొప్పగొప్ప ఉన్నతభావులను స్త్రీ పురుషుల పవిత్రచరిత్రలు సృష్టించవలసివచ్చింది. ఇంతకంటె వేరుగా సూక్ష్మకళారహస్యంలోనికి దిగ వీలు లేకపోయినది. ఇది కేవలం ఆయనవిషయంలోనే కాదు; మధుసూదనదత్తు విషయంలోకూడ అంతే. అందుకనే బంకిమచంద్రుడు చిన్నచిన్న కథలు రాయడానికిగాని, మధుసూదనదత్తు గీతకావ్యాలు రాయటానికిగాని అవకాశం లేకపోయింది. దీనికి కారణం ఒకవేళ అప్పటివిద్య కావచ్చు; లేదా బంకిమచంద్రుడు స్కాట్‌ను, మధుసూదనదత్తు మిల్టనును మూనాగా పెట్టుకోబట్టే ఈ ఆదర్శమార్గం వీరికి రుచించిందేమో.

భాగ్యవశాత్తు బంకిమచంద్రుడు, మధుసూదనదత్తులయుగం అంతరించకపూర్వమే రవీంద్రుడు అవతరించాడు. రవీంద్రులు ఒక్కరే భాషకు మరియు వాఙ్మయంలోని అన్ని అంగాలకు ఒకవంద సంవత్సరములకు సరిపడ్డ ప్రాణశక్తిని కల్పించి బంగాళీల సాంస్కృతిక చరిత్రను క్రొత్తపద్ధతులతో నిర్మించారు. ఈశాఖాబహుళమైన రవీంద్రుని వాఙ్మయంలో కథలు ఒక ఖండభాగముమాత్రమే. రవీంద్రుని ఉపజ్ఞలో అవి

ఒక అప్రధానఅంగం. రవీంద్రునికున్నంతటి పటిమతో ఈ అప్రధానఅంగాన్ని ప్రత్యేకంగా యింకెవరైనా పూర్తిచేయగలిగితే వారు అంతటితోనే పూజ్యులయ్యేవారు. రవీంద్రుడు వంగభాషలోని కథావాఙ్మయానికి మొదటిసృష్టికర్త. బహుళా తా నవలంబించిన మార్గాదర్శములో ఇప్పుడుకూడా సర్వశ్రేష్ఠ కథకుడు ఆయనదే. ఆయనకథల్లోఉండే రచనావైచిత్ర్యం, శైలిసొగసు, ఆ గంభీరమైన వ్యంజనాశక్తి చూస్తే, వంగభాషలో ఆయనకు సరిపోయేచెయ్యి ఇంకొకటి లేదని చెప్పవచ్చు. వంగదేశపు ప్రకృతి, వంగవాసుల సుఖదుఃఖాలతో కూడుకున్న జీవితమే ఈ కథలకు వస్తువు. ఇందులో ఏమంత ద్వంద్వంకాని, గొప్పగొప్ప సమస్యలుగాని, బహుళమైన ఆవేదనకాని కనుపించదు. రవీంద్రునికథలు కావ్యాలలాగు స్వచ్ఛమైన సౌందర్యంతో పాఠకుని హృదయాన్ని స్పృశించుతాయి. రవీంద్రుని చిన్నకథలన్నీ కావ్యధర్మంతో మిళితమైయున్నవి. అందుకే యీ కథలలో స్త్రీ పురుషుల యొక్కగాని, లేక వారిదినచర్యలవలన కలుగు ప్రత్యక్ష ప్రాపంచిక వాస్తవిక అనుభవంగాని కనుపించక, ఒకభావనతో సృష్టింపబడిన విశ్వమానవునిముద్ర ఎక్కుడు ప్రతిబింబించింది. కనుకనే మనము యింకా కొంతకాలం, అంటే శరచ్చంద్రుడు వారి అనుయాయులకొరకు ఎదురుచూడవలసి వచ్చింది.

రవీంద్రుని నాటినుంచి, శరచ్చంద్రునినాటివరకు గల ఈమధ్యకాలంలో బంగాళీకథల్లో వేరువిధమైన క్రొత్తరచనలు ఏమీ బయలు దేర లేదు. ఒక్కవిషయంమాత్రం జరిగింది. ఈకాలంలో రచయితలు విదేశీసాహిత్యంలోనికథలను ఎక్కువగా పఠించారు; తర్జుమాలుకూడా చేశారు. దానితోపాటు అనుకరణకూడాను. మోపాసా, బాల్జక్, జోలా, గోతియే, దోదే మొదలైన ఫ్రాంసుకథకుల రచనలు నిత్యం క్రొత్తక్రొత్త ఆదర్శాలను, క్రొత్తక్రొత్త వ్యూహాలను, వీరిలో రేకెత్తించనారంభించినవి. ఈకథలు రచయితలకు రసాభినివేశంకొరకు పురికొల్పినట్లే పాఠకులలోకూడా కొత్త రుచులు కలుగజేశాయి. రవీంద్రుడు కథలు రాయటానికి పొందినప్రేరణ విదేశీయమే. పోకడలుమాత్రం పరిపూర్ణంగా ఆయనవే. మణిహార, దురాశ, కంకాళ్, పోష్టుమాష్టరు, ఖాదితపాషాణము, ఆపద మొదలైన కథల్లో ఏకథ చదివి చూచినా, ఇతరులు పొందలేని ఒక విశిష్టత ఆయనశైలిలో వుందని బోధపడుతుంది. తరువాత ఘట్టాలపొందికను, పాత్రలచరిత్రచిత్రణను, భావాభివ్యక్తిని దృష్టిలో పెట్టుకుంటే ఈకథలు ప్రపంచములోని ఏమహాకథకుని రచనలకును తీసిపోవని, ఎక్కడనైనాసరే నిర్ణయంగా తమజ్ఞాతిత్వంకొరకు పోట్లాడగలవని స్పష్టపడుతుంది. శరచ్చంద్రుడు చిన్నకథలు అరుదుగా వ్రాశాడు. కాని సంఖ్యకు కొద్దిఅయినా ఆకథలు సృష్టికర్త విశిష్టతను వెలిబుచ్చుతుంటాయి. శరచ్చంద్రుడు తనకథలలో, మనుష్యుని భావప్రపంచాన్ని, దాని ఆనుషంగికవేదనను గ్రహించలేడు. ఆయన మానవుల ఉనికిని లౌకికంగానే చిత్రించాడు — మనుష్యుని అస్తిత్వమును, మానవుడు పొందగలుహద్దులలోనే ఉంచాడు. ఆయనకు లౌకికంమీదనే ఎక్కువ మమకారం. ఈమమకారానికి ఆయన మిక్కిలి సానుభూతితో రూపమిచ్చాడు. కాని రవీంద్రునిసాహిత్యం చాలవరకు సామూహికం— సార్వత్రికం. అది భావనాప్రపంచములోనికి తీసుకుపోతుంది పాఠకుణ్ణి.

ఈ ఇద్దరితోపాటు ప్రభాతకుమార ముఖోపాధ్యాయుని పేరుకూడ స్మరించదగ్గది. ఈయనరచనలు చిన్నచిన్నవి. అయినా ఈరచనలలో రవీంద్రుని రచనలలోనున్నటువంటి భావగాంభీర్యంకాని, శరచ్చంద్రుని రచనలలోనున్నటువంటి మానవ-కేంద్రీకృతమయిన అనుభూతికాని కనుపించవు. ఈయనకథలు ఔత్సుక్య ప్రధానమైనవి. ఆదృష్టితోనే ఈరచనలు రంజింపగలుగుతాయి. కాని మొత్తంమీద ఇవి యంత్రనిర్మితంగా కనపడుతాయి. ఈయన రెండుమూడుకథలలో ఏదో ఒక క్రొత్త ధోరణికూడ కనపడుతుంది. ఇంగ్లాండు వెళ్లేభారతీయులకు అచ్చటి ఆంగ్లేయులజీవిత భావసంపర్కంవల్ల కలిగేమార్పులను గురించీ, మానసికంగా పరస్పరం గ్రహించే జ్ఞానమును గురించీ ఈయన 'దేశీయ విలాతీ'లో తెలిపిన కొన్ని విషయాలు నిజంగా మహత్తరమైనవి. ప్రభాతకుమారునిరచనాశైలి, విన్యాసకౌశలం చాలవరకు రవీంద్రునిపద్ధతినే ఉంటుంది. ౧౯-వ శతాబ్దంలో బం

గాల్పికథలు ఈముగ్గురితోనే వృద్ధిపొందినాయి. ఈముగ్గురు తమకథలలో చిత్రించినది మధ్యవర్గంవారి జీవితాన్ని. మధ్యవర్గంవారికి ఒకప్పుడు కొంచెం సుఖం లభించినా దానితోపాటు వారు అనుభవించిన దుఃఖాలకు కూడ అంతులేదు. తదుపరి వచ్చేది దరిద్రవర్గం. ఈవర్గానికి వీరివాఙ్మయంలో ఎక్కువ తావు లేదు. శరచ్చంద్రుని రచనలు ఇటుకూడ కొంతమాపు మరల్చినయి, కాని ఇది చాలా స్వల్పం. కనుకనే ఈకథలలో చిత్రింపబడిన విషయాలు విరోధానికి ఎక్కువతావీయవు; అంటే వీరు బూర్జువాసంప్రదాయానికి చెందిన రచయితలన్నమాట. వీరందరు గోర్కీ ఛెహోవ్ ఆదర్శవాదులు కావటానికి కారణంకూడ ఇదే. శరచ్చంద్రుడుమాత్రం తాను చనిపోయేముందు దరిద్రవర్గంవైపుకు దృష్టి మరల్చ ప్రయత్నించాడు. ఆయన 'మహేశ్' అనుపేరుపొందినకథ యిందుకు నిదర్శనం. వీరితరువాత ఆధునికయుగం ప్రారంభ మవుతుంది. ఈయుగంలో అసామాన్యమైన శక్తి గల అయిదుగురు రచయితలు మనకు కనపడుతున్నారు. వీరంతా రవీంద్ర, శరచ్చంద్రులను అర్థంలేకుండా అనుకరించేరకం కారు.

ఈశతాబ్దప్రారంభంలో జరిగిన మహాయుద్ధం ప్రపంచ ఆర్థిక సాంఘికపు పునాదులను మొదలంట కదిపివేసినట్లే, పరంపరాగతమైన మనోభావాలను కూడా తారుమారుచేసింది. అంతకుపూర్వం యింతవిప్లవం ఎప్పుడూ రాలేదు. ఈతారుమారులకు ఫలితంగా ప్రతివిషయానికీ స్వతంత్రవాదం పుట్టుకువచ్చింది. పాతకాలమునుంచి గురువు — పురోహితుల ఆజ్ఞలే ఆదర్శంగా పెట్టుకున్న సంఘం వారిని నిరాకరించివేసింది. చాలకాలమునుండి ఆచరింపుతూవచ్చిన జీవితధార, అంటే విశ్వాసాలు నశించాయి. దానిప్రయోజనాన్ని గురించికూడా సందేహాలు కలిగినయి. ఈవిపర్యయానికి ఫలితంగా మానసికజగత్తునుంచి మనోవిజ్ఞానం ఉద్భవించింది. ఈమనోవిజ్ఞానం శిల్పం, నాగరికత, ప్రేమ, మనుష్యత్వం మొదలగు మూలసూత్రాలను విమర్శించి వాటినిజస్వరూపాలను మనయెదుట పెట్టింది. అప్పటినుంచే ఎన్నాళ్లనుంచో, మనలో పాతుకుపోయిన మతవిశ్వాసాలు, రసతృష్ణ అంటే మనకు సందేహము కలిగింది. దీనితోపాటు యంత్రవిజ్ఞానంకూడ అంతులేకుండ పెరిగిపోయింది. ఇప్పు డనాయాసముగా ప్రకృతిని జయించగల మనవిశ్వాసం పొడమింది. అందువల్లనే అలక్ష్యశక్తులయందు విశ్వాసముంచే మానవుడు ఇప్పుడు తర్కసమ్మతం, విజ్ఞానసమ్మతమైన ప్రత్యక్షజ్ఞానాన్నే నమ్ముతానంటున్నాడు.

ఈకొత్తవాతావరణములోనే ఆధునికవాఙ్మయం పెరిగింది. అందుకనే చాలకాలమునుంచి వచ్చేపాత తోవలను సహజంగా వదలివేసి అది సంపూర్ణస్వతంత్రం పొందింది. ఈ స్వేచ్ఛయే పాతకట్టడాలను తునియలు చేసి వైచింది. దానికిబదులు అది సృష్టించిన నవ్యపదార్థాల్లో మూడు ముఖ్యమైనవి. అందులో మొదటిది — సంఘం లేక రాష్ట్రం పట్ల జరిగిన విప్లవము. రెండవది — దయ, మాయ, ప్రేమ, ప్రతిభ మొదలైన మనోవృత్తులనుగురించి సూక్ష్మాతిసూక్ష్మంగా విమర్శించే విమర్శ. ఇంక మూడవది — రాత్రింబగళ్లు అవమానింపబడి పీడింపబడే వ్యక్తులనుగురించిన ఆందోళన. ఈ ఆర్థికనే కేంద్రబిందువుగా పెట్టుకొని చిటికథలు, నవలలు, నాటకములు, కవిత్వం అన్నీ సృష్టి అవుతున్నాయి. యుగధర్మానిబట్టి ప్రస్తుతము చిన్నకథలే ఎక్కువ విరివిగా పొంగిపోతున్నాయి. అందుకని కథల్లోనే కొత్తవాసనలు ఎక్కువ లభించుతాయి. ఈ కొత్తదనంమీద రెండు దోషాలు ఆరోపిస్తున్నారు — ఒకటి అశ్రద్ధ, రెండు అశ్లీలత. నిజంగా యీ రెంటికీ మూల మొకటే. నిజాన్ని అకుంఠితరూపంలో నిర్మమభావముతో నైర్వ్యక్తికంగా వ్యక్తపరచవలసివచ్చినపుడు మన పూర్వాచారాలకు దెబ్బతగలకుండ ఉండదనే మా నమ్మకము. అందుకని కొత్తను చూచి గాబరాపడటము మంచిదికాదు.

## 3

మన ఈయుగపుకథల్లో స్త్రీ పురుషుల ప్రేమకు సంబంధించిన విషయాలే ఎక్కువ కనబడుతున్నాయి. ఇంతే కాదు. అసాధారణమైన మనస్తత్వంపట్లకూడ వీరు అభిరుచి చూపుతున్నారు. ఒకప్పుడు మనస్సులోకి రావటమే పాప మనుకున్న విషయాలనుగురించి కూడ చిటికథకులు నిర్భయంగా రాసేస్తున్నారు. తల్లిదండ్రులసంపర్కం, పేదలు భాగ్యవంతులసంపర్కం,

అన్నచెల్లెళ్లసంపర్కం, రాజు - ప్రజలసంపర్కం — మొదలైనవి ఇటువంటివే. వీటిని గురించి నేటిలేఖకులు చాల తీవ్రదృష్టితో ఆలోచిస్తున్నారు. ఒకప్పుడు కామశాస్త్రం, ఒకప్పుడు సమాజవిజ్ఞానం, ఇంకొకప్పుడు రాష్ట్రవిజ్ఞానాన్ని దృష్టిపథాన నిలిపి ఈదిరాభ్యస్త విషయాలను వాఙ్మయంలో పరీక్షిస్తుంటారు. ఇందువల్ల ఒక నవీనశక్తి మనకు దృగ్గోచర మయింది. శైలజానందముఖోపాధ్యాయ్, ప్రేమచంద్రమిత్ర, విభూతిభూషణబంద్యోపాధ్యాయ్, ప్రబోధకుమార సన్యాల్, జగదీశగుప్త, — ఈఅయిదుగురు కథకులు రచించిన వేరువేరు తీరుల కథలద్వారా నవజాగృత యుగవాణి వినిపిస్తుంది. ఇందులో మొదటి ఇద్దరు నిజంగా గొప్పవాఙ్మయస్రష్టలు. మిగిలినవారు చాలా వరకు పాతమార్గాన్నే అనుసరిస్తున్నారు. అందుకని విషయవిన్యాసము, భాషాదృష్టితో వీరిరచనల్లో కొంతవరకు రవీంద్రుడు కనిపిస్తున్నప్పటికీ వీరి వ్యక్తిత్వంకూడ చక్కగా పరిస్ఫుటరూపాన్ని పొందిందనే చెప్పవచ్చు.

ఈయుగంలో వస్తున్నకథల్లో ఏవిధమైన అనూహ్యమైన ఉత్కర్ష కనపడుతోందో, దానికి తగినరుచి-విశాలసంగల పఠితలుకూడ తయారైనారు. 'నేటి బహుకార్యవ్యాప్తత దీర్ఘమైన నాట్యాభినయాలకు అవకాశమిచ్చుటలేదు. అందుకనే సినీమాలు ఇంత విరివిగా వ్యాపించినాయి. పెద్దపెద్దనవలలు చదవలేము. అందుకనే చిన్నకథలకు ఇంతగౌరవం దక్కుతోంది' అని చెప్పే వారిమాటలలో కొంత సత్యం లేకపోలేదు. అందుకనే స్రవాట్టుల హుక్కాలకు బదులు సిగరెట్లు వచ్చాయి. ఎడ్లబండ్లకు బదులు విమానాలు వ్యాప్తిచెందాయి. ఇవన్నీ యుగధర్మాన్ని సూచిస్తున్నాయి. కాని దీనితో పాటు పఠితలఅభిరుచికూడ మారిపోయిందని చెప్పకపోలే వీలులేదు. చిన్నకథల రచనాకౌశలం చూపి పఠితృహృదయాలకు రసోపలబ్ధిని కలిగించేటట్టు కథలు వ్రాయడం తేలికపని కాదు; ఏమంటే చిన్నకథలలో ప్రతివిషయం క్లుప్తంగా, సాంకేతికంగానే చెప్పవలసి వస్తుంది. వాటిలో సమగ్రత తీసుకురావటానికి అవకాశం ఉండదు. చిన్నకథల్లో ఏదైనా ఒకఘట్టంకానీ, సంభాషణకానీ, చరిత్రవిషయంకానీ - వీటిలో దేనినిగాని సమగ్రంగా చిత్రించ వీలుండదు. ఒకఖండభాగం మాత్రమే చిత్రించ వీలుంటుంది. కథలో చూపించే విషయాన్ని మనం వేరుగా ఇంకా చూడ దలచుకుంటే దానికి ముందు కొంతభాగం మిగిలే ఉంటుంది. ఏమధ్యనుంచో ఒకతుంపుమాత్రమే కథకుడు తీసుకుంటాడు. మెరుపులోని జ్యోతివలె ఒకముహూర్తఖండం, లేక వృత్తి, లేక ప్రశ్న, లేక తనపరిసరప్రాంతాన్ని క్షణంసేపు ప్రకాశవంతం చేసి అంధకారంలో విలీన మయిపోతుంది. కొంచెంసేపు కనిపించేదృశ్యం పరిపూర్ణం ఎప్పుడూ కానేరదు. కాని దానిపరిచయం ఆకథలోనే కొద్దిగా ఇమిడి ఉంటుంది. అంతకుమించిన మిగిలిన విషయాన్ని పఠితలు తా మూహించుకోవాలి. నవలలో ఇదేమీ ఉండదు. కథలలో ఈ కొద్దిపరిధిలోనే కథకుడు తనభావాన్నంతటినీ దాచిఉంచుతాడు. తనసమస్తయోచనను నేర్పుతో పొందుపరచి వదులుతాడు. అందుకనే శిల్పం లేక రచనాకౌశలం గలిగి చిన్నకథలలో అనేకవిషయాలు క్రిక్కిరిసి ఉంటాయి. ఇటువంటి కథలు జనాదరణ పొందినవి కనుకనే జనులరసబుద్ధి సంస్కరింపబడుతోం దని చెప్పవలసివస్తోంది.

ఇంక మిగిలింది ఒక్కమాట. బంగాలీకథలు పుట్టిందిలగాయతు ఇప్పటివరకు ఉన్నకథకులను విమర్శించటం ఈచిన్నివ్యాసంలో కానిపని. ఈవ్యాసంలో అందరినీ విమర్శింపబూనటంకూడ వ్యర్థమే. బంగాలీ గద్యం పుట్టుక, దానిప్రచారమార్గం - వీటిలో ఈకథావాఙ్మయం ఎంతఅభివృద్ధి పొందిందో ఎవరెవరు ఆక్రమ-పరిణతి—మార్గంలో ఎక్కువ సాయపడినారో సూచించటమే దీనిఉద్దేశం. పఠితల సౌకర్యంకొరకు దానితో పాటు కొంత సాంఘికచర్చకూడ చేయవలసివచ్చింది. యుగప్రవాహమును గుర్తించుటకు ఇది అనవసరంకాదు; ఎందుకంటే లేఖకుడు ఎంత శక్తిశాలి యైనప్పటికీ కాస్తోకూస్తో యుగవాసన అతనిలో అంకురించకపో

# ఆర్యభట్టుడు

పిడపర్తి సుబ్బయ్యశాస్త్రి

౧

అన్ని విషయాల్లోనూకూడా అద్వితీయుల గన్నతల్లి భారతమాత. సాహిత్యవీధిని కాళిదాసు చూపిన తెలివి, రాజనీతిశాస్త్రంలో చాణుక్యుడు చూపిన ప్రజ్ఞ, ఆర్యభట్టుడు జ్యోతిశ్శాస్త్రంలో చూపిన ధీశక్తికి చాలవనే చెప్పొచ్చు. ఆతని స్వీయచరిత్ర కొంతవర కాతనిగ్రంథాలనుండి గ్రహించవచ్చు. ఈతడు బ్రాహ్మణకుటుంబానికి చెందినవాడు. గోత్రంమాత్రం తెలియడంలేదు. ఇప్పటి పాట్నానగరానికి సమీపాన్నున్న కుసుమపురంలోనే యీతడు జన్మించేడు. కొంద రీతడు మలబారు ప్రాంతీయుడనికూడా అంటారు. ఈతనికుమారుని పేరు దేవరాజు.

ఈతని పేరులో "ట" కారద్వయంలేదనీ, ఆర్యభటు డనే నామమే సరియైన దనీ, ఒక వాద ముంది. దీనినే సుధాకరద్వివేది గణకతరంగిణి అనేగ్రంథంలో విపులంగా చర్చించేడు. అదంతా మన కిప్పుడు అప్రస్తుతం.

ఆర్యభట్టుని కాలాన్నిగురించి వాదోపవాదాల కంతగా పీలులేకపోయింది. ఆతని గ్రంథాలనుబట్టే క్రీ. శ. ౪౯౯ సంవత్సరం ప్రాంతాల్లోనే అత డుండియున్నా డని స్థిరపడుతుంది. ఒక్క ఆంగ్లేయగ్రంథంలోమాత్రమితడు క్రీ. శ. ౧౩౨౨ ప్రాంతంలోనివాడని వ్రాయబడింది కాని ఆమాట కంతగా విలువనివ్వడాని కాధారాలు లేవు. క్రీస్తుతర్వాత ఐదవశతాబ్దంలోనే ఆర్యభట్టుడు గ్రంథాలను వ్రాసేడన్న వాదాన్ని ఈ క్రింద పొందుపరుస్తా.

ఆర్యభట్టుని సిద్ధాంతాలను బట్టీన్నీ, ఆతనిగ్రంథాల్లోని నక్షత్రగ్రహస్థానాల్నిబట్టీన్నీ శాస్త్రజ్ఞు లార్యభట్టునికాలాన్ని నిర్ణయించేరు. ఆచర్చంతాకూడా అర్థంచేసుకోడానికి చాలాశాస్త్రజ్ఞాన మవసరం. అందువల్ల దాన్ని ఇక్కడ వ్రాయదలచుకోలేదు. అదిగాక మిగిలినవిషయా లింకా రెండుమూడుదాహరిస్తాను. ఆర్యభట్టు డాతనిగ్రంథాల్లో శాలివాహనశకాన్నిగాని, విక్రమాదిత్యశకాన్నిగాని ఉపయోగించలేదు. ఎంతసేపైనా యుధిష్ఠిరయుగాన్నే చెప్పేడు. అందువల్ల, మనం గ్రహించవలసింది, ఈ యుధిష్ఠిరయుగం వాడుకలో నున్నప్పుడే యీతడుండేవాడని. అతనికాలంనాటి కింకా శాలివాహన విక్రమాదిత్యశకాలు వాడుకలోనికి రాలే దన్నమాట. వరాహమిహిరుడు తన గ్రంథాల్లో శకభూపకాలమనీ, శకేంద్రకాలమనీ ఉపయోగించేడు. ఇదే విక్రమాదిత్యశకమని భట్టోత్పలు డన్నాడు. ఈశకం కలియుగంలో ౩౧౭౯ సంవత్సరా లైపోయేక మొదలయింది. భాస్కరుడుకూడ తన సిద్ధాంతగ్రంథాల్లో శకనృపసమయమని ఉప

యోగించేడు. ఇదే శాలివాహనశక మని పెద్దలు చెబుతారు. కలియుగంలో ౩౧౭౯ సంవత్సరా లైపోయేక ఇది మొదలుపెట్ట బడింది. ఈ రెండుశకాలూకూడా వాడుక లోనికి ఎప్పుడు వచ్చేయీ అన్న విషయం చెప్పడం కొంచెం కష్టం. కాని ఇవి రెండూ కూడా వాడుకలోనికి రాకపూర్వమే ఆర్య భట్టుడు జన్మించియుండాలని స్థిరపడుతుంది. ఏది ఎల్లా ఉన్నా, ఆర్యభట్టుడు బ్రహ్మ గుప్తునికి పూర్వుడు. అనేకవందలసార్లు బ్రహ్మ గుప్తు డాతనినామాన్ని ఉదాహరించేడు. వరాహమిహిరునికన్నా కూడ పూర్వు డన డాని కాధారా లున్నాయి; ఎందుచేతంటే, వరాహమిహిరుని గ్రంథాలు శ్రీసేనుని రోమకసిద్ధాంతంమీదా, విష్ణుచంద్రుని వశిష్ఠ సిద్ధాంతంమీదా ఆధారపడిఉన్నాయి. ఈపై రెండుసిద్ధాంతాలూకూడా చాలా భాగం ఆర్యభట్టునిసిద్ధాంతాల నాధారం చేసుకుని వ్రాయబడ్డవేనని బ్రహ్మగుప్తుడు సూచించేడు. కాబట్టి ఆర్యభట్టుడు వరాహమిహిరునికికూడా పూర్వు డన్నమాట మనం నమ్మవచ్చు. ఈపై విషయాలనుబట్టి ఆర్యభట్టుడు బ్రహ్మగుప్తునికీ, వరాహమిహిరునికీకూడా పూర్వు డన్నమాట స్థిరమైనదిగా తీసుకోవచ్చు. బ్రహ్మగుప్తుడు శాలివాహనశకంలో ఆరవశతాబ్దానికి చెందినవాడు. వరాహమిహిరు లిద్దరున్నారు. రెండవశతాబ్దంలో నొకడూ, ఐదవశతాబ్దంలో నొకడూను. ఈ రెండవ వరాహమిహిరునికి పూర్వులైన విష్ణుచంద్ర శ్రీసేన దుర్గసింహులకుకూడ ఆర్యభట్టుడు పూర్వుడు.

ఈ పైవిషయా లన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆర్యభట్టుడు నిస్సందేహంగా శాలివాహనశకం ఐదవశతాబ్దానికి కొన్ని సంవత్సరాలు ముందుగానే ఉన్నా డన్న నిర్ధారణకు రావచ్చు. ఈ విక్రమాదిత్య శాలివాహన శకాలు వాడుకలోనికి రాకపూర్వమనికూడా చెప్పగలం. దీన్నే కోల్ బ్రూక్కుగారు ఈ క్రిందిమాటల్లో సంగ్రహంగా తేల్చేరు.

"ఆర్యభట్టుడు క్రీస్తుశకము ఆరవశతాబ్దానికి కొన్నియేండ్లు ముందుగనే ఉండేవాడు. బహుశా, అతడు క్రీస్తుశకానికి కొంచెం ముందుగానో, పోనైతే, దాని మొదటనో ఉండియుండవచ్చును. ఈహద్దుల్లో మూడూ లేక నాల్గోశతాబ్దమును మధ్యకాలంగా అనుకోవచ్చును. కాని, క్రీస్తు తర్వాత ఐదోశతాబ్దాన్ని మన మాతనికాలంగా నిర్ణయించుకోవచ్చును."[1]

ఇంకా సూక్ష్మంగా చర్చిస్తే ఆర్యభట్టుడు క్రీ. శ. ౪౭౬ లో జన్మించేడనీ, ఆర్యభట్టీయమనేగ్రంథాన్ని ౪౯౯ లో వ్రాసేడనీ స్థిరపడుతుంది.

౨

ఆర్యభట్టుడు చిన్నప్పటినుండీ కూడా జ్యోతిశ్శాస్త్రంలో కృషిసల్పడానికి చాలా ఆశపడుతూనే ఉండేవాడు. గొప్పవారి లక్ష

1. "... he (Aryabhatta) flourished some ages before the 6th century of the Christian era, and perhaps lived before, or at the latest, soon after its commencement. Between these limits, either the third or the 4th century might be assumed as a middle term. We shall, however, take the 5th of Christ, as the latest period to which Aryabhatta can, on the most moderate assumption, be referred.

ణమే అది. ఎప్పుడూకూడా ఆకాశంవైపు చూస్తూ కంటికి కన్పడినవాటికీ, అప్పటికి ఉన్నట్టి సిద్ధాంతాలవలని ఫలితాలకీ గల వ్యత్యాసాన్ని గుర్తించి, చాలా విచారించి దేవునిగూర్చి తపస్సుచేసేడట. దానిఫలితమే దశగీతిక అనే చిన్నగ్రంథం. ఈతని ఆర్య భట్టీయమనే గ్రంథంలోని భాగాలు రెండు-దశగీతిక, ఆర్యాష్టోత్తరశతము. మొదటిభాగమైన దశగీతికలో పదమూడేశ్లోకా లున్నాయి. ప్రారంభంలోని ప్రార్థనశ్లోకం, సమాప్తమునందలి స్వస్తివాక్యం తీసేసి, సాంకేతిక పదాల్ని పరిచయంకలిగించే శ్లోకాన్నికూడా వదిలేస్తే, మిగిలినవి పదిశ్లోకాలు. ఈపదిన్నీ వ్యాకరణ సూత్రాలను పాటించకుండా వ్రాయబడ్డవి. ఈగ్రంథంలో చిన్నచిన్న సూత్రాల్లో గూఢంగా అనంతమైన శాస్త్ర జ్ఞానాన్ని ఇమిడ్చిపెట్టేడు. కనుకనే వాఖ్యానకారులు లేకుండా అర్థంచేసుకోడమనేది ఎంతవారికైనా ఈరోజుల్లో దుస్సాధ్యమే. గణితపాదం, కాలక్రియపాదం, గోలార్థప్రకాశిక అనేవి మూడూ రెండవభాగమైన ఆర్యాష్టోత్తరశతంలోని ప్రకరణాలు. ఆర్య భట్టునిగ్రంథాలకు వ్యాఖ్యానకారులు చాల మం దున్నారు. వారిలో ముఖ్యులు దశగీతి ప్రకాశిక రాసిన సూర్యదేవదీక్షితుడు, కేరళ దేశస్థుడైన నీలకంఠసోమయాజిన్నీ. ఐదవ శతాబ్దంలోని ఆర్యభట్టునిసిద్ధాంతాలు, ఆధునిక పాశ్చాత్యశాస్త్రజ్ఞులు అనేకయంత్రాల సహాయంవల్ల అధికపరిశ్రమానంతరం చేసిన నిశ్చయాల కేమాత్రం దగ్గిరగా ఉన్నాయో యీక్రింద సూచిస్తా.

మనపూర్వుల ఉద్దేశంలో భూమి గుండ్రంగా ఉండా, చదునుగా ఉండా అన్న ప్రశ్న కసలు తావే లేదు. "భూగోళః" అనే మాట మనకు చాలా తరుచుగా పూర్వ గ్రంథాల్లో కన్పడుతుంది. ఆర్యభట్టుడు కూడా "భూగోళః సర్వతోవృత్తః" అని వ్రాసేడు. భూగోళ మనే మాటలో ఇమిడివుంది భూమియొక్క వర్తులత్వం (Sphericity). భూభారాన్ని వహిస్తున్న శేషుణ్ని కాని, ఏనుగులనుకాని చెప్పకుండా ఆర్య భట్టుడు, భూమి నక్షత్రగోళానికి మధ్యగా నిరాధారంగా ఉం దని చెప్పేడు.

భూభ్రమణం, అనగా భూమి ఒకచోట స్థిరంగా లేక, తనంట తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతోం దన్నవిషయం మన పూర్వు లెరగరనీ, నూతనంగా హూణ విద్యాభ్యాసంవలన మనహిందువులు గ్రహించిన మహత్తర విషయాల్లో యి దొకటనీ చాలామంది అభిప్రాయం. దీనికి కారణం హూణవిద్యాసంపర్కం లేని పండితు లిప్పటికికూడా భూమి తిరుగుతోం దన్న విషయాన్ని నమ్మకపోవుటయే. కాని ఈవిషయం మన పూర్వులకు తెలియకపోలే దని చెప్పడానికి ఆర్యభట్టుని గ్రంథాలే ఆధారం.

ఇది ఈక్రింది శ్లోకాన్ని చిత్తగిస్తే విశదమౌతుంది.

" భపంజరః స్థిరో భూరేవావృత్యావృత్య
ప్రాతిదైవసికౌ ఉదయాస్తమయౌ సంపాదయతి
నక్షత్రగ్రహాణాం "

(నక్షత్రగోళం స్థిరంగా ఉంది. ఈ భూమే తిరుగుతూ నక్షత్రాలయొక్క గ్రహాలయొక్క ఉదయాస్తమయాల్ని కలగచేస్తోంది.)

కాని యీ సిద్ధాంత మప్పటి ప్రజాభిప్రాయానికిన్నీ ప్రాచీన సిద్ధాంతాలకున్నూ

వ్యతిరేకంగా ఉండడంచేత భయపడో, లేక ఊరికే గణితాని కనుకూలంగా ఉండే కొరకో, ఎందుకోగాని వెంటనే మళ్లీ భూమి తిరక్కుండా మధ్య నుండనీ, నక్షత్రాలూ, గ్రహాలూ భూమిచుట్టూ తిరుగుతున్నా యనీ వ్రాసేడు. ఆర్యభట్టునిభూభ్రమణ సిద్ధాంత మారోజుల్లోనే బ్రహ్మగుప్తునిచే ఆక్షేపింపబడింది.

"ప్రాణేనైతి కలాం భూర్యది తర్హి కుతో వ్రజే త్కమధ్వానం, ఆవర్తన మర్వ్యాశ్చే న్న పతంతి సము చ్ఛ్రియాః కస్మాత్."

(భూమి ఒక్క ప్రాణంలో ఒకకల కనక కదలినట్లైతే, ఎక్కడికి వెడుతోంది? ఏ మార్గాన వెడుతోంది? అది తిరుగు తోంటే ఎత్తైన వస్తువులు పడిపో వెందు చేత?)

ఇవన్నీ యిప్పటికికూడా కొంతమంది పండితులు ప్రయోగిస్తూంటారు. కాని, యీ ఆక్షేపణలను బ్రహ్మగుప్తుని భాష్యకారుడగు ప్రీతూదకస్వామి ఖండిస్తూ, ఆర్యభట్టుని సూత్రాన్నే సమర్థించేడు. కాబట్టి భూభ్రమణం తెలిసినవారూ, ఒప్పుకున్నవారూ కూడా మనపూర్వుల్లో ఉన్నారు; ఈజ్ఞాన మంతా యీమధ్యే మన దేశంలోనికి పాశ్చాత్యమేధావులచే తేబడిం దని నమ్మడానికి వీల్లేదు. ఆర్యభట్టుని కీజ్ఞాన మెక్కడిది అన్న ప్రశ్న నిప్పుడు మనం చర్చించలేము. గ్రీసులో పైతాగరసు భూభ్రమణాన్ని రహస్యంగా శిష్యులకు చెప్పేడనీ, అతనిశిష్యులే, పాశ్చాత్యదేశంలో ఈ విషయాన్ని ప్రకటించేరనీ చెపుతారు. సిరక్యూస్‌నందలి నిసిటాస్ అనునాతడు, సూర్యునిచుట్టూ భూమి తిరుగుతోం దన్నసిద్ధాంతాన్నీ, పైతాగరసు శిష్యుడైన ఎక్ఫాన్టసు అనునాతడు, భూమి తనచుట్టు తాను తిరుగుతోం దన్న సిద్ధాంతాన్నీ ప్రకటించేరని చెపుతున్నారు.

భూమిమొదలగు గ్రహాలయొక్క గతి పూర్తిమైనవృత్తంలో లేదనీ దీర్ఘవృత్తంగా (elliptical) ఉందనీ తెలియజేసినవారిలో మొదటిపేర్కొందగినవాడు ఆర్యభట్టుడే.

సూర్య చంద్రగ్రహణాలకి కారణంగా చెప్పబడే రాహు కేతువులకథల్ని గ్రహించక ఆర్యభట్టుడు, చంద్రుడు భూచ్ఛాయ లోనికి వెళ్లినప్పుడే చంద్రగ్రహణం కలుగుతోంది అన్న విషయాన్నికూడా తెలియపర్చేడు. ఇదీగాక, యీచంద్రుడూ మొదలయినగ్రహాలు స్వయంప్రకాశములు కావనీ, సూర్యకాంతివల్లనే ప్రకాశిస్తున్నా యనీ చెప్పినవాడుకూడ ఆర్యభట్టుడే కాని నక్షత్రాలనికూడా వాటితోనే చేర్చేడు.

భూమి కాకర్షణశక్తి కలదని, అన్ని మాటల్లో చెప్పకపోయినా, అతనికావిషయం తెలిసున్నట్లుగా రెండుమూడుచోట్ల, ఆశక్తిని గురించి అతడు చేసినసూచనలవల్ల ఊహించవచ్చునని కొంద రంటారు. భాస్కరుడు మాత్రం ఆకర్షణశక్తి అనేపదాన్నే వాడేడు. ఇప్పటి గురుత్వాకర్షణశక్తి (Gravitational attraction) కి సరియైన దన్నమాట.

భూమిచుట్టుకొలత, వ్యాసమూ మొదలైనవి, ఆర్యభట్టు డిచ్చినకొలతలకున్నూ, యిప్పటి నవీనశాస్త్రజ్ఞుల పరిశ్రమలఫలితంగా తేలిన పరిమాణాలకున్నూ అట్టే వ్యత్యాసం కన్పడటం లేదు. ఆర్యభట్టుని లెక్కప్రకారం భూమిక్షేత్రం (area) ౧౫౭, ౮౨౮, ౨౮౭౩ చతురపుమైళ్లు. ఇప్పటి పాశ్చాత్యు లిచ్చిన

సంఖ్య ౧౯౭,౦౦౦,౦౦౦ చ. మైళ్లు. భూమి వ్యాసం ఆర్యభట్టు డిచ్చినలెక్క-ప్రకారం ౧౦౫౦ యోజనాలు. యోజన మనగా ౭.౬ మైళ్లు. కాబట్టి ౧౦౫౦ యోజనాలూ ౭౯౮౦ మైళ్లకు సమానం. ఇప్పటిపరిశోధనల ప్రకారం భూవ్యాసం ౭౯౧౮ మైళ్లు. భూవాయువుయొక్క మొత్తు ఆర్యభట్టు డిచ్చినలెక్క ప్రకారం ౧౫ యోజనాలు; అనగా సుమారు ౧౧౪ మైళ్లు.

అయనచలన మనేవిషయము (Precession of the equinoxes), ఆర్యభట్టుని జ్యోతిశ్శాస్త్రజ్ఞుల్లో శిరోమణిగా పూజింపబడతగినగౌరవాన్ని ఇస్తోంది. దాన్నిగురించి విపులంగా వేరే చర్చించాలి.

ఈ పై విషయా లన్నీ గమనిస్తే, మన పూర్వుల కిన్ని విషయాలు తెలియునా అని కొంతమంది ఆశ్చర్యపడవచ్చును. కొంత మందిమాత్రం మనపూర్వులీ సిద్ధాంతాలన్నీ స్వశక్తివలన గ్రహించినవికావనీ, ఆర్యభట్టుని సిద్ధాంతా లన్నీ గ్రీకులయొద్దనుండి గ్రహింపబడ్డవనీ అన్నారు. కాని ఈమాటకు సరియైన నిర్ధారణ లేమీ లేవు. ఇ దొకరకం వాదము. ఇం కొక రకం వాద మేమిటంటే, యీ పాశ్చాత్యులు చెప్పే వన్నీ కూడా మన పూర్వశాస్త్రాల్లోవేననీ, మన గ్రంథాలన్నీ వారు పట్టుకుపోయి, మనల్ని చేత కాని వాళ్లను చేసి, అవే మళ్లీ వారి స్వయం కృషియొక్క ఫలితాలుగా మన కిస్తున్నారనీను. కాని ఇందుకుకూడా సరియైన ఆధారాలు లేవు. ఈ రెండు వాదాలూ రెండు చివర్లూను.

ఏది యెల్లా ఉన్నా, ఎవ రే మనుకున్నా, ఆర్యభట్టుడు ప్రపంచంలోని గొప్ప శాస్త్రజ్ఞుల్లో యెవరికీ తీసిపోడు. ఐతేనేమి, మన దేశీయు డైపోవడంచేత అంతప్రాముఖ్యం లేకపోయిం దతనికి ఇతర దేశాల్లో. మన దేశౌన్నత్యంకొరకూ, మన దేశ ప్రాముఖ్యం కొరకూ, పాటుపడాలన్న ఉద్దేశం ప్రజల్లో కలిగిన యీరోజుల్లో యిల్లాంటి ప్రసిద్ధపురుషులజీవితాలూ, ఆదర్శాలూ ప్రకటిత మవడం మిక్కిలి అవసరం. నాయీచిన్న వ్యాసమల్లాంటిలోటు తీరుస్తుం దని నే ననుకోడం చాలా దుడుకుతనమే. కాని, ఈవ్యాస మా మేధానిధియగు ఆర్యభట్టునిగురించీ, తత్తుల్యులగురించీ, యెక్కువపరిశ్రమకు ఉత్సుకత కలిగిస్తుందేమోనని నా ఆశ. ఈ విషయమై చక్కగా సంస్కృతాంగ్ల భాషల పరిచయం కలిగిన జ్యోతిశ్శాస్త్రజ్ఞులలో నొకరైనను, ఒక్క వ్యాసానైనా ప్రచురిస్తే నా ఆశయం కొనసాగినట్లే.

# ఆకాంక్ష

పులివర్తి శరభాచార్యులు.

సమ్మెబండలు కళాస్వామి శీర్షము పైన
దొరలిన విసపుం బ్రొద్దులు గతించె,
శ్రామికాతత కృషివ్రతము దొరగిలంగ
బుధులదృక్కుల సానుభూతి యొలికె,
అఖిల భూతలము సస్యశ్యామలము జేయు
రైతుపై జగతి ఆర్ద్రమతియయ్యె,
పెనుచీకటుల మునింగిన నిమ్నకులహృదా
కాశ మభ్యుదయరాగములు గ్రక్కె,

కాలఘాతముల కదరి కదలిపోయి,
వ్రయ్యలైన పూర్వాంధ్రసామ్రాజ్యఖండ
ములు, పరాధీనములు, పృథక్కులికం గలిసి
ఒకపతాకము నీడలో ఒదుగకున్నె !

రససిద్ధుండై కవిబ్రహ్మ తీరిచిచన్న
భారతభాగ్యరూపములు పొడమి,
శిల్పితేజము కళాజీవరేఖలుగ ని
ల్చిన ప్రాక్తనాలయశ్రీలు పొంగి,
వీరాత్మ విజయగంభీర శంఖధ్వని
నభము మార్ర్మోగి దీర్ణమయిపోయి,
అమృతసూత్రములు బ్రహ్మానందబంధమ్ము
లార్షమంత్రములు మహస్సు చిమ్మ,

ఈమహాంధ్రము మఱల నూహింపరాని
ఏయశస్సో గడించుట ఈశ్వరేచ్ఛ;
కాలమా పండె, సాహితీఘంటమున ని
కను నవాధ్యాయమునకు శ్రీకార మిడరె!

---

# శ్రీ విశ్వనాథ
# సత్యనారాయణగారి కవిత్వము

'సంపత్'

కళాహృదయము నిత్యనూతనముగా వికసించి సంస్కృతి పొందడానికి అనుభూతి అవసరము. బీజప్రాయముగా ఉన్న ప్రతిభావనకీ అనుభూతహృదయమే జీవ మిచ్చి బహిర్గతము చేస్తుంది. అనుభూతి లేదంటే హృదయము చాలదని అర్థము. దీనిలోని తరతమభావములు హృదయపరిణతిలో ఇమిడిఉన్నవి. కొందరు ఇతరులకంటె అధికంగా అనుభవిస్తారు. ఈశక్తి జన్మతః వస్తుంది. ఒకకవి తన ప్రత్యేకము వనుభవించిన విషయానికి కళాస్వరూపము కల్పిస్తే అది రసాత్మకమై జీవవంతమై ఉంటుంది. అది చదివినవెంటనే మనకున్న తద్రసానుభూతి సిద్ధిస్తుంది. కవిత్వములోని లోతు, జీవము, బలము దీనిపైననే ఆధారపడినవి. అనుభూతి జన్యమే ఆవేశము. ఆవేశములో ముక్తకంఠముతో కవి తన అనుభవాన్ని అరసప్తాంగా భావసామీప్యము పొందేటట్లు గానము చేస్తాడు. తనగానాన్ని ప్రతిభావ్యుత్పత్తుల సమ్మేళనచేత మహాశిల్పముగా మారుస్తాడు. ఈశక్తి మహాకవిసొత్తు. అట్టివా రిప్పుడెందరో లేరు.

నేటి కావ్యజగత్తును ఉత్కృష్టశిల్పముతో అలంకరించి శిఖరప్రాయముగా ఉన్న మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారు. తెలుగుసాహిత్యములో ఈరసస్రష్ట అందగించి, ఉత్కృష్టపోతసాదించి, రసాత్మకముచేయని శాఖయే లేదు. సర్వతోముఖవిస్తృతిమైన ఇతనిప్రతిభ వివిధసారస్వతాంతఃపథాలకీ శృంగాటకమై విల్చింది. ప్రౌఢాతిప్రౌఢముగ ఒకచోట, శైలోపలవాళిపై మధుర లాస్యము చేస్తూ పరుగులిడు స్రవంతివలె ఒకచోట, శరన్నవకౌముదీపులకిత చకోరగీతిగా ఒకచోట, మాతృదేశావిలదుఃఖదారిత హృదయసంస్పందమువలె ఒకచోట, ఇతనికవిత్వము వింతపరుగు లెత్తింది. కవిత్వములో ఎన్ని పోకడలైనా పోగలవా డిత డొక్కడే. ఈకవి తన అనుభవములోని తీవ్రతను ఊహింపరాని లోతులకు తీసికొనిపోయి అందే తాదాత్మ్యము పొందును. తా ననుభవించినది తనయెడద చొచ్చుకొనును. అందుకే

......"నాకన్న తుద నాదు నెడదదాక
మాపుమాపులో నంత చొచ్చుకొన నేల"

అని అన్నాడు.

భావానికీ కవికీ అద్వైతసిద్ధి కలిగినప్పుడే పరిణతి ఏర్పడుతుంది. అప్పుడే కవి ఆవేళ మనస్కుడై అపలపించుకోలేని ఆవేదనను కవితాస్వరూపములో వ్యక్తము చేస్తాడు. అప్పుడే మన మా కళాజగత్తులో తన్మయులమై పోతాము. సత్యనారాయణగారన్నట్లు, భాషను భావముతో సమానముగ జోడించి కావ్యమున ఉత్కృష్టత ప్రసాదించడము మహాకవి లక్షణము. ఉత్తరు కవికి "భావముపై ఎంతగౌరవమో భాషపైకూడా అంత గౌరవ ముంటుంది". భావాభివ్యంజకమైన సామగ్రి భాషకనుక ఉత్తమకవిత్వానికి భావ మెంత ప్రధానమో భాషకూడా అంత ప్రధానము. పరమోత్కృష్టమైన భావమును సృష్టించడానికి పరమోత్కృష్టమైన భాషయే ఉపకరణముగ నిలుస్తుంది. ఈ రెంటిని ఒక ప్రతికి పెనచగలిగినప్పుడే కవిత్వ ముత్తమజాతికి చేరుతుంది. ఇతనికి భాష లొంగి వర్తిస్తుంది. భాషాతత్వ మెఱిగిన మహాకవి!

నేటికవులనేకులు ఆంగ్లభాషాపరిచితులే. అందువలన వారి కవిత్వములో పాశ్చాత్యశిల్పము దిగుమతి అయినది. దానితోబాటు కొంచెము అందము నూతనత్వము మన తెలుగు కవిత కబ్బింది. ఇది కొన్నిచోట్ల వికృతముగా పరిణమించింది కూడాను. దీనికి కారణము — వా రాసాహిత్యాన్ని సంపూర్ణముగా జీర్ణించుకొని

పునస్సృష్టికి పూనకపోవడమే. అందువల్లనే అటువంటి వారి కవిత్వములో మేళన (Harmony) ఉండదు. సన్నిహితమైన సౌందర్యసంహారము కొన్పించదు. ఆ కళలో ఏకత్వము భజించడానికి వీలుండదు. ప్రకృతి ఉత్సంగములోనుంచీ క్రమపరిణామము పొందుతూ వచ్చిన సృష్టివలె కవిహృదయములోనుంచీ ప్రతివాక్కు అన్యసాహిత్యసంపర్కజన్యమైతే పునర్జన్మపొంది ప్రవృద్ధము కావలెను. అప్పుడే ఆవాక్కు స్వజాతీయత కూడు కట్టుకొంటుంది. అప్పుడే మనహృదయాలకు దగ్గరగా నిలుస్తుంది. సత్యనారాయణగారు పాశ్చాత్యశిల్పములోని అందము గ్రహించినా, సంస్కృతములోని మాధుర్యము, తెలుగులోని చిక్కదనమూ, దానిని అదపులో ఉంచుకొన్నారు.

ఈకవి సర్వప్రకృతినీ కళాదృష్టితో చూడగలడు. ప్రకృతినిస్ఫురణములో నిల్చి హృదయదఘ్నముగా పరికిస్తాడు. సౌందర్యమూ, సత్యము అతని నిత్యతృషితాత్మకు ఆనందోపాదేయములు. సర్వసృష్టిలోనూ జీవత్కంతము లతనికి వినబడును. ప్రకృతి తనకు స్వాగతహస్తాలు చాచినట్లు దర్శిస్తాడు. ఈ ప్రకృతి తనలో అంతర్లీనమైన ఏకత్వమున్నప్పటికీ భిన్నరూపాశ్రితమైనట్లు, ఇతని కవిత్వముకూడా అంతరాంతరములలో ఏకత్వము భజించుకొని బాహిరముగ భిన్నరూపాశ్రితమైనది. అగాధమైన ఇతని హృదయాంతరములో నినదించే అవ్యక్త మధురగానమే పొంగి, పొంగి కవితాకృతితో ఆంధ్రసాహిత్యాన్ని అలంకరిస్తున్నది. ఇతని ప్రతి హృదయ సంస్పందమూ కవిత్వములో వినిపిస్తుంది.

శిథిలాంధ్ర సౌభాగ్యాన్ని గానము చేస్తున్నప్పుడితని మాతృదేశావిల దుఃఖదారితమైన హృదయ మగుపిస్తుంది. ఇతని దేశభక్తిగీతాలలో ప్రత్యేక విశిష్టత గోచరిస్తుంది. ఇది ఇతనికే ప్రత్యేకించిన విశిష్టగుణము. భావోద్రేకములోని విరుగుబాటు రసికలోకము సహించదు. విరుచుకొనివచ్చు భావోన్మాదము దేశభక్తిగీతాల కనవసరము. దాని వ్యామోహములో నేటి కవులు ఉదాత్తత నశించిపోయినా ఓర్చుకుంటున్నారు. కవి తన భావోద్రేకాన్ని కుదించి, అప్రస్తుతిలోనికి జారనీయక అణచి చెప్పినప్పుడే గరీయస్త్వము కవితకు లభిస్తుంది. ఉద్రేకము ప్రళయ ఝంఝా ప్రభంజన మూర్తి కాగూడదు. శిల్పసౌందర్యానికి ఒదిగి వర్తించవలెను. ఈ గుణము శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిలోను ఉన్నది. కాని వారిరీతి వేరు. సత్యనారాయణగారిరీతి వేరు. శిథిలమై పోయిన ఆంధ్రపౌరుషాన్ని —

“………………ము చ్నే వాడో ఘూసాగ్రముల్
పదునై ఆంధ్రవిరోధికంఠదళన
ప్రారంభ సంరంభమేచుదినాలన్”

ఒక్కసారి వెనుకకు చూచి,

“లేశం బరిదైన చెప్పుటకు
లేవే నాటి స్వాతంత్ర్యముల్”

అని అన్నప్పుడు శీర్ణాంధ్రలక్ష్మివిషాదాశ్రుకణమే జారిపడినట్లు మన హృదయములు చలించిపోవును. “వేగిక్షేత్రము, “ముఖలింగము”లోని ప్రతిపద్యమూ నా హృదయములో నిరంతరమూ కదలుతూన్నట్లు ఉంటుంది. సహృదయుడైన ప్రతిసాహిత్యోపాసిలోను అన్యముగా ఉండదు. “ఆంధ్రవిష్ణువు”లో

“శ్రీకృష్ణవేణీగరిష్ఠ పాథ స్తరం
గాహారిప్రాకార మైన యదియు,
బౌద్ధజిన దితిజసమూహరక్తము గ్రోలు
నాల్కకోలు పతాక నాటునదియు,
ఆంధ్రవీరభటాళి కాత్మశౌర్యంబుల
యందు శాణోపలం బైనయదియు,
ఘంటశాలాపురీకలితపూర్వాంధ్రశి
ల్పాచార్యులకు తల్లి యైనయదియు
రాజరాజాంధ్రవిష్ణుని రాజధాని
కలువముల కెల్ల పిడుగు శ్రీకాకుళంబు
కన్నులకుఁ గట్టినట్లుగ కానబడెను
వేదకాలము నాటిముత్తైదువట్లు”

అనెడి పద్యములో కవి ఏఉన్నతలోకములోనుంచో పలికినట్లు వినిపిస్తుంది. మరి ఎవ్వరికీ కూడా ‘శ్రీకాకుళము’ ‘వేదకాలము నాటిముత్తైదువట్లు’ తోచదు. ఈకవి మనస్వితే ఇందులో గోచరిస్తుంది. పౌరాతన్య మేచుకొనిన శ్రీకాకుళమును వేదకాలపు ముత్తైదువతో పోల్చడములో ప్రాశస్త్యము

ఉన్నది. వేదకాలమునాటి ముత్తైదువను ఈకవి చూచి నాడా అని ఒక పండితుడు ఆక్షేపించినాడు. కవికి దేశకాలాల కతీతమైన శక్తి ఉంది. అతనిది నిర్నిరోధిత దృష్టి. అతడు ఋషివలె త్రికాలవేత్త. ఆనందవర్ధనుడు "యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే" అని విశాలవిశ్వము కవిప్రజ్ఞకు ఒదిగిపోతుం దన్నాడు. మమ్మటాచార్యుడుకూడా కావ్యప్రకాశములో

> "నియతికృతనియమరహితాం
> హ్లాదైకమయీం అనన్యపరతంత్రాం
> నవరసరుచిరాం నిర్మితి
> మాధదతీ భారతీ కవేః"

అని అన్నాడు. ప్రతిభావంతుడైన కవి వస్తు సహజధర్మాలను దాటి అంతకంటె విలక్షణమైన కావ్య ధర్మాలను అనన్యపరతంత్రముగా నిర్మించుకొంటాడు. అనన్యపరతంత్రముగా నిర్మించుకొంటున్నానని కవి సగర్వముగా చెప్పుకున్నాడు కూడా —

> "ఇది పరమోత్తమమగు నాయొద్ద జనించి
> నావకాలయ ఘంటికాధ్వాన సరణి
> లంగు బడి యర్థవీథుల యందు లెలుగు
> తలపు" —

౨

సత్యనారాయణగారి కవిత్వములోని 'లిరికల్ ఏస్పెక్ట్' (Lyrical aspect) "కొండవీటి పొగమబ్బులు", "నీరథము", "స్వామి", "నీవు — నేను", "నా స్థితి", "కృష్ణాగీతము", "ద్యుతి", "కృష్ణార్పణము" మొదలైన ఖండకావ్యాలలో చూస్తున్నాము.

"కొండవీటి పొగమబ్బులు" ఆధునికాంధ్ర సాహిత్యానికే కాదు — సకలాంధ్ర సాహిత్యానికీ రత్నభూషగా నిలువగలిగిన మహాకావ్యము. అప్రతిమానమైన ఉపజ్ఞ-ప్రతిభ ఇందులో గోచరిస్తున్నది. 'రాచసిరి ఉడిగిపోయిన శిథిలదుర్గ లక్ష్మికి' ఆ పొగమబ్బులు కూర్చిన 'నెత్తి సలంకృతు'లే ఈ కావ్యాన్ని వెలార్చినవి.

> "ఒకసారి వలిపమ్ము చికిలిముత్యాలయం
> చులవోలిక నుపత్యకల చరించు
> ఒకసారి జఘనభాగోపరిస్రస్తచే
> లవిధాన గిరిమొదళ్ళం బడిపోవు
> ఒకసారి గిరిలక్ష్మి మొకముపై ముంగలివు
> ప్పాళ్యాడు కొన్నట్లు చెల్లరేగు
> ఒకసారి స్వేదబిందుకయుగు రత్యంత
> వేళాకుచావృత్తి విస్తరిచు
> చిలుత పొగమబ్బు లీ కొండసీమ పలుచ
> బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
> సిరి యుడిగిపోయినట్టి యీ శిథిలదుర్గ
> లక్ష్మి కొనగూర్చు నెత్తి యలంకృతులను"

అంటూ పొగమబ్బులు సైతము రాజసేవ మఱచిపోలేక ఉపచరిస్తున్నట్లు చిత్రించిన కవి భావావిష్కరణము ఉదాత్తము, ఉత్తాలము.

> "దగ్ధాంధ్రరాజ్య నిత్యవిధూత ధూమమ్ము
> వలె కొండబురుజులకెలన లేచి
> బురుజుకొమ్ములు వీడిపోలేని రెడ్లకీ
> రితివోలెఁ జెనురాళ్ళ నడుమలుపడి
> రెడ్లకందావెన్క లేగు వంటింటి పె
> న్పొగవోలె గుమురులై ముందుసాగి
> ప్రాగ్గాఢదాంధ్రస్వతంత్రతారమవోలెఁ
> గొండ లంటియుంటకుండ బోయి
> శ్యామలీభవద్గ్రావసమూహదనార్థ
> మొలయు నెల్లావులు కదంబములుగ నిలిచి
> కొండకొమ్ములలో దాచుకొన్న క్రొత్త
> క్రొత్త పొగమబ్బు లలమె నీకొండకొసల."

ఉదాహృత పద్యములోని భావోదాత్తత భావాభివ్యంజకపదసామగ్రి ఏదుత్తమకవులలో గాని దొరకదు. ... ... ... ...

ప్రకృతిలో లీనమై, తాదాత్మ్యము పొందడము వల్ల, ఆత్మనా అనుభవిస్తున్న ఆనందాతిశయముతో, కవి వింతవింతగా పరుగులెత్తుపొగమబ్బులను చూచి,

> "ఓసి పొగమబ్బులార! రండోసి రండు
> మీకు మా కిష్టమే యుష్ట మాకలేక
> తిరుగవచ్చు రాజులు కొల్వతీర్చుచోట
> నరుగవచ్చు రాకన్నె లున్నట్టిచోట."

అంటూ నిరాతంకమైన స్వేచ్ఛావిహారానికి ఆహ్వానిస్తున్నాడు. దీనిలోని శైశవోత్సాహము, స్వైరవిహార వాంఛ "నీకు మా కిష్టమే యిష్టము" అన్న పలుకుల లో అంతర్గతమై ఉంది. భావాభివ్యంజక పదసామగ్రి అంటే ఈరీతిగా ఉంటుంది.

"నీరథము", "నీవు—నేను", "నాస్థితి", "స్వామి" వంటికావ్యాలు పాఠకుని హృదయాంతరాంతరములో ఒక అవ్యక్తమధురవేదన రగిలించి హాయికల్పించగలవు.

"నిను మదీయ గిరాంవీథి నిలిపి శైవ
సాంఖ్య తాండవ నూపురస్వనము లోలుక
జేసితిని, నీవు మింటికి, క్షితికి నేను
కవుల మైత్రిమి హాస్యదుఃఖములు పాడ."
(నీవు—నేను)

* * *

ఈ కెలన శరత్పూర్ణిమాస్మృతి శశాంక
లలిత రోచిర్వితాన, మా కెలన ఘోర
ఘనతరాంధకారచ్ఛటాక్రాంతభూమి
అందు సగ మిందు సగ మంటి నవుర నేను.

ఈశరత్పూర్ణిమాచంద్రికాసుధామ
రీచిలో నెన్న నేను స్ఫారీభవన్న
శీవళంపాలతాకృతి పూనియుంటి.

ఈసగము నాకు నాకె కన్పించబోదు
ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
పోరె మన్నది నాస్థితి.—
(నాస్థితి)

* * *

... ... ... ...

తొలి చివరలేని ఈ నీకటులును నేను
ఒక్కరొక్క రప్పళించుకొంచుండినాము
నిన్న నీనాటి మెఱపు మన్నించుకొందు.
(స్వామి)

* * *

శ్రీప్రభూ! నీరథము దీప్తప్రణీత
విధురవేగమ్ము పరువులు పెట్టు చుండె
నా శరీరము దాని క్రింద బడి నలిగి
నలిగి పోయినయది రక్తనదము లింకి.

దివ్యతేజోవిరాజత్త్వదీయరథము
ఈగతుకు జేమిరైనను నాగలేదు
నావిరోధించిన హతాన్ని నాదనునవు
వెనుదిరిగియైన మరి చూచుకొనగలేదు.

నాదు రక్తంబు నీరథచోదకుండు
కడిగివేయును రేపు చక్రములనుండి
అవటి బహుజన రక్తచిహ్నములయందు
నాది యి దని గుర్తేమి కన్పడును స్వామి.
(నీరథము)

రవీంద్రునివంటి ఉత్తమ కవుల కావ్యాలలో తప్ప ఇటువంటి పంక్తు లితరత్ర గోచరించవు.

* * *

భార్యావియోగములో శోకసంప్లుష్టమైన భర్త హృదయము "కృష్ణార్పణము"లో అగపిస్తుంది. ఈ కావ్యాన్నిగురించి భిన్నాభిప్రాయము లున్న సంగతి నే నెఱుగుదును. ఒక మిత్రుడు

**"Passion runs not after remote allusions and metaphorical diction"**

అని అన్నాడు. ఉద్వేగిత హృదయ మార్తైచ్ఛ స్వరములలో ఆలపించ దనే ఆక్షేపణకొరకు లేక పోలేదు. గాంధారగ్రామము మానవమాత్రుల కబ్బ దేమోగాని విద్యాధరుల కదియే పరిపాటి. అతనికో కృష్ణార్పణాన్ని సహేతుకముగా సమర్థిస్తూ లిసిడస్ "(Lycidas")ను సమర్థిస్తూ వ్రాసిన ఒక పాశ్చాత్య విమర్శకుని వాక్యం చెప్పించాను:

**"There is no poem tn which he makes so complete a surrender to the changing mocds of passion. The verses seem to follow his heart and fancy just where they lead".**

మిగిలినది యొక్కడే నాకు మేరువంత
బరువు నాగుండెలో మధ్యభాగమందు

అంతె చేరున కంతె భార్యాస్థిగాని
వాతరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము.

ఇంతకంటె శోకమూర్తిగా ఏకవీ దుఃఖించి యుండడు. ఇది "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్" అనిన భవభూతివాణిని స్మరింపజేస్తుంది.

3

అభినవాంధ్రసారస్వతములో గేయము తగిన స్థాన మాక్రమించుకొనడానికి ప్రయత్నిస్తున్నది. వంగ వాఙ్మయములో దానికున్న స్థానము అద్వితీయము. కవి హృదయాంతరములో అవ్యక్తముగా దాగిఉన్న సంగీత ము, వింతనడకలతో క్రొత్త ఒయ్యారముతో గేయము లో ప్రతిపాదకమౌతుంది. భావకవి గేయాన్ని ఎక్కువ ప్రేమిస్తాడు. సత్యనారాయణగారు భావకవులలో భావ కవి. గేయాలను, పాటలను ప్రేమిస్తాడు. గేయరూపక మైన కావ్యమే కిన్నెరసాని పాటలు.

నిందలు భరించలేక "ఆర్తమైన హృదయముతో కిన్నెర అడవులవెంట పరుగెత్తింది. భర్త పోయి ఆమెను పట్టి కౌగిలించుకున్నాడు. ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై వాగై ప్రవహించింది. అతడు శోకించి శోకించి శిల అయినాడు."

. . . . . . . . . . . .

శుక్తిమతీ, కోలాహలులు రామరాజభూషణునికి నాయికానాయకు లయినారు. ఆ పండితకవిశేఖరుని రసస్వరూపాలను దిద్దలేకపోయింది కాని శ్లేషకవితా చక్రవర్తిత్వము సమర్థించగలుగుతుంది. ప్రకృతికి అతడు చేతనత్వ మారోపించినాడు.

సత్యనారాయణగారికి వాగై ప్రవహించిన, భార్య (కిన్నెర), శిలగా మారినభర్త, నాయికా నాయకు లయినారు. ఈకవి వానిలో చేతనత్వము ఆత్మనా అనుభవించినాడు. కిన్నెరసాని రసధునీమహితాకృతి. ఇంకొక గుణము — కవి కథ నంతా వాచ్యంగా చెప్పక ధ్వనించినాడు.

ఇప్పుడేకద నాకౌగిట
కప్పితి నీశోకమూర్తి
అప్పుడె నిలువున నీరై
ఎప్పుడు ప్రవహించితివే. —ఓహో.

నీవు మహాపతిశిలవు
కావని నే నంటినటే
... ... ... ... —ఓహో.

ఈవు రసాకృతి వసటను
ఈనై ఝరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను
పూనుదునె ధునీవై ఝరి. —ఓహో.

ఈ ఏడుపు రొదలోపల
నారొదలే నే వెలుగను
నా యీ దేహ మిదేమీ
తాయిపోలె నగుచున్నది. —ఓహో.

"కిన్నెర నృత్యము"లో ప్రతిపలుకూ మధుర లాస్యము చేస్తున్నట్టు ఉంటుంది. నడకలో ఒకతూగూ ఒకపరుగూ ఉంది.

తెగపాడుతూ అంద
ముగ నాడుతూ తేనె
వగ లోడుతూ కిన్నె
రటు వాలి యిటు వాలి
తరుకువాకలతోడ
చెరుకువాకలతోడ
మలకలై నటియించెనే
తెలినీటి
పులకలై బుగ్గతెనే.

లయ పెంచుతూ మన్య
లయ దించుతూ పాట
రయ మెంచుతూ కిన్నె
రటు పోలి యిటు పోలి
తెలినీటి మేనితో
తలిరాకు మేనితో
ఒయ్యారములు పోరునే
కిన్నెరా
ఆయ్యారె యనిపించెనే.

"కిన్నెర వైభవము"లో కవి కొంచెము ప్రౌఢ ముగ కనిపిస్తాడు.

మూడుజాముల ప్రొద్దు మెుగి జారివడి మింట
వెనుక పట్టెను తమ్మినిరి మేల్వాలపుపంట
కళ్లము న్ముడిచి పండిన గోదుములకుప్ప
తూర్పు గాలులకు తూర్పారబట్టినయట్లు
జారింది కిన్నెరా పైడిగా
మారింది కిన్నెరా.

మారి, మారి, వింతవింత పరుసులతో
బుకువు బుకువున మారు రుచులలో కిన్నెరా
కారుకారున మారు కాంతిలో కిన్నెరా
తెలుసు సక్కనిరాజుపలు కందుకో లేవి
చవులూరి చవులూరి జలముల్ల ప్రోవులై
కదిలేను కిన్నెరా
పొంగేను కిన్నెరా.

ఒక్క మాటలో,— వశేంద్రెర వన్న సౌందర్యము తెచ్చిపెట్టుకొన్న దీకిన్నెరసాని.

"కోకిలమ్మ పెండ్లి" – ముత్యాల సరాలలో ముద్దుగా నడిపిన చిన్ని కావ్యము. కావ్యమంతా ధ్వని మంతమై- అందాలు మూటకట్టింది. చివరకి—

"చిలకతల్లి మహోన్నయంబున
నిలిచినవి సాంప్రదాయికవాక్కులు
కోకిలమ్మ తెలుగుపలుకు
మఱచెట్టిందీ—"

మొదటినుంచీ కవిత్వములో ఒక విధమైన వాజాకు ఒదిగి వచ్చింది.

ఇంతేకాక ఈకవి కేవలము జానపదుల భావలో వ్రాసిన "బావకత్తె" అనేపాట చూచినాను. వీరికి దానిపై అభిమానం చాలకనో మరియేమో, తిరిగీ అటువంటిపాటలు వ్రాసినట్లు నాకగుపించదు— వ్రాసినా లేమో!

౪

ప్రతిభావంతుడైన కవి అన్నిరసములను కొంత వరకైన సమానముగ పోషించగలడు. ఒకరస ప్రధానమైన కథను నడిపించేసమయములో కవి దానిలో తన్మయుడై వ్రాయవలెను. కథనాత్మకకవిత (Narrative poetry) చెప్పడ మందరి అధీనములో లేదు. కీట్సు వంటి మహాకవికల మే దీనిలో కుంటుపడింది. ఈశక్తి తిక్కన, మిల్టనులవంటి మహాకవులసొత్తు. ఆధునికులలో సత్యనారాయణగారిని మించినకవులు కథనాత్మకకవిత (Narrative poetry)లో కాన్పించరు. వీరు వ్రాస్తున్న రామాయణమే దీన్ని సమర్థిస్తుంది.

ఈకవి "శృంగార" కావ్యాలలో కూడా "మెఱుగు పట్టినవాయి". రాధామాధవుల ప్రణయగాథ పద్యావళి "శృంగారవీధి"గా సాహిత్యలోకాన్ని అలంకరించింది. ఈ కావ్యములోని నాయిక పంచభూతాత్మకమైన ప్రకృతి దీనిలోనిశృంగారము మిశ్ర. సత్యనారాయణగారికి లీలామానుషునియందున్న ప్రేమా, శ్రీకృష్ణభగవానునియం దున్నభక్తీ ఈకావ్యానికి కారణాలై ఉంటాయి. శ్రీకృష్ణకర్ణామృతములోని పరువమూ, మాధుర్యమూ "శృంగారవీధి"లో అగుపిస్తుంది. దీనిలోని "రాధాస్వప్నము'— ఒకమహాకావ్యము. కవి ఏ స్వప్నలోకములోనుంచి వ్రాసినాడో మరి. అతని "ప్రాణమంత పెట్టివ్రాసిన" దీకావ్యము. దీనిలో కూడా మిథ్యావాద ముపపాదింపబడినది. రాధ కలలో శ్రీకృష్ణమూర్తి, ఆమెతనో మృదుశయ్యపై

....................."మృదు
శ్రీ చరణాంకితంబులుగ
నృత్యముచేసె సకింకిణీధ్వనిన్."

"అది ఒకమాయగా హృదయ
మందున స్వామి నటించుచుండె-"

"ప్రణతి పరంబుగా నెదురు
బత్తిగ వంచిన కాళియాహిచి
క్కని పడగల్ హసించు చనుకట్టున
గజ్జలు మువ్వలున్ గల
స్వనములు పల్కంగా నటన సల్పెను
గొమ్మలనుండి రాలా వం
పుర బిటువారు క్రొత్తవి సె
పూవులువోని పదమ్ము లుంచుచున్.

వ్రాలిన నాథు పాద నఖబంధుర
దీప్తిః గుచద్వయంబు దీ

పాలిడుకొన్న దేవళము పైని
విమానము లట్లు తోచి నే
వాలసహస్తముల్ మొగుడ
వాతని వెక్క వటత్పయోధరాం
దోళితమూర్తికిన్ మకర తోరణ
వైఖరి దాల్చె స్వామికిన్.

ఈ భక్తి తన్మయత్వములో సత్యనారాయణగారే నాయికగా పులకించిపోతుంటారు, లింగాభేదాతీతమైన ప్రేమలో—రాధ

... ... ...

"శుచివ్యయ స్త్రీతరమైన మోహమై
కేల గదించి కౌగిట లగించక
నేనె తలంతు స్త్రీలయిన్
స్త్రీలను మధ్యగా యని
వచించితి నేరనుకొకనే చెలీ!

తుదకు ఈశృంగారమంతా మిథ్య—
..............."మేలుకొన్న నా
రెమెద యిది మేలుకొన్నదను టే
నిజమా? కలయే యిదా చెలీ!

ఇతని "ప్రాతస్స్నవము" తెలుగు తనము కూడ చెట్టుకొన్నది. వేదాంతార్థ మక్కడక్కడ ధ్వనిస్తుంది.

"చేతము కూడ పొమ్మసిలు
చీకటిలోపల నల్లదొంగ నే
రీతిగ గానుపింతువు దరిద్రులకున్
నిదురించువేళ"

* • * * *

౫

వర్ణనాత్మక కవిత (Descriptive Poetry) వ్రాయడములో సత్యనారాయణగారిదే పెట్టినది పేరు. వీరు వ్రాసిన "ఋతుసంహారము" మరికొన్ని ఖండకావ్యాలు ఈ శ్రేణి క్రింద వచ్చును. "ఋతుసంహారము" తెలుగుసాహిత్యాని కొక కొత్త ఈవి. ఇది కాళిదాసు వ్రాసిన "ఋతుసంహారమున" కనుకరణము గాదు. ప్రతిఋతువూ మనకు దృగ్గోచర మౌతుంది.

హేమంతఋతువులో మంచు రాలుతుంది. ఆమంచు బిందువులను కవి ఎన్ని విధాలుగా భావించగలిగినాడో చూడండి.

"తట్టలోఁ గూర్చుండఁ బెట్టిన వధువునా
గుమ్మడిపూవులోఁ గులికె నొకటి,
ఖండితాపాంగసక్తనవాంబుకణంబునా
ఘాసాగ్రమునయందుఁ గదలె నొకటి
తులసిక్రుగ్గున నిడ్డ తొలుకాడుదివ్వెనా
పాలీనిపటముపై సాగె నొకటి,
ఘూర్జరీముఖలంబి కోపము త్రియంబునా
నాచుడ నొసటిపై నాడె నొకటి
మధువునాఁ బూవుపూవున మసలె నొకటి
జగ్గునా నాకు నాకున జారె నొకటి
మంచుబిందులు నవ సుకుమార మూర్తి
మంతములు ప్రాతరంత హేమంతవేళ.

"శిశిరఋతువు"లో శిశిరము — "పారవశ ధారాళ్యం తనముకోని ఛిన్నాభరముల దాల్చి" వచ్చెనట. ప్రకృతిని సూక్ష్మంగా పరీక్షించి తద్ధర్మాల నుపేక్షించకుండడము ఉత్తమకవి లక్షణము.

"పల్లకీబొంగుతో పాటు వంగెను గమ్మ
వారి పెండ్లి కుమారైవదనసీమ,
ప్రత్తికాయవిధాన పగిలిన పెదవితో
కొమరారె ప్రత్తేరు కూలిపడుచు,
చెదరిన తెల్లు పూచెలువొప్ప జనములో
మునిగె మేసెడు గిత్తమూపురంబు
ఆకుడ్చి చిగిరించె మోకగాఁ బరికిణీల్
వదలి చీరలు గట్టె ప్రథమయువతి,
చీమయిల్లాలు కరివేప చెట్టుమొదట
గ్రుడ్లిడి చిటారుపండ్లని కులికిపోరు
కొన్ని ప్రాణులధర్మముల్ కూడఁ జలికి
గూడి యన్యధర్మము లానుకొన్న వనఁగ.

అన్న పద్యములో ఋతుధర్మాల ననుసరించి రమ్యమైన ఒక భావచిత్రాన్ని సృష్టించినాడు. దీనినే ఔచిత్య పోషణమనినారు పెద్దలు.

"కవి కావ్యాంగములను వేనిని నిరసించడు, అల్పమో, అధికమో గుణాలంకారములను వలసినచోట సంగ్రహించనే సంగ్రహించును" అని సత్యనారాయణగారే ఒకచోట వ్రాసియున్నారు. కావ్యాంగములను

నిరసించకూడదని వీరియభిప్రాయము. అందువల్లనే వసంతర్తువులో శ్లేషాలంకారముకూడా చోటుచేసి కొన్నది. ఇటువంటివాని "ఎప్పుడో కాని ఇతడు ముట్టడు—"

దీప్తి మాధుర్యాదధి శిరస్సుధాంశు
భాస్వన్మనోహర విలాసమ్ము లనుచు,
శ్లిష్టబంధ విచిత్రకేళీప్రశస్తి రి
హాకళాపూర్ణోదయమ్ము లనుచు
కృష్ణ పదాగ్రభక్తి సుగృహీతాముక్త
మాల్యదాచ్ఛ ప్రౌఢమధువు లనుచు
అనితరలభ్య వర్ణాప్త శశ్యాహేతు
వై పాండురంగ మహాత్మ్య లనుచుఁ
దీయఁదనములు మెఱుఁగులు దీర్చుకొన్న
ప్రియులు ప్రియులఁగూడి మనుచరిత్ర లనుచు
తెలుసు రసికలోకమున కంబిచ్చి యసువు
లత్తుకొనె మల్లెపూల్ క్రొత్తక్రొత్త రుచుల.

అయినా ఇది "సానబట్టినరాయి" కదా!

* * * *
* * * *

సత్యనారాయణగారు పద్యాలు వడిపేరీతిలోనూ ప్రత్యేకత ఉంది. అది అనితరలభ్యము. సీసపద్యాలితని చేతిలో క్రొత్తనడకలు నడిచినవి. "గౌరీపూజ" (వరలక్ష్మీత్రిశతి. కర్మశతకము—అరవపది) చూస్తే సీస పద్యాలు పొగలిగిన పోకడ లగుపిస్తాయి.

"కురుసినట్టిది యందు కురిసినట్లే యుండు
తరిశేతమంచు తుంపురులజల్లు

* * *

"అరికారము వికార మచటి తుమ్మెదప్రోత
కేలికయను తొలిరొద్దుఅంకె

* * *

సంస్కృతపు పోకడలకు — "కృష్ణార్పణము" లోని కొన్ని పద్యాలు, "ఋతుసంహారము" లోని పద్యాలు చాలు.

"హ్రుతమత్స్య శిశు శిశుక్రీడార్థ మత్స్యమా
త్రర్థ్యర్థనా వైభవాప్తితోడి"

* * * *

"చక్షుశ్రవశ్శిరశ్ఛవిమన్మణిచ్ఛవి
చ్ఛట తుమ్మిపూల ప్రసక్తిలేదు

* * * *

౬

ఇంతవరకు సత్యనారాయణగారి కవిత్వాన్ని దూరదూరంగానే చూపించగలిగినాను ఇతని కవిత్వాన్ని మననము చేసుకుంటేగాని ఆనందించలేము.

"A genius is to be often approached"

అని ఒక పాశ్చాత్యవిమర్శకుడు అన్నాడు. ఈకవివ్రాసిన కావ్యాలన్నిటినీ పరిమిత బుద్ధులతో పరిమితకాలములో విమర్శించలేము. "శ్రీలు పొంగిన జీవగడ్డ"లో ఇతనిది అమృతవాక్కు. భావకవులలో భావకవిగ, పురాణకవులలో పురాణకవిగా, పండితులలో పండితుడుగా, విమర్శకులలో విమర్శకుడుగా ఉండడమేకాక, నాటకాలలోనూ, నవలల్లోనూ, కథానికలలోనూ సిద్ధహస్త మనిపించుకొన్నాడు. ఇతని కావ్యకలాపాన్ని ఎఱిగినవారి కివ్యాన మిక్క మధురస్మృతి --- లేనివారి కిది మేల్కొలుపు. ఒక కవిరాజును మన ఎదుట ఉన్నప్పుడే సంపూర్ణముగా తెలిసికోలేకపోతే మనము దౌర్భాగ్యులమూ, మనగొప్ప తనము మనమే ఆదరించని అరసిక శిఖామణులమూ ఔతాము. మనము ఏమిచేసినా సరే, భవిష్యల్లోకము వారిని అర్థముచేసుకొంటుంది. లోకములో చాలమంది

"చికిలిమెఱుంగు సన్ననగిషీపని బంగరుసేత మెచ్చరే
రకలుమమా వనాంతరమహోఝరిణీపరివేగ వార్వరేరు"

కాని దుర్విమర్శకు సాహసిస్తారు. వారేమన్నా సరే. వారిమెప్పుకోలుతో పనిలేని ఈకవిరాజికి వాళ్లోహారు.

# వేషం తగాదా

భమిడిపాటి కామేశ్వరరావు

[సభనిమిత్తం సరంజాం అయి ఉంటుంది. వేదిక. దానిమీద అధ్యక్షులవారికి ఒకకుర్చీ. బల్ల. దానిమీద నల్లగుడ్డ. రెండుదీపపు స్టాండులు. ఎదట చాపలూ, తివాసీలూ, బెంచీలూ, క్రకుర్చీలూ వగైరా. జనం కూర్చునిఉంటారు. కొందరు వస్తూంటారు. శేషు, ఆనందం, సభాపతి, భావరాజు, రత్నశాస్త్రివగైరాలు వారిలో నాయకులు. ఉపన్యాసకుడైన బలవంతరావు వస్తాడు. కార్యదర్శి ఆయన్ని నమస్కరించి ఒకకుర్చీ చూపెట్టి గౌరవిస్తాడు. సంగీతరావు దర్జాగా వస్తాడు.]

ఆనం: రావోయ్, రా. (అని తనపక్క ఖాళీచేస్తాడు).

సంగీ: (వెళ్లి అక్కడ కూచుంటాడు).

శాస్త్రి: కార్యదర్శిగారూ! అధ్యక్షులు, బసలోంచి బయల్దేరినట్టేనా?

కార్య: చిత్తం ఏం అల్లా అడిగారు? అది తెలియడం కంటె వాళ్లే వుండొస్తారు.

శాస్త్రి: ఏమీ లేదు. వచ్చింతరవాత జరగవలసిన లాంఛనాలూ దావాదీనా సభ ప్రారంభించే సరికి ఆలస్యం అయిపోతుందేమోనని.

సంగీ: కాదు.

శాస్త్రి: ఏడిసినట్టే ఉంది. ఈ సభకి ఈరోజున ఫలానావారు అధ్యక్షత వహించాలని ఉపపాదించడం వగైరాలు జరక్కుండానే అధ్యక్షుడు వెళ్లి కుర్చీలో కూచుంటాడా?

సంగీ: సర్వధా ముందే స్థిరపడిపోయి నవరసరావుగారు అధ్యక్షుడు అని అందరికీ తెలిసే ఉన్నప్పుడు ఆయన ఇల్లా వస్తూనే అల్లా వెళ్లి కుర్చీలో కూర్చోవచ్చులెండి. తమరు ఊరుకోండి. తమకు "ఎట్టికెట్టు" తెలియదు.

శాస్త్రి: ఏమో! ఆ వెధవటిక్కెట్టు నాకు తెలియదు.

[కారు చప్పుడు వినబడుతుంది. కారు ఆగినట్టవుతుంది. అధ్యక్షుడైన నవరసరావుగారు వస్తూంటే కార్యదర్శి వగైరాలు ఎదురుకోలు ఇస్తారు. ఆయన చిరునవ్వుతో వెళ్లి గబగబా వేదిక ఎక్కి అగ్రాసనాధిపత్యం వహిస్తారు. కార్యదర్శి ఆయనమెళ్లో దండ వెయ్యగానే ఆయన దాన్ని ముళ్లకంచె తీసేసినట్టు తీసి బల్లమీద పెడతాడు. అందరూ చప్పట్లుకొడతారు. నవరసరావుగారు ఒకసోడా తీసుకుంటారు. తరవాత ఆయన తనఎదట బల్లమీద పెట్టిఉన్న కాగితపుముక్క తీసి, సులోచనాలు తుడిచి, పెట్టుకుని, చూసి, సకిలించి, లేచి]

నవ: కార్యక్రమములో, అనగా ఈ ప్రణాళికలో, మొదటిఅంశము దైవప్రార్థన.

[అని చెప్పి కూర్చుంటాడు. కార్యదర్శి సంగీతరావు కేసి చూసి తల ఎగరేస్తాడు. సంగీతరావు వేదిక సరసికి వెళ్లి నిలబడి, కళ్లు మూసుకుని, చేతులు జోడించి, గొంతిక సర్దుకుంటాడు.]

శాస్త్రి: అంతా లేచి నిలబడడం ధర్మం మరి.

[ఎవడో ఒకడు అల్లా పైకి అనేసినతరవాత బాగుండదని చెప్పేసి కొందరు లేచీ, కొందరు సగం లేచీ, చాటువాళ్లు కూర్చునీ, కొందరు పక్కవాళ్లని పట్టుకువేళ్లాడీ ఎల్లానో ఇదవుతారు.]

సంగీ: "నిటలాక్షుం డిపుడే తివచ్చినను రానీ..."

[అనేది పూరికల్యాణిలో పాడబోగా నలుగురూ పకాలుమంటారు.]

శాస్త్రి: (సంగీతరావుదగ్గిరికి వెళ్లి అతడిచెవులో, తెలుసుని ప్రార్థనేమిటి నీ మొహం! దేవుడికి తెలుగు రాదు. సంస్కృతాన్ని కానీ!

సంగీ: (కొంచెం కోపం నటించి) "వృక్షాగ్రవాసీ... న చ పక్షిరాజీ..."

[అనేది ప్రారంభించినా అందరూ గోలగానే నవ్విస్తారు. సంగీతరావుకి చాలా కోపంవస్తుంది.]

నవ: (కలగచేసుకోకపోతే బాగుండదని) కార్యదర్శి గారూ! ఇ దంతయు ముమ్ముందే నిష్కర్ష చేసి యుండవలసినదే!

ఆనం: 'జనగణమన' పాడవోయ్!

శేషు: అందులో "ఆంధ్ర" అనేమాటగాని, కృష్ణా గోదావరీల స్మరణగాని లేదు, కనక వద్దు.

భావ: 'వందేమాతరం' పాడండి.

శాస్త్రి: దేవుణ్ణిగురించి అయితే 'వందేపితరం' పాడాలి.

భావ: 'పితరం' అంటే మాత్రలు చెడతాయి.

శాస్త్రి: 'మాతరం' అంటే గోత్రాలు చెడతాయి.

నవ: (కొంచెం తీవ్రంగా) ఆర్యా! ఇది నాశాసన! సంగీతరావుగారూ! తమరు తమచిత్తమునకు వచ్చిన దైవప్రార్థన మాకు చేసిపెట్టుడు.

సంగీ: చిత్తం. కాని, శృతి లేదు గనక నేను పాడనే పాడను, క్షమించాలి.

కార్య: పోనీ నువ్వు రావోయ్! ఆనందం!

శేషు: చచ్చాం! ఆనందం వస్తే ఆతని పదసంపుటికి అర్థం బోధపడదు.

శాస్త్రి: దేవుడికి గానంతోపాటు అదీ బోధపడి తీరుతుంది.

నవ: ఆర్యులారా! ఇట్టి పరిస్థితులలో నేను ఏదైనా చర్య తీసికొనవలయు.

భావ: (గబగబావచ్చి) "జయ జయ జగన్నాథ! జగజ్జనన స్థితిసంహారకర! సనాతన! శాశ్వత! విశ్వతోముఖ! నిర్వికల్ప! నిరాకార! అదిగ్దేశకాల వ్యవచ్ఛేదనీయ! ఆదిమధ్యాంతశూన్య! అవ్యయ! అవాప్తసకలకామ్య! అనంత! అద్వితీయ! నిరస్త సమస్తోపాధిక సచ్చిదానందస్వరూప! నమస్తే నమస్తే నమః",

[అని లయలేకుండా పాడతాడు, అంతా కూచుంటారు.]

నవ: (లేచి కాగితం చూస్తూ) తరువాత విషయము అధ్యక్షుని ప్రారంభోపన్యాసము.

[అని చదివి, కొంచెం మొగమాటం అభినయించి, చిరునవ్వు నవ్వి, బల్లమీది స్టాండు కొంచెం జరిపి మళ్లీ అసలుచోట పెట్టి దండలు కట్టుకుని]

నవ: సభ్యులారా! ప్రస్తుతపరిస్థితులలో నేటిదినము ఈ పురమున మీసంఘముతరఫున ఈసభ ఇంత జయప్రదముగ జరుగుట మిక్కిలి గొప్పసంగతి.

శాస్త్రి: అప్పుడే!

నవ: ఈసంఘకార్యదర్శి నన్నిచ్చటకు ఆహ్వాన మొనర్చుటలో నాయెడ చూపిన ఆదరణయు, నాకు చేసిన మర్యాదయు (జేబుల్లో చేతులు) ఎంతయు శ్లాఘాపాత్రములు. యువకు లింతపట్టుదల మాపు చుండ వెనుకంజవేయుట పిరికితనమని నేను నా ఆధిపత్యమునకు వప్పియుంటినిగాని వేఱొండు కాదు. (సులోచనాలు తీసి కుడిచేత్తో పట్టుకుని) ఇదివరలో ఈకుర్చీ అలంకరించుచుండెడి వారు అపారప్రజ్ఞావంతులు, అగణిత కీనుష్మీ ధురంధరులు. వారి మేధకును నా మేధకును హస్తిమశకాంతరము కలదు. ఆకారణమున బురస్కరించుకొని నిరాశ చెందుట మానవసహజనిషిద్ధమని యోచించి, ఉన్న పరికరములతో కరములతో, కార్యసానుకూలము చేయవచ్చునుగదా యని వచ్చితిని. చాలమంది అధ్యక్షులు తమప్రారంభోపన్యాసము అంత్యమున చేయుదురు; అనగా వారు మొదట నేమియు చెప్పక, అంతయును చివరకు దాచి యిచ్చెదను అని వాగ్దానము చేయుదురు. అట్లు చేయుటవలన రెండులాభములు గలవు.

సంగీ: (శాస్త్రితో మెల్లిగా) అట్లు చేయడంవల్ల ఒక లాభం తినెయ్యడం. రెండో దేమిటే?

నవ: అయ్యా! "ఎట్టికెట్టు" లేనిదే, నేను చెప్పజాలను

శాస్త్రి: (సంగీతరావుతో) అయిందా! నీకుమాత్రం ఎక్కడ జేకిసింది ఆటికెక్కట్టు?

నవ: మొదటి దేదియన, ప్రస్తుతవిషయములో లోగడ తనకు ఏవిధమైన తయారీ లేకపోయినను, అప్పట్లో ఇతరప్రసంగములు వినుచుండుట తటస్థించును కాబట్టి కొండొకచో అవి తెలిసినచో వానిలోని ఘాటుభావములకు విరుగుడు పెట్టియు, క్రూరభావములను దువ్వియు, ఖండభావములను పూరించియు, సముదాతువిమర్శ చెయ్యవచ్చు. రెండవ దేదియన ఒకవేళ ఇతరులమాటలు జాగ్రత్తగ వినినను అవగాహన కానిపక్షమున, తనఅభిప్రాయము వారియభిప్రాయముతో నేకీభవించె ననియు, ఆ అభిప్రాయము సుగ్రాహణపారీణులగు సభ్యులకు తెల్లమే కదా యనియు, దానిని మరల ఏకరువుపెట్టుట చర్వితచర్వణ మనియు అనినైచి సభ చాలింపవచ్చును.

శేషు: అవును. ఆనందంలాంటివార్ల భావోపన్యాసాలు తెలియవ్?

నవ: అట్టికారణములవల్ల నెంతమాత్రమును కాకపోయినను మీతొందరచేతనైననేమి, నేటి ఉపన్యాసకులగు బలవంతరావుగారి విలువగలవాక్యములను వినుటనుగురించి మీమనసుల దహుకొత్తుచున్న కౌతూహలమువలననైననేమి, మఱియితరకారణములవలననైననేమి, నే నింతటితో ప్రస్తుతము విరమించి, మించి, బలవంతరావుగారిని 'వేషము'అనెడి విషయమునుగురించి, తమఉపన్యాసమును ప్రారంభింపవలసినదిగా కోరుచున్నాడ.

[అని నవరసరావుగారు కుర్చీలో కూచుని, సులోచనాలు నుదుటిమీద పెట్టుకోగా, కలకలం బయలుదేరుతుంది. ఆయన సోడా తాగుతాడు. బలవంతరావు వేదికమీదికి వస్తాడు.]

బల: మిస్టర్ ప్రెసిడెంట్.

కొందరు: టెలుగు, టెలుగు ఓన్లీ, టెలుగు ప్లీజ్.

శాస్త్రి: శాంస్క్రిట్, సంస్క్రిట్.

ఆనం: హారా హుషార్!

బల: లేడీస్ ? అండ్, జెం—

నవ: (లేచి ఉపన్యాసకునితో) ఆగు డాసుడు. ఏమయా కార్యదర్శిగారూ ?

కార్య: (వస్తూ) చిత్తం.

నవ: ముందు వారితో ఉపన్యాసం ఆంధ్రంబుననే యని ఏర్పాటుగ చెప్పకపోతిరా ?

కార్య: చెప్పానండి. చెప్తే వారు అప్పుడప్పుడు మాత్రం ఆంగ్లపదాలూ, ఆంగ్లఇడియాలూ ఆంగ్లసంప్రదాయాలూ అప్రయత్నంగా దొర్లుతాయేమో గాని, ఆంధ్రాన్నే ప్రసంగిస్తానన్నారు. దాని కేమండి, ఆమాత్రం అడ్డమైనవాళ్ళకి దొర్లుతున్నాయి అనేశాను. కాని వారు తోడుతూ మజ్జిగపోసుకున్నట్టు మొదట్నించీ ఇల్లా చేస్తారని నేను అనుకోలేదు.

సభా: అల్లాయితే ఈసంగతి నోటుకి పెట్టండి.

నవ: మీ రిక్కడకు వచ్చి అడేటిదో తీర్మానపూర్వకముగా మున్ముందు క్రుతపరచుడు.

సభా: ఇదేమన్నా కోర్టు కెక్కుతాయనా మీభయం? పోనీ అల్లానే చేస్తాను.

"బలవంతరావుగారు 'వేషం' అనే విషయంనుగురించి తెలుగులో ఉపన్యసించాలని ఈ సభవారిప్రార్థన."

శేషు: ఈ ప్రతిపాదనని నేను బలపరుస్తున్నాను.

నవ: ఎవరికైనను ఆక్షేపణ ఉన్నదా? లేక ఈమాట లిట్టులేయునిచి ఓటునకుం బెట్టనునా!

సంగీ: కొద్దిగా సవరణ అవసరమండి. 'తెలుగులో' అనే మాటకి పూర్వం- 'అర్థభావరసములు జారనీయకుండా ఉచితమైన సంగీతము కలుపుతూ' అనే ముక్కలు చేర్చాలి.

శాస్త్రి: మరోసవరణ మిక్కిలి అవసరం. 'తెలుగులో' అనేపదానికి వామభాగమందు "గ్రామ్య తెలుగు కానట్టి" అనేమాటలు వలవాలి.

శేషు: "అగమ్య, అస్పష్ట, అనర్థపదాలతో నిండియుండని" అనేవరకు "తెలుగులో" అనేమాటమీద పెట్టాలి.

భావ: అయ్యా! అందరికీ నమస్కారాలు. కొత్తసందర్భం మనకి ఘటిల్లినప్పుడు దాన్ని అవగాహన చేసుకోడం మనధర్మం. మనస్వంత ప్రత్యేక విశేషాభిరుచులకి కొత్తసందర్భం అనుకూలమా ప్రతికూలమా అని మొదట్లోనే చెదిరి బేజారై పోవడం అజ్ఞానం. ఒకవిషయంలో మనకి ఉండగల శాస్త్రజ్ఞానమూ పట్టిగల్లి మనకి సంబంధం లేని ప్రతికొత్తసందర్భంలోనూ ముందుకి తొయ్యడంగాని, తత్ప్రకారమే ఆకొత్తసందర్భం యావత్తూ నడవాలని పట్టుబట్టడంగాని చాదస్తం. ఎవరో ఉపన్యసించ రమ్మనడ మేమిటి, ఓట్లేమిటి, ప్రతిదానికీ ఓట్ల సాధనమా? ఒకానొకసభ ఒకరోజున జరపడమా, ఆపడమా అనేది ఓటుకి పెట్టారు బాగుండి. ఒకాయన తనకి అప్పట్లో ఆకలి అవుతోందా లేదా అనే విషయం కడంవాళ్లు ఓటుకి పెట్టాలని కూచున్నారు. ఒకపండితుడు ఒకానొకదినం బుధవారమా గురువారమా ఓటుకి పెడితేగాని ఆ గ్రహాలు వస్తాయన్నాడు. వ్యాపారం అల్లా రానీయక మీకు ఇష్టంఅయితే ఆయన చెప్పే ముక్కలు వినండి. లేకపోతే ప్రయోజనంలేని చోటకూడా కర్రపిడిసూత్రాలు సంధించటం ఎందు కనగా తలో కిల్లీ యిచ్చి జనాన్ని సాగనంపండి.

కార్య: (కిల్లీలబుట్ట తెచ్చి కిల్లీలు ఇస్తాడు.)

నవ: వీరు చెప్పినమాట బాగుగనే యున్నది. అబ్బా! ఇప్పుడు పెట్టితిరేమయ్యా ఈపేటన? కిల్లీలా! త్రుటికాల మాగజాలకపోతిరే! ఈమహాసభ యుండునో మానునో ఏ రెఱుంగుదురు?

కార్య: ఎల్లా అయినా ఇవ్వవలసిందేకదండీ! మిగిలిపోతే ఇవన్నీ ఎం చేసుకోం?

నవ: సరియె. అటులనే కానిండు. ఏదిచెపా ఇంతుకంత రైన "ప్రాణాయిస్వాహా" చెయ్యక గడికాల మైన నేటివారు మనలేరు.

[అని కూచుంటాడు. సోడా తాగుతాడు.]

బల: సభాధ్యక్షా, సభ్యులారా! మీరు నాభాషనుగురించి తగాదాపడవద్దు. మీకార్యదర్శిగారు నన్ను ఆహ్వానించుట ఇంగ్లీషులోనే జరిపినాడు. నేను తెలుగులోనే అంగీకరించాను. ఆయన అప్పటి ధోరణిబట్టి ఇచ్చటి ప్రసంగం ఆంగ్లంలో నేమో అని భ్రమించాను. ఒక తెలుగువాడు సాటి తెలుగు వాడికి తనభావం ఇంగ్లీషులో చెప్పవలసిరావడం తెలుగువాళ్ల అదృష్టంగాని తెలుగుభాష దౌర్భల్యంగాని కాదు. తమభాషని తమరే వాడక ప్రపంచభాషలన్నిటిల్లా తెలుగుభాషే మిక్కిలి గొప్పదని, ఇతరులు – అనగా తెలుగు తెలియవలసిన అవసరంలేనివాళ్లు – అంటున్నారని తమరు ఇంగ్లీషులో సంతోషించడం తక్కిన తెలుగువాళ్లు గర్వించవలసినవిషయం కాదు. నాకు తోచిన సజ్జీముజ్జీభావాలు రెండుమూడూ నాతెలుగులోనే నేను చెప్ప గలను. చెబుతాను.

భావ: వినుడు వినుడు.

శాస్త్రి: సరేకాని, ఇదా 'వేషం'మీద ఉపన్యాసం? నోటికి వచ్చిందల్లా పేల్చడమా?

బల: అయ్యా శాంతించండి. నేను భాషనుగురించి అన్నాను. భాషఅనేది భావం దాల్చేవేషం. అందుకని నే నా 'వేషం'యొక్క హద్దులు దాటలేదు. భావం అంతర్యం, వేషం ప్రత్యక్షం ప్రకృతి భగవంతునివేషం. కాని, 'వేషం' అనేది మనం సాధారణంగా మనుష్యులదుస్తులూ, మనుష్యుల అలంకారాలూ మనుష్యుల ఆభరణాలూనుగురించే వాడతాంగాని ప్రకృతిలోని స్వరూపాలనుగురించి వాడం.

సంగీ: చాలా కర్రపిడిగా ఉంది.

శాస్త్రి: వేషంఅంటూపెట్టి మెట్టవేదాంతంలో పడ్డాడు.

బల: వేషం అనేపదానికి వాడకం విరివిగా ఉంది 'కోతివేషాలు నాదగ్గిరా ?', 'ఆట్టే వెఱ్ఱివెఱ్ఱివేషా లెయ్యకు చితకపొడిచేను', 'వేషంమట్టుకి దర్జాగా ఉంది,-లాంటివాటిల్లో. వీటిల్లో 'వేషం' అనే మాటకి అలంకారం, టక్కరితనంగాంటి అర్థాలు స్ఫురిస్తాయి. అయితే 'పగటివేషాలు' అనేమాట కూడా ఉంది.

శాస్త్రి: ఎంత ప్రాలబ్ధం వచ్చిపడిందిరా దేవుడా! అన్నీ అపవిత్రపుమాటలేనా.

సభా: ఇంకా సంస్కృతంగా ఉంటేగాని ఆయనికి నచ్చదండీ.

నవ: అయ్యా! ఈమాటు అసభ్యముగనూ, అటంకము గను వర్తించెడివారిని పంపివైచెద (అని కూచుని సోడా తాగుతాడు.)

బల: కాని 'దొంగవేషాలు' అనే మాటకూడా ఉంది. అంతమాత్రాన్ని వేషం దొంగతనం ఒక్కటే అని మనం నమ్మకూడదు. ఎంచేతంటే దొంగాడు వేషం వేసుకోకపోవచ్చు, వేషం వేసుకున్న వాడు దొంగాడు కానక్కర్లేదు. వేషం అంటే అందరూ ఎరుగున్న దొంగతనం.

"పగలెల్ల నాటల బ్రమయించుచును, సందు గొందులెల్ల నెఱింగికొనుచు, రేలు కన్న గాండ్రనుమ నగళ్లు ప్రవేశించి...."

అని సూరన్న చెప్పిందాల్లోకూడా ఆ వేషా కన పడుతోంది. ఎటొచ్చీ అల్లాంటి దొంగతనాలు రాత్రేళ్లే అంటాడు సూరన్న. నేటికాలంలో కూడా "ఈరోజున పగటివేళ వేషంలో వచ్చి అమ్మకులాగ మీకు కనిపిస్తాను నన్ను పోల్చండి" అని ముందే జనానికి నోటీసిచ్చి, అల్లా వచ్చి, ఎవరు ఎంత కళ్లొట్టుకుని పగటివేళ ప్రయత్నించి నాకూడా గుర్తింపబడకుండా వర్తించిన సున్నం వీరయ్యగారిని మనం ఎరుగుదుం. అయితే సూరన్న......

ఆనం: అయ్యా! అన్యథాభావులవారు క్షమించాలి. ఒక చిన్న మనవి. (బలవంతరావుకేసి తిరిగి) సూరన్న ఏమంటాడో పేరన్న ఏమనబోతాడో మాకక్కర్లేదండీ! మీ రేమంటారో అదే కానీండి. వారూ వీరూ చెప్పేసినదాంతో రచనలు కొట్టిపారేసినట్టు మీ ఉపన్యాసం దంచకండి మరి.

బల: ఎవ రామాట్లాడుతూన్నదీ ?

శేషు: ఆనందంగా రండి. ఈయన కవిత్వంచేసేట ప్పుడుతప్ప కనంఅప్పుడు భావం బోధపడేలాగే వ్యవహరిస్తారు.

ఆనం: వీరు శేషుగారండి. ఈయన రాసిందీ చేసిందీ లేదుగాని ఉండడమే జరిగితే తప్పకుండా బోధ పడుతుంది.

నవ: (లేచి) క్షమించవలె. పానకములో పుడకలవలె వచ్చి అడ్డువచ్చువారిమీద చర్య తీసుకొనక మరి ఆగ లేను. (బలవంతరావుతో) కానిండు.

[అని కూచుని సోడా తాగుతాడు.]

బల: ప్రస్తుతవిషయానికి సంబంధించిన పూర్వరచనలు తెలుసుకోడం నేరంకాదు సరికదా తెలుసు కోకపోడం ద్రోహం. ఏమి ఉండేసిందో తెలిసి నప్పుడుగాని మనుష్యులకి ఇక ఏం ఉండాలో తెలియదు. పూర్వుల అనుభవం దూరంగా తోసి స్వతంత్రయత్నంమీదే ఆధారపడేవాన వుకు తనజీవితం అంతా తనబుద్ధిబలం వెచ్చించి వెయ్యేళ్లకిందట స్పష్టంగా గుర్తింపబడి రూపం దాల్చి ఉన్నసంగతే నేడు కనిపెట్టడం దేవు డిచ్చిన బుద్ధిని సద్వినియోగం చెయ్యడంకిందికి రాదు. కాబట్టి క్షమించాలి. 'వేషం' అనేమాట ఇంకా ఇతరపద ప్రయోగాలలో ఉంది. పగటి వేషం, భామవేషం, పంతులపట్టాణీవేషం, నాటక వేషం, వేషంవెయ్యడం ...అని ఒకడు, అసలు ఎవడో ముందు మనకు తెలిసిఉండి తరవాత బుద్ధి పూర్వకంగా ఇంకోడులాగ మనికి కనపడగలిగి, ఆ యింకోడిఅవస్థలో జనాన్ని - వీలైనంతమం దిని - పడగొట్టగలిగితే అతడు వేషం వెయ్య గల డన్నమాట. ఇన్ని జీవరాసుల్లోనూ ఒకరి

వేషం ఇంకోరిది కాకపోడంవల్లే వేషధారణ
యొక్క అవసరం కలిగింది. కాని, పట్టిబాహ్య
వేషం వేసుకున్నంతమాత్రాన్ని అన్యత్వం నిరూ
పణ కాదు.

శాస్త్రి: (ఆనందంతో గట్టిగా) సరే. వీడు నాటకాల
బాపతురోయ్.

నవ: (లేచి) ఎవరది ?

శాస్త్రి: నేనేనండి. మావాడితో ఏదో చెప్పుతున్నాను.
తరవాత జ్ఞాపకంరాదేమో అని. ఇది ప్రైవేటు.

నవ: రహస్యంకా! మేము వినటమే! సరి. నిశ్శబ్ద
ముగామాత్ర ముండుము. (బలవంతరావుతో)
మీరు కానియ్యుడు.

(అని కూచుని సోడా తాగుతాడు).

బల: అంతర్యంలోకూడా అన్యత్వం సాధించుకున్న
ప్పుడుగాని వేషధారణానికి సార్థకత లేదు. తన
మనస్సూ తనస్వత్వం తాత్కాలికంగా చంపే
సుకుని, అన్యమైన ఒకానొక కల్పితపాత్ర
యొక్క మనస్సూ, స్వత్వం, వేషం, భాషా
తెలుసుకుని అనుభవించి తెచ్చి తనమీద పెట్టు
కుని, అంతటితో ఆగక, అప్పట్లో ఉండే శ్రోతల్ని
ప్రేక్షకుల్ని - "మనం అనుభవించుతూన్నది
మనం ఎరుగుండగా ఇక్కడ ఉన్న ఫలానా
వేషధారి అవస్థా, లేక కేవలకల్పితంఅయిఇక్క
డలేని ఫలానాపాత్రయొక్క అవస్థా?" అనే
మిథ్యలో దింపి జీవితంయొక్క మిథ్యాత్వం
అందరికీ చిటికెలో తమాషాగా బోధించగల
గడంకంటె మానవజన్మయొక్క సార్థకత
మరోటి లేదు. ఆరీతిగా నటించడం మహా
కార్యం.

శాస్త్రి: నాటకాల్లో తిరగడమా, పాడైపోవడమా ?

బల: వేషాలు వేసేవాళ్లలో పాడైపోయినవాళ్లూ, పాడై
పోయి వేషాలేసేవాళ్లూ ఉంటారు. కాని,
ఎన్ని విధాల తను పాడైనా ఎంత చచ్చురకపు
నటుడైనాసరే మంచితనం గలిగి ఉంటాడు.
మంచితనం మనస్సులో ఉంటేగాని నటించ
డానికి మానవుడు వెళ్లనేవెళ్లడు. నటులలో
పాడైనవాళ్లు కొంచెం ఉంటే నటేతరుల్లో పాడు
చేసేవాళ్లు అంతా ఉన్నారు. కాని, నా ప్రసం
గం వ్యక్తులనుగురించి కాదు. కొందరినటులకి
ఇంకా అంతర్యంసంగతి తెలియలేదు. మనుష్యుల్ని
అన్యులుగా మారనీయకుండా తనస్వత్వాన్నే
స్థాపించి తనవ్యక్తిత్వాన్నే సిద్ధాంతించేటి గా
నాన్ని (— అదీ మళ్లీ పావలారకం) — వద
ల్లేనినటు లున్నారు. 'వేషం' అనేపదానికి
అర్థం కొందరి చర్మాకోటు దిగి వారిహృద
యంలో ప్రవేశించలేదు. అంతర్యం మార్పుతో
డానికి మానవుడిమనస్సు పెట్టిపుట్టింది. అంత
ర్యంలో మార్పులేకుండా ఊరికే బహిర్వేషత
వెయ్యడం దొంగవేషం వెయ్యడం.

సభా: సభవారిమీద చాలా వేషాలు ప్రయోగిస్తున్నారు.

నవ: ఎవరది ?

శేషు: వారు సభాపతిగారు.

నవ: నిజమే?

సభా: కాకపోతం ఏమిటి ? నేనే సభాపతిని.

నవ: కార్యదర్శిగారూ! ఇదికూ మీవేషము ? మీ
కు[illegible]ను.

శాస్త్రి: అన్యకుడుకూడా 'వేషం'లో పడ్డాడు.

నవ: మీరు అసలు సభాపతిని వేరే ఉంచుకొని నన్ను
కుర్చీమాత్రునిచేసి ఇక్కడ నియమించితిరా?
అట్టిచో నే నేగెద. (అని వెళ్లబోతాడు.)

చాలామంది : రామరామా! అది ఆయన పేరండీ!

నవ: (ఆగి, నవ్వుతూ) అటులనా? రూఢియే ?

శాస్త్రి: అవునో కాదో టిక్కెట్టు చూపెట్టమనండి.

సభా: లేకపోతే ఓటుకి పెట్టండి, తమదయ.

బల: ఆగ్రహిస్తే కార్యంలేదు. దయచెయ్యాలి.

శాస్త్రి: దయచెయ్యడంఅంటే ?

బల: (నవరసరావుతో) భుక్తం తమదేగా కూచోండి.

నవ: మరే త్వరగా తెముల్చుడు. ఇది ఇటులనే యేడ్చుచుండును.

[అని మళ్లీ కుర్చీ అలంకరించి సోడా తాగుతాడు. అంతా చప్పట్లుకొడతారు.]

బల: జీవితంలో దిగంబరమత సిద్ధాంతులు ఏకొందరో ఉన్నా, చాలామంది మానవులు ఏదో వేషం వేసుకునే ఉంటారు. ఆవేషం దేశకాలపాత్రల స్థితి గతి వైపరీత్య స్వభావ ఆదర్శాలబట్టి ఉంటుంది. నాటకరంగంమీదికి పాత్ర ఏకో విశేషవేషంలో జల్లాలా అక్కర్లేదా అనేది తలటావిషయమే. ఏదో కొత్తగా ఉండే వేషం భాషా అక్కర్లేదనేవాడు జ్ఞాని,— 'తస్యకార్యం న విద్యతే'. కొంత అదనపువేషంతో అక్కడ నిలబడితేగాని మామూలుగానేనా ప్రేక్షకులకి అనిపించదనిన్నీ, జీవితంలో మామూలుగా ఉండేవేషంతోమాత్రమే రంగంమీద సిద్ధం అయితే, ఆదృశ్యం, విశేషభావనా శక్తిలేని జనానికి పేలవంగా ఉండి పట్టివ్వదనిన్నీ, అన్య త్వస్ఫురణకీ తరతమభావ నిర్ణయానికీ విశేష వేషం దోహదం అనిన్నీ, కొందరు జ్ఞానుల విశ్వాసం. అందువల్ల, పాత్రయొక్క వయస్సుని బట్టి (— బాల్యాద్యవస్థల్ని అనుసరించి), పాత్రయొక్క తెగనుబట్టి (— వర్ణ ఆశ్రమ ఉద్యోగ ధర్మాల్ని అనుసరించి), పాత్ర యొక్క పరిస్థితుల్నిబట్టి (— ఆపాత్ర ఉన్నది గృహమా, ఆరామమా, దుర్గమా, ఆస్థానమా, అంతఃపురమా, అరణ్యమా, యుద్ధరంగమా, ఘంటాపథమా అనేదాన్ని అనుసరించి), పాత్రయొక్క కాలాన్నిబట్టి (— అది భూతకాలం అయి ఫలానా అని తేల్తే ఆకాల భాగాన్నిగురించి వర్తమానకాలంలో జనానికి తెలిసినదాన్ని అనుసరించి), పాత్ర ఎవరిసమక్షంలో అభినయింపబడుతోందో ఆసభవారి విజ్ఞాన ఔన్నత్య అభిరుచుల్నిబట్టి, నాటకం ఆడించేవారంటూ ఉంటే వారికృషిపరిశోధనలూ వారికళాభిలాషా వారిసత్యస్థాపనా ప్రియత్వమూ వారిధనబలమూబట్టి, నాటకం ఆడేది కిరాయినటుల క్షణికసమాజం కాకపోడాన్ని బట్టి, ఉంటుంది, ఉండాలి. పైగా, ఆయా వేషాల వర్ణరూపాలు ప్రేక్షకులకి స్ఫురింప చెయ్యడమేగాని కావలిసినదీ, ఆమట్టుగా ఉన్న బాపతో ఋణంతెచ్చిన బాపతో డబ్బోసి ఆ అసలుదుస్తులన్నీ కొనుక్కొచ్చి ఆరిపోతం కాదు. మరకులు విస్తారంఅవడంవల్ల నాటక వేషధారణం తృప్తికరంగా ఉండదు. వృత్తి నటుల్ని ఏమనీ కార్యంలేదు. చాలాభాగం పురాణనాటకాలు. పురాణనాటకాలు రచించడంలో సదుపాయాలు లేకపోలేదు. నూతన పాత్రసృష్టి అవసరంలేదు. "ఈ నాటకమునందు వచ్చుపాత్రలు" అని శీర్షిక పెట్టేసరికి కావలిసినంతమంది శివకేశవులంటి వాళ్ల పేర్లు ఆపుస్తకంలో హాజరు అవుతాయి. వస్తువు లభించినతరవాత పేరెట్టడం ప్రపంచంలో వరస. ఇక్కడ పేర్లుమాత్రం మొదటే దొరుకుతాయి, వాటితరవు వస్తువులు పుట్టనేపుట్టవ్. కథా కల్పనా ప్రజ్ఞ అవసరంలేదు. బాగుండకపోతే, లోగడే అల్లా ఉందిన స్నెం జెయ్యమన్నారు, అవడానికి వీలుంది. మనదేవుళ్లు స్వయంగా నాటకరంగంమీదికి వెలిసి పావలాతో మనకి మోక్షం ఇచ్చేస్తారు. దొరికినకాడికి అది మనం ఇంటికి పట్టుకుపోడమే తరవాయి అనేనమ్మకంతో నాటకానికి ఎగడే అంధజనాన్ని విరివిగా ఆకర్షించవచ్చు. నేటికాలపు సంగతులతో నాటకం అయితే వీథింట వెళ్లే అడ్డమైనవాడూ దానియొక్క యోగ్యతాయోగ్యతలు తరిచి చూసి నిలవకట్టేస్తాడుగాని, వీలైనంత వెనకటికథగలదీ, కాలవిషయంలో అస్పష్టతగా ఉండేదీ, దేవుళ్లు ఆడేదీలాంటిది అయితే ఎన్ని అసందర్భాలు అందులో పోసుపడ్డా, 'వాళ్లు మహిమగలవాళ్లుగదా, ఈవూరి తోటలోనే, వెనక, వాళ్లు ఎందుకు ఉండి ఉండకూడదూ!' వాళ్లు ఇచ్ఛారూపులుగదా, చమ్కీడ్రెస్సూ ఎలెక్ట్రిక్‌బల్బూ కొనుక్కోడానికి వాళ్లు

మాత్రం ఎందుకు బదులుచేసి ఉండకూడదూ !' 'మనకే ఇంగ్లీషు వచ్చినప్పుడు దేవేంద్రుడు మాత్రం హిప్ హిప్ హుర్రేలాంటి ఇంగ్లీషు ఎందుకు ఎరిగున్నవాడయి ఉండకూడదూ !' లాంటి సమర్థింపుల్తో ఎల్లాంటిచిక్కైనా విడ గొట్టెయ్యొచ్చు. అదీగాక, నేటి సందర్భాలు పట్టిగిల్లి వాళ్లకి ముడెట్టి అప్పట్లో వాళ్లకిమాత్రం ఈ సమస్యలు ఎందుకు ఉండేఉండకూడదూ అని వాదించవచ్చు. ఘనపరిమాణమూ నృత్యగాన వాక్చేష్టలూగల మనుష్యులు పాత్రలుగా రంగం మీదికి వచ్చిపోయే పురాణనాటకాలు బయల్దేరింతరవాత ఆపురాణపాత్రల వేషాల నిక్క తటస్థించింది. చారిత్రక నాటకాల్లో శిల్పచిత్ర పదరచనల సాహాయ్యంవల్ల వేషంయొక్క పరిణామవర్ణ రూపాలు జ్ఞానలు స్థిరపరుచుకోవచ్చు. సాంఘిక నాటకాల్లో మరీస్పష్టంగా వేష నిర్ణయం జరగొచ్చు. పురాణ పాత్రలవేషమే తగాదా. వాళ్ల వేషాలు పురాణనాటకకారులు ఎరుగుదురేమోకాని చెప్పరు. 'అంతట బ్రహ్మ ప్రవేశించును' అంటారు అంతే. ఏతిట్లలో సిద్ధమై నటులే ఏదో ఏడుస్తారు. పురాణపాత్రలు ఆంధ్ర నాటకపాత్రలుగా మారిపోవడంలో నలిగి శీర్ణం అయిపోవడం జరిగిందని తెలిసినపండితులు బాధపడి చెబుతూంటారు. జనరంజకత్వం - ఒకొక్కప్పుడు అపసవ్యమైనరకం - మనస్సులో పెట్టుకుని, నాటకకారుడో, నాటకం ఆడించేవాడో, నటుడో, మాట లందించేవాడో తెలిసో తెలియకో ఆపుణ్యం కట్టుకునిఉంటాడనుకుందాం. ఆపాత్రలు దేవుళ్లలాంటి మనుష్యులు, మనుష్యుల్లాంటి దేవుళ్లు, సగపాలు దేవుళ్లు, ఇమిటేషన్ దేవుళ్లు, ఇప్పటి జపాన్ దినుసులాంటి చౌకబారుదేవుళ్లు, శుద్ధ పచ్చి మనుష్యమాత్రులు - ఈరకం అయితే వాళ్లసతనంగురించి ఎవరైనా దుఃఖించడం అనవసరం. ఆమాత్రం కష్టాలు ఎవరికేనా వస్తాయి. ఋషుల్నిగురించైనా చింతిల్లడం అనవసరమే - ఎటొచ్చీ వాళ్లకి కాస్త జనపనారగడ్డాలూ వాటి కంపూతప్ప ఇతరబాధ లేదు. మరీపెద్దదేవుళ్లకి మరీకష్టాలొచ్చాయి. ముఖ్యంగా బ్రహ్మ విష్ణు శివుడు, వీళ్ల భార్యలు, నారదుడు. బ్రహ్మాదులు వరాలివ్వడంతప్ప ఇతర్రా ఏమీ ఎరగని అమాయికులే. అయితేం, వీళ్లని లాక్కొచ్చి నాటకకారులు వీళ్ల వేషం వేయించితీరతారు. సాటి మానవుడి హృదయంగాని, స్వంతహృదయంగాని మానవుడికి బోధపడదే, వీళ్లహృదయం నాటకకారుడికి ఎల్లా తెలిసిందీఅంటే ఎవరో తెలిస్తే తెలియవచ్చు.

ఆదర్శంగా పెట్టుకుని ,ఆరాధించుకునేనిమిత్తం సామాన్యబుద్ధికి అతీతమైనసంకల్పాలతో ఉత్తమలక్షణసముదాయాలకి మూర్తులుగా దేవుళ్లనిమానవులు భావనలో సృష్టించుకుంటారు. దైవసంపదగాని అసురసంపదగాని మానసికలక్షణసన్నివేశమేగాని స్థూలశరీరసంబంధి కాదు.

శాస్త్రి: ఓరిబాబో! పురాణనాటకాలు కూడదంటావా?

నవ: తమకు తరుణము ఇచ్చినప్పుడే తమరు మాట్లాడుదురు.

సభా: మీరు తమకి తరుణం ఇచ్చినప్పుడుమాత్రంతప్ప కదం ప్రతీఅప్పుడూ మాట్లాడకుండా ఎంత మాత్రం ఉండలేరు.

నవ: అయినరోజ చర్యతీసికోమనట రూఢి.

శాస్త్రి: తమరు ఏం తీసుకున్నా సరే. బద్ధుణ్ణి.

[నవరసరావుగారు సోడా తీసుకుంటాడు.]

బల: ఆయాదేవుళ్లనిగురించిన ఊహాలు శిలారూపంగాని చిత్రరూపంగాని ధరించి విగ్రహాలుగాగాని బొమ్మలుగాగాని మారి సంకుచితంఅయినా అవి వాగ్రహితంఅవడంచేత మానవుల మన్ననకి పాత్రంఅవుతూనేఉన్నాయి. కాని, ఒకమనిషి — వాడికి ఎన్నిరాగాలొచ్చినాసరే — దేవుడు రూపంలో వచ్చానంటూ మాట్లాడ్డం మొదలెడితే నవ్వులాటే. అతిపవిత్రవిషయం ఆచరణలోకి దింపగా అతిఅపవిత్రంగా పరిణమించడం ఇదే. అసమర్థులైన నటులు దేవపాత్రధారణం

చెయ్యగా చూసి మోసపడి నేను ఇట్లా అంటున్నానని తమరు పొరపోవద్దు. వెయ్యవలసిన వేషం మరోటొప్పదేవుడిది అయినకొద్దీ అందుకు మరీ నచేతరుకుగాని అసలు అంగీకరించడు. అందుకనే కొత్తవాళ్లకీ, పాటూరాక మాటా ఖణిగిబిణిగీ చెప్పలేనివాళ్లకీ, ఏదో వేషం సరదా వాళ్లకీ, అసలువాళ్లు దగా చెయ్యగా పూచీ గడిచేటందుకు వచ్చేగర్భాశ్యుల్లకి అని సర్దుతారు. ఆఖరికి దేవుళ్ల వేషాలకికూడా సమర్థుల్ని కేవలి పాస్తే వచ్చేదొత్తు వస్తుందని నాటకాలు ఆడించేవాళ్లు అంటారు. అయినా, మహత్తరంగానూ ఆచరణీయంగానూ ఉన్న పురాణగాథ సర్వజన విదితంఅయి ఉంటుందిగనక దాన్ని విసర్జించుకోనక్కర్లేదు. ఎందుకంటే కథ సృష్టించడం అంటే మజాకా కాదుగనకనున్నూ, మనం సృష్టించేకథలు ఎల్లాఉంటాయో మనకి తెలుసుగనకనున్నూ. కాని, పేర్లమాత్రం పురాణంలోవి ఎత్తుకుని, వాటినిసరించి జనబాహుళ్యంలో ఎంతమాత్రమూ ప్రచారంలో లేని కొకమకలు ఆపేర్లతో జతకరిచి సంకరం చెయ్యడం అధర్మం. మార్పులు అవసరమే. దేనికేనా ఓదారీ ఓతెన్నూ, ఓసబబూ ఓసందర్భమూ, ఓక్రమమూ, ఓఅనుభవమూ, ఓతీర్పూ ఓకూర్పూ, ఓపనివాడితనమూ ఓబోధకత్వమూ ఉండాలి.

పురాణబ్రహ్మ చతుర్ముఖుడు, వారిజాసనుడు, సృష్టికర్త, వేదమూర్తి ... ఇల్లాగా భావింపబడ్డవాడు. నాటకబ్రహ్మ సాధారణంగా యం బ్రహ్మ. ఒకొక్కప్పుడు తలకాయిలుమాత్రం నాలుగుంటాయి. ఒకసారి ఆపెట్టుడు తలకాయలు వేషధారి చెవులు మూసెయ్యడంవల్ల అతడికి ప్రాంప్టింగ్ అందక, ఆబ్రహ్మ ఒక్కమాటకూడా ఆడలేకపోయాడు – పీడివేదాలు బంగారంగానూ! ఒకసారి ఒకనాటకహిరణ్యకశిపుడు పెద్దవచనం చదివి బ్రహ్మని వరాలు కోరుకోగా, బ్రహ్మ కనుసంజ్ఞలు చేసి చేసి, "సరే, ఇచ్చితివి" అని తనపార్టు కాస్తా అనక, డిప్‌లో వాళ్లకి వినపడేలాగు "నాకు పార్టు రాదు. నేను రైల్లో ఇప్పుడే వచ్చాను" అని హిరణ్యకశిపుడితో అన్నాడు. పురాణవిష్ణువు, లోకస్థితికరుడు, విశ్వవ్యాపి, అవతారధారి, శేషశయనుడు, ... ఇల్లాగ్గా ఊహింపబడ్డవాడు. నాటకవిష్ణువు ఏ ఒకటి రెండులక్షణాలో కలవాడై వచ్చి ఊరుకోక మామూలుమనుష్యులకంటె హీనంగా ప్రసంగిస్తాడు. ఎంత సంగీతం వచ్చిననటుడైనా అదేరకం. పురాణశివుడు అర్ధనారీశ్వరుడు, అనలాక్షుడు, మంగళకరుడు, లోకసంహారి, తాండవమూర్తి ... ఈలాగ సంకల్పించుకోబడ్డవాడు. మనసాప్యదృష్యుడు అని మహాకవిఅభిప్రాయం. నాటకశివుడు త్రిశూలంగాని చందమామగాని పాముగాని, దొరికిన పరికరాలతో డబ్బీపన్నాగడ్డంతో తయారు. 'శివశివా! నీ కేంతగతి పట్టిందిరా!' అని ప్రేక్షకులూ శ్రోతలూ అనుకునేటట్టుగా నాటకశివుడు సంభాషణ వగైరాలు చేసి, తాండవం వగైరాలు లేకుండానే పారిపోతాడు. పురాణ ఇంద్రుడే అసలు ఒకఅసందర్భపుకల్పన. ఆయన వన్నీ దిక్కుమాలినపన్లే. ఆయనమీద ఎప్పుడూ విశ్వాసరాహిత్యమే. ఆయనపదవికి ఎప్పుడూ తవారే. ఆయన కెప్పుడూ ఉల్టాసీదాభయమే. ఇతరులనిష్ఠ చెడగొట్టాలని ఆయన ఎప్పుడూ స్త్రీలని పంపడమే. నాటకఇంద్రుడు ఎప్పుడూ సభ చెయ్యడమే. మామూలు సంగతులు ఎప్పుడూ ఇతరుల్ని అడగడమే. భోగరాయడుగనక వారి కోర్టులో ఎప్పుడూ భోగంఆటే. ఖిలై నంత పచ్చిగా ఆమేళం జోనపడంనిమిత్తమే కొన్ని నాటకాల్లో ఆకోర్టు. నాటకఇంద్రుడు అయిదారు రాగాలు అనం వచ్చినవాడున్నూ చమ్కీవేషం (— పువ్వులతో సహా — కళ్లనిమిత్తం) తొడుక్కున్నవాడున్నూ అయితే నవ్వు తెప్పించడు. ఇక పురాణనారదుడు. ఈయన ఒకగొప్పకల్పన. "అధ్యాత్మవేదియుం గృపాళువునైన నారదుండు — పారదరుచిదేహుడు — అతులభాగ్యోదయుడు - అపార

దశాకృతి — నివేశవిశారదుండు - ప్రాచీనబర్హికి ఆత్మతత్త్వ ముపదేశించినవాడు -- ఈశ్వరదత్తమై బ్రహ్మాభివ్యంజకములైన సప్తస్వరంబులు తనయంతన మ్రోయుచున్న వీణాలాపనరతిం జేసి నారాయణకథా గానంబు సేయువాడు - భగవంతుండగు నారదుండు" అని పోతన్న )— వ్యాసుడు) పొగిడిన భాగవతోత్తముడు, భక్తశిఖామణి. నాటక నారదుడు పరమపాపిష్ఠికరం. వాడివేషం — బొంబాయి బాపతుగావును — తలంతా బాగా నున్నగా గవ్వమెరుపు వచ్చేలాగు చెక్కించి ఉండడం, వెనక్కి నిగిడే పిలక ఉండడం — అది అచ్చంగా ముదిరి పళంగా ఉన్న గంగాబొండం అనిపించడం - పాంకోళ్లు — వాయించని చిడతలు — చేతులో తీగెలు లేని వీణ (— పోతన్న రాసిన దాన్నిబట్టి నారదుకు చాలి. నారదుడు ధరించే మహతి దానంతట అదే విష్ణుకీర్తనలు మోగుతుంది గనక, కొందరునటులు అసంగతి గ్రహించి తమ కట్టెకి తీగెలు లాగేసి ఉంటారు), తీగలున్నా చేత్తో ముట్టుకోరు; ముట్టుకున్నా ఒక చేత్తోనే తల్లకిందులా వాయిస్తారు. నాటక నారదుడు 'అగ్గిపెట్టెగాడు'ట. అందుకనే మాటలు వినిపించనిపాట పాడుతూ పాడుపన్లు చేస్తాంటాడు. పాడతాడని మనం క్షమించాలి. నాటక నారదుడు దేవుడూ కాడు, ఋషీ కాడు, మనిషీ కాడు, మంచి రాక్షసుడూ కాడు - ఒకటోరకమైన లుచ్ఛా. అటువంటివాణ్ణి, పట్టుబడితే, మామూలుగా తవ్వి పాతేస్తారు. విశ్వప్రపంచమూ సత్యాధారం అనిన్నీ, సత్యం తెలియడం వల్ల కలహాలు ఎక్కువే అనిన్నీ సూచించడానికి పురాణనారదుడు కల్పింపబడి ఉండవచ్చు. రాగాలు మనకి లంచంగా ఇవ్వలేని నారదుణ్ణి నాటకంలో చూస్తే ఆపాత్ర ఎంత అపాత్రం అయిపోయిందో తెలుస్తుంది. ఇక లోకమాతలుగా ఊహించుకోబడ్డ లక్ష్మీ, సరస్వతి, పార్వతులు. ఎవరో మాతలు ఆరూపం అని చేరెట్టుకుని కనిపించినప్పుడు దేవత్వపుస్ఫురణ ప్రేక్షకులకి అవుతుంది అనుకోవడం హాస్యాస్పదం.

ఆనం: లేకపోతే మగాళ్లా ఏమిటి ఆడవేషం వెయ్యడం? భ్రుకుంసుల్ని మీరు వెనకేసుకొస్తారుగావును!

బల: వెనకేసుకురాను. భయపడకండి. అయినా, కళలో శాసనం చెయ్యడం సాహసం అనిమాత్రం అంటాను. ఎంచేతంటే వ్యర్థం. భ్రుకుంసులైనా శోకరసం ఒప్పించడంలో ప్రచారంలేని ఆరోజుల్లోనే విశేషఖ్యాతి గాంచిన కీ. శే. జగ్గరాజుగార్ని ఎరుగుదుం. నేనూ శృంగారం ఒలికించుతూన్న నరసింహారావుగార్ని ఎరుగుదుం. ఆ భ్రుకుంసుల్ని మించిన నటీమణులు రంగంమీద ఉన్నారేమో చెతగాలి

మెట్టుకి, పురాణంలో ఉన్నంతవరకు అట్లాంటి పాత్రలు జనంయొక్క భావనలో ఉండేవారు తీరిపోయేది. వాళ్లని నలుగురి ఎదటికీ మనిషి వేషాల్లో ఈడ్చి వాళ్లచేత నిత్యకృత్యపు సంగతులు మాట్లాడించేసరికి, వెనక చాలా గొప్పవాడని పేరు మోగిపోవడంచేత వాడిదర్శనభాషణాలు జన్మతారకం అనుకుని వాణ్ణి ఆహ్వానించగా వాడు నోరు విప్పేసరికి "ఛెపె! పీడట్రా" అనిపించినట్టు, నవ్వులాటగా తయారయింది. నాటకదేవుళ్లు పరిహాసానికి అనుకూలం అయిన సరుకుగా మారడం జరిగింది. ఇది మతోద్ధరణమా మోక్షప్రాప్తా?

సం: అది భావనలేనివాళ్ల దెబ్బలాట.

బల: ఇతరులు తమభావనతో అట్లాఅనుకుని తీరాలీ అని మీరు కోపపడితే, మేం భయపడి అట్లానే అనుకోవలసివస్తుంది. అది కాదు పనివాడితనం. అదే ఇతరులకి అట్లా అనిపించాలి.

సంగీ: పోదూ! పాట తిన్నగా పాడితేసరి! వేషంలో ఏముందీ, మాటల్లో ఏముందీ! నటుడు సంగీతం తియ్యడంలో ఉంది.

బల: నాటకాలు గొప్పవైనప్పుడుగాని గొప్పనటులు పుట్టరు. ముందు నాటకకారుడూ, తరవాత

నాటకాలూ, తరవాత నటులూ, అదీ క్రమం. ఏమైనా, దేవతలు తమకు ఏయేవేషంలో ప్రత్యక్షం అయ్యారో ఆయొక్క వయినం, ప్రబంధకవుల్లాగ, నాటకకారులు చెప్పడం నయం. మానవపాత్రలవల్ల ప్రత్యక్షంలో సాధించడానికి వీలులేనంత అఖండం అయిన కార్యాలు నాటకకారుడి దృష్టిలో ఉండి దేవుళ్లని రంగం మీదికి 'సమను' చెయ్యడం అతడికి తప్పనిసరి అయితే, ఆనాటకకారుడు, ఆ మూ దేవుణ్ణి ఒక లిప్త కనపడమని తక్షణం అతడు అంతర్ధానం కావడానికి సెలవు ఇవ్వనేమో, మాటలు పెట్టకుండా మొద్దులాగ కనపడేటట్టుచేసి కాస్సే పట్లో తెర వేయించి ఊగుకోవడమో, అశరీరుణ్ణి చేసి కంఠస్వరం పరోక్షంనించి వినపడేటట్టు చెయ్యడమో అవలంబిస్తే, కొంతవరకు పరిహాసం కట్టచ్చు.

శా॥స్త్రి: నాటకం అంటే విలాసం, వినోదం. 'వేషం' అంటూ పెట్టి ఏమిటి ఈ హంగామా?

నవ: అగుడు. తమరు త్వరలో ముగింపుడు.

బల: నాటకం వినోదమే. నాటకం రాస్తే గొప్ప, చూస్తే తమాషాయే. కాని వేస్తే నీచంఅని కొందరివాదన. అనవసరపు అల్పరాగప్రజ్ఞనే పరమావధిగా పెట్టుకుని సాధారణ ఆంధ్రనటుడు ఎందునా బొందనివాడు అయ్యాడు. ఈరహస్యంలోనే మానవుల నాటకప్రీతికి కారణం కూడా ఉంది. హృద్దేశంలో వేంచేసి, చరాచరాల్లో నిండి, నాటకం ఆడిస్తున్నాడో ఆడుతున్నాడో గాని, ఆదివ్యనటుడు అందర్నీ రక్షించునుగాక! నమస్కారం.

శా॥స్త్రి: అయితే ప్రతినాటకపువాడూ ఇంతే?

బల: ఆ. సంగతి తెలిసిన ప్రతివాడూ!

శా॥స్త్రి: అయ్యా! అధ్యక్షులవారు! రెండుముక్కలు నాడొక్కలో నున్నవి. అవిక్కడ కక్కెద. లెక్కకు మిక్కిలియై, బంగరక్కరములతో చెక్కట కెక్కలై, చెక్కు టక్కుటెక్కులు గలిగి, మిక్కుటమైన ముక్కున గలిగి, చక్కని చక్కెరముక్కలును, అక్కడక్కడ ఉక్కు చెక్కులవంటియు ...

నవ: అయ్యా! చాలును. దిక్కులు పిక్కటిల్లుచున్నవి.

శా॥స్త్రి: వేరుదిక్కుల కొన్ని డొక్క వాలికలుచేయునవియు ...

భావ: మహాప్రభో! ఆగండి! మీ రచనా టేమిటి?

శా॥స్త్రి: నాకల్లాంటి గొప్పప్రమాణాలు ఉన్నాయి. అయిన ఇప్పుడు చెప్పింది శుద్ధకోత.

నవ: మీరు అంతటితో ఆపండి! ఇంకను మాటాడెడివారున్నారా? ఎవరును లేరని యనుకొనెద. తరువాతవిషయము — 'అగ్రాసనాధిపతి - అంత్యోపన్యాసము.'

[కొంచెం దగ్గి, గొంతుక ఝాడించి సులోచనాలు ముక్కుమీదికి తీసి]

సభ్యులారా; చాల కాలాతీతమైనది. ప్రప్రథమమున మీకు నేను చేసియున్న వాగ్దానము నుపసంహరము చేసిపై దీక్కొనవలసి వచ్చుచున్నదిగదాయని చిట్టు వగచెద. జరిగినదానిలోని సారస్యము గ్రహించుకొంటిరా, యద్దానిని మీకే వీడెద. ఉపన్యాసకులు గోరంతలు కొండంతలు చేసినారు. అసలు ఇదితగాదాయేకాదు. గ్రహింపవలయునుగాని, ఏదియు తగాదా కాదు. ఉచిత నాటకము చక్కగ వ్రాసి, ఉచితనటులు రమ్యముగ నద్దానినిం జదివి, ఉచితవేషములు సుందరముగ ధరించి, ఉచితరంగముపై లీలగ నెక్కి, ఉచితాభినయమును రమణీయముగ నెరపి, ఉచితరాగ మద్దానితో కోమలముగ మేళవించి, ఉచితరస ముప్పతిల్ల చేయునెడ, ఉచితముగ నుండునని నా సముచితాభిప్రాయము. సభ ఇంతటితో సరి.

[అని కూచుని సోడా తాగుతాడు. అంతా చప్పట్లు కొడతారు.]

భావ: అప్పుడు మేం అంతా ఉచితంగా విని ఉచితంగా చూస్తాం.

కార్య: ఆర్యులారా! నేటి కార్యక్రమం ఇంత జయప్రదంగా జరిపి, ఇంత ఉచితంగా ముగింపజేసిన శ్రీశ్రీ నవరసరావుగారికిన్నీ, నేడు ఉపన్యసించిన బలవంతరావుగారికిన్నీ శ్రమకోర్చి దయచేసిన సభ్యులకున్నూ, అనేకశతసహస్రవందనాలు. నమస్కారం.

---

# నేఁడు

"భరణి - కృత్తిక"

లలితకళావనవీథుల
గళము విప్పి పాడుకొనుచు
నరిగెడు ఆనందజీవి
కరవిరిసిన యలరు దొరకె.

ప్రమదాంబుధిజలములందు
పయన మ్మొనరించు పాంథు
కరయుగళికి వెలుగు నొసఁగె
తరళితరత్న మ్మొకండు.

ఆవిరిసిన యలరు కమ్మ
తావుల నెగఁజిమ్ము వనిని...
ఆతరళితరత్నము ధర
నలరించును కాంతు లీని...

నేఁ డహో! కుటీరమందు
నిర్మలరోచిస్సు లెగసె!
నేఁ డహో! ప్రభాతవీథి
నిండెను కల్యాణరవము!

---

# తప్పెవరిది?

వార్తకవి కృష్ణమూర్తి

వడ్లమిషను చక్ చక్‌మంటూ పని చేస్తూంది. దానికంటే చురుగ్గా పని చేస్తూంటాడు వీరయ్య. దం, దం అంటూ మిషను వడ్లను త్వరత్వరగా దంచేస్తూంటే, క్రింద పడే తవుడు చప్పచప్పన తోడేస్తూంటాడు వీరయ్య. వాడి దేహమంతా రోజూ తవుడుమయమే. రోజున కెంత తవుడు ముక్కులగుండా దూరి వాని ఊపిరితిత్తుల కెడుతూందో, కొలచి చూచినవారు లేరు. ఎంత తవుడు చెవుల దూరి లోపల పెంట కుప్పగ ప్రోగవుతూందో గమనించినవారు లేరు. ఎంతతవుడు నోటిగుండా వెళ్లి కడుపులో చేరుతూందో లెక్కించినవారు లేరు. ఎంత తవుడు కన్నుల జేరి దృష్టిని తగ్గిస్తూందో తెలిసికొనగోరినవారు లేరు. వీటితో తన జీవితకాలము సగానికి సగం తగ్గిపోవుచున్న దని వీరయ్యకుమాత్రమే తెలియును. తెలిసి మాత్ర మేమి చేయగలడు? వాని బ్రతుకు తెరు వది. వాని యారోగ్యవిషయమై మిల్లు యజమాని కేమి గావలయును? తన మిల్లు చక్కగా పనిజేస్తూ లాభం సంపాదించడమే అతనికి కావలసినది. తన పని నిమిత్తమై కూలీల ప్రాణాలైనా లాగ సంసిద్ధుడే.

అసలు ఆ మిల్లు యజమానిని చూస్తే చాలు, కూలీ లందరు హడలిపోతూంటారు. అతని కాళ్ల చప్పుడు వింటే చాలు, గడగడ మంటూ అదరిపడుతూంటారు. యజమాని తాను చేతిలో కర్ర పూని, టక్‌టక్‌మంటూ వస్తూంటే వారిపాలిటి యముడని తోపకేసే వాడు. వాడికన్నా వానికఱ్ఱ కెక్కువ ఘనత. కూలీల బుర్రలపై నాట్యం చేస్తూ విఱ్ఱవీగు తూంటుంది. దాని చివర గల మేకు మావటి వాని అంకుశపు మొనలాంటిది. ఏనుగును పొడిచేలాగు, అది కూలీల దేహాల గ్రుచ్చి గాయపఱచి రక్త మెంతో త్రాగుతూండేది.

పాప మా కూలీలకర్మం అలాగుంది. వారిజీవనపథ మది. ఆ అంకుశముపోటుతో వా రొక్కొక్కప్పుడు ఆ పని మానివేసి అడు క్కొని బ్రతుకుదా మనుకొంటారు. కానీ, అడుక్కొని బ్రతకడం అంతకన్నా దుర్భర మని వారికిగూడా తెలియును. 'దేహీ' యని తిరిగే వారి కన్నుల జూస్తే వా రెన్ని వక్కప్రొద్దులు జేశారో బోధపడుతుంది. "అమ్మా! కబళ" మంటూ ఒకయింటి నుండి మరో ఇంటికి పరుగిడేవారి కడు పులు గంటే చాలు. వా రెన్ని ఏకా దశులు చేశారో తెలుస్తుంది. "అన్నమో రామచంద్రా" యను ఆర్తధ్వనులు వింటే చాలు; ఎంతమంది ఆకలి కేకలతో అరచి అర్భటించి ఆయువు గోల్పోవుచున్నారో బోధపడుతుంది. ఇలాంటి పరిస్థితులలో, యజమాని అంకుశముపోట్లకు సహిస్తూ తమదే భాగ్య మనుకుంటారు, పాప మా నిర్భాగ్యులు. ఇంతకూ తమ కిచ్చే కూలి రోజుకి పావలా. తాను తన కుటుంబమూ ఆ పావలా తిండిపై ఆధారపడాలి. ఆ తిండి

చాలక, లోని కంటుకపోయిన కడుపులతో, ఎముకలు లెక్కపెట్టగలిగిన తనువులతో, 'ఆకలో ఆక' లంటూ అల్లాడుతూన్న బిడ్డలతో, కాలక్షేపము చేస్తూంటా రా కూలీలు. ఆ పావలా తిండైనా చాలు కుటుంబానికి వినియోగిస్తే. కాని ఆపావలాతో తప్ప త్రాగి, తైతక్కలాడుతూ సంసారాన్ని అల్లకల్లోలము చేయుట కద్దు. వారిని చూస్తే లోకుల కెగతాళి — ధనికుల కసహ్యము — విద్యావంతుల కేవగింత. పైగా వారి కందులకు శిక్ష. ఎంత అన్యాయం? వారి కష్టానికి తగిన కూలియ్యమని మిల్లు యజమానినెందులకు శిక్షించరాదు? ఇలాగ జరిగేదెన్నో? ఈ విషమసమస్యల చిక్కు విడదీయ బూనుకొను పుణ్యాత్ము లెవరు?

మొత్తానికి వీరయ్య అదృష్టవంతుడే. తన చురుకుదనము, పనిపైగల శ్రద్ధ, ఓర్పు, పట్టుదల, అభిమానము, మిల్లు యజమానినెంతో మెప్పించాయి. యజమానికి వీరయ్యంటే ఎంతో ప్రేమ. కాని తన ప్రేమను వాని కిచ్చే జీతముపై జూపినవాడు గాడు. పనిచేయకుండా సోమరులై మాట్లాడేకూలీలనప్పుడప్పుడు చెవిపట్టుకొని ఈడ్చుకొనివచ్చి చెమటలు పోస్తూ ఏకదృష్టితో తవుడును గబగబ తోడేస్తున్న వీరయ్యకు చూపెట్టి, "ఇదిగో వీరయ్యా! వీనికి కాస్త బుద్ధి చెప్పు" అనేవాడు. వీరయ్య ఉబ్బిపోతూ, "దండం బాబూ! మన్నించం" డంటూ సంతోషంతో మరింత తెక్కువగా కష్టపడి పనిచేసేవాడు. కాలు నొచ్చినా, కడుపు నొచ్చినా పని కెన్నడును ప్రాలుమాలినవాడు కాడు.

కొన్నిరోజులు గడిచాయి. ఒకరోజు వీరయ్య తలనొప్పి జ్వరంతో బాధపడుతున్నాడు. "ఈవేళ పోవద్దు మామా" అని ఎంత బ్రతిమాలినా పెళ్లాంమాట వినకుండా, ఎప్పటివలె పనికెళ్లాడు సద్దిబువ్వకూడా తినకుండా. పాపం! ముక్కుతూ మూల్గుతూ శక్తి లేకున్నా, బలవంతాన తవుడు తోడేస్తున్నాడు. కాని బాధ ఎక్కువయింది. ఇంక పని చేయలేకపోయాడు. ఇంతలో యజమాని అక్కడకు రాగా, "బాబయ్యా! ఈవేళ మన్నించండి. తలనొప్పి, జ్వరంతో బాధపడుతున్నా. ఏలినవా రీవేళ సెలవియ్యా" లన్నాడు. యజమానికి వానిపై జాలి పుట్టింది. కాని వాని ప్రాణానికన్న తన మిల్లు పనే ముఖ్యమనుకొన్నాడు. వీరయ్య లేకపోతే, అపని ఒక్క నిమిషమైనా జరుగదని అతనికి తెలుసు. "వీరయ్యా! ఈవేళ కాస్త పని చేయి. రేపు సెలవిస్తా నన్నాడు యజమాని. వీరయ్య గుండెలు నీరయ్యాయి. తా నెంత కష్టపడి పనిచేసినా ఆమాత్రమైనా తనపై కరుణించనందుకు యజమానిపై విసుగుకొన్నాడు. వీరయ్య ఆ మిల్లు ఒక నరకంగా తోచింది. ఆయంత్రము ఒకమారణయంత్ర మనుకొన్నాడు. ఆ యజమాని ఒక దండధరుడులాగ అగపడ్డాడు. కాని తా నేమి చేయగలడు? బదులు మాట్లాడినచో గోరుచుట్టుపై రోకటిపో టన్నట్టు తన రోగస్థితిలో పని మాన్పించునేమో యను భీతి. చేయునది లేక ఒకమాటు యజమానివంక దీనదృష్టుల బఱపాడు. యజమాని వాటిని గమనించకుండా వెళ్లిపోయాడు. వెంటనే తల దించుకొని, వీరయ్య పనిజేయడాని కుద్యమించాడు. ఎంత ప్రయత్నించినా, చేతులకు చురుకుదనము కలిగింది గాదు. 'ఉస్సు' మంటూ పైకి లేచి, గిఱ్ఱుమంటూ తిరుగు

తూన్న యంత్ర చక్రాన్ని చూశాడు. మిల్లంతయు గిర్రుమని తిరిగినట్టయింది. తాను కూడా గిర్రుమని తిరిగినట్లు తోచింది. వెంటనే మనస్సు గిర్రుమని తిరిగింది. ఇంక ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు. మాట్లాడకుండా మరలి పోయాడు పెల్లాము. గౌరమ్మ ఆతురతతో వచ్చి, విసరుతూ కూర్చుంది. కాస్సేపు తర్వాత, "మామా, కాస్త అంబలి తాగుతావా" అంది. వద్దంటూ వీరయ్య తల ఊపేడు. మాట్లాడడానికి అతని నోట తడి లేదు. నీళ్లు కావాలని సైగచేశాడు. గౌరమ్మ నీళ్లు తెచ్చిఇవ్వగా, త్రాగి కొంచెం తెప్పరిల్లి నెమ్మదిగా ఉండంటూ నిదురించాడు. ఆ తర్వాత గౌరమ్మ చంటి పిల్ల లిద్దరికి అన్నం పెట్టి, నిదురింపజేసి, తాను భర్తప్రక్కన కూర్చొని, కను మూయకుండా మొగుడి కుపచారం చేసింది.

ఒక నెలరోజులవరకు వీరయ్య జ్వరంతో బాధపడ్డాడు. ఆతర్వాత క్రమేణ నయమయ్యింది. చాలా సన్నగిలిపోయాడు. కళ్లు గుంతలు పడ్డాయి. ఎముకలు వేరేసినట్లు కనుపిస్తున్నాయి. తన జీతంలో అప్పుడప్పుడు మిగిలించిన డబ్బుతో ఖాయిలా దినము లెట్లో గడపగలిగాడు. అప్పటికప్పుడే రెండు నెలలు గతించాయి. ఇకనైనా పనిలో ప్రవేశిద్దామని మిల్లు యజమానివద్ద కెళ్లి, దణ్ణంపెట్టి "బాబయ్యా! ఖాయిలా బాగయింది. ఏలినవారు పనిప్పించారంటే జాగ్రత్తగా పనిజేసికొంటా" నన్నాడు. కోపం గనబరస్తూ, యజమాని "వెళ్లవోయి. ని న్నెప్పుడో పనినుండీ తొలగించాను. ఆవేళ పనిజేసేటట్టు నటించి, చెప్పకుండా ఉడాయించావు గావు? ఇప్పుడు నీకు పని కావాలి? సిగ్గు లేదూ? వెళ్లు వెళ్లు" అని గద్దించాడు. వీరయ్యా తన కథ అంతా చెప్పుకొని 'మన్నించా' లంటూ బతిమాలాడు. "బాబయ్యా! బీదవాణ్ణి మీబిడ్డను. మన్నించండి బాబూ! మన్నించండి. దిక్కులే" దంటూ అతనిపాదాలు పట్టుకొన్నాడు. యజమాని కాళ్లు విదలిస్తూ "వెడతావా, లేక జవానుతో గెంటించనా" అంటూ కసరేశాడు. లాభం లేదని గ్రహించి, కడసారి దణ్ణంపెట్టి, కన్నీళ్లు గారుస్తూ వీరయ్య ఇంటికి మరలి పోయాడు.

జరిగిన కథను వీరయ్య గౌరమ్మకు వినిపించాడు. గౌరమ్మ ఎంతో మెత్తని మనస్సు గలది. మొగుడంటే ఎంతో ప్రేమ. కలిగిన దుస్థితికి వగచి "పోనీ లే మామా! అప్పాసు మానేద్దాం. మనకూ మిల్లుకూ ఋణానుబంధం లేదు. దానిగ్గా మనస్సు నొచ్చుకోవద్దు. మన మిద్దరము కలసి కూలినాలి చేసికొని బతుకుదాం. అంతవరకూ మా నా న్నిచ్చిన ఈ రెండు ఎండికడియా లమ్మి తిందాం" అంది ఆ ఇల్లాలి చల్లనిమాట లతని దుఃఖాన్ని బాపి మనసులోనియాందోళన ముడిపి ఎంతో ఆనందం కలిగించాయి.

రెండురోజులు గడిచాయి. అకస్మాత్తుగా ఒకరోజు బట్ట లుతుకబోయి, కాలుజారి నూతిలో బడి అసువుల బాసింది గౌరమ్మ. వీరయ్య దుఃఖానికి మేరలేదు. కష్టాలకు మితిలేదు. తల్లిని బాసిన పిల్లలిద్దరిని పెంచే భారం వీరయ్య మీద పడింది. కష్టాలపై కష్టాలు వచ్చిపడ్డాయి. తగిలిన కాలికే తగలడం సహజం. పిల్లలు "అమ్మా, అమ్మా" అంటూ ఏడుస్తున్నారు. పాపము వీరయ్య తనస్థితికి చాలా చింతించాడు. చేయునది లేక ఎట్టకే

లకు ధైర్యము తెచ్చుకొని పని సంపాదించు కొనడానికి బయలుదేరి పొయ్యాడు. ఎందరినో ఆశ్రయించాడు. తమ కవసరము లేనిదే ఎవరుమాత్ర మతనికి పనివ్వగలరు? ఎక్కడగాని పని దొరికింది గాదు. ఇద్దరు బిడ్డలూ తాను తిండి లేక ఎలాగో ఒక దినము గడిపారు. రెండోరోజు పిల్లలగోడు చూడలేకపోయాడు. బిడ్డల బుజ్జగించి, నీళ్లు త్రాపి అడుక్కొనైనా తిందా మని బిడ్డలతో బయలుదేరాడు.

మధ్యాహ్నం పండ్రెండుగంటలయింది. పాపం ఎండలో నడువలేక బిడ్డలు "అమ్మా అమ్మా" అంటూ ఆకలితో ఏడుస్తున్నారు. వాళ్ల నిరుచంకల మోసికొని ఒక ఇంటి ముందట నిలబడ్డాడు. అంతవరకు అడుక్కు తినడం అలవాటు లేనందున ముం దేమనడానకు తోచింది గాదు. "తల్లీ బిచ్చ!" మంటూ అరిచాడు. ఆయింటియిూవిడ "ఇప్పుడే భోజనా లయినవి. ఏమీ మిగలలేదు పో" మ్మంది. తొల్తనే పరాభవ మైనందుకు చింతిల్లి రెండో ఇంటిముందట నిలబడి "తలిదండ్రులారా! ఈ బీదవాణ్ణి కరుణించండి" అన్నాడు. ఎవరూ పల్కనందున రెండో మాటు మరింత బిగ్గరగా అడిగాడు. కజ్జితోటి ఒక జవాను బయటికి వచ్చి "బుద్ధిలేని మనిషి! అలా కేకలేస్తా వేమిటి? తహశీల్దారుగారు నిదురిస్తున్నారు. జాగ్రత్త! తిన్నగా వెళ్లిపో" అన్నాడు. వెంటనే మూడవ యింటికి పోయి, "బిడ్డల గన్న తల్లుల్లారా! ఈ దిక్కులేని పక్షులకు కాస్త బువ్వ వేయండి" అని అతిదీనంగా అడిగాడు. ఆ గృహిణి, "అబ్బా! మీపోరు పోరుగాదు. కాస్త కన్ను మూశానో లేదో అప్పుడే మీ యవాంతరం" అంటూ కసరుతూ వచ్చి, "ఇప్పుడు భిక్ష మేమిత్రా యబ్బీ! రెండు గంటలు దాటింది వెళ్లు" మన్నది. ఇలాగే ఇంటినుండి ఇంటికి వెళ్లాడు. ప్రయోజనం లేకపోయింది. ఏమి ఖర్మమోగాని, యే యమ్మగాని పట్టుమని పిడికె డన్నం వేసిన పుణ్యాన బోలేదు. ఆకలి గొని బిలబిల తన్నుకుంటూ ఏడుస్తున్నారు బిడ్డలు. దిక్కు లేని బిడ్డలకేసి చూస్తూ చేయునదిలేక, దిక్కుతోచమి, దీనంగా నిలబడ్డా డక్కడ. రెండు పుల్లాకులు కనిపించాయి. కానీ, ఒక్క మెతుకైనా లేకుండా వాటిని కుక్కలూ కాకులూ శుభ్రంగా నాకేశాయి. 'దిక్కుమాలిన దేవుడీ మాత్రమైనా పుణ్యం గట్టుకొనలేదే' యని నిందించాడు. "అమ్మా" అంటూ బిడ్డల పోరు మరింత ఎక్కువయింది. 'అమ్మ' మాట పదేపదే చెవులబడగా గౌరి స్మృతికి వచ్చింది వీరయ్యకు. అప్పటికి గౌరి గతించి ఒకపక్షమయింది. గౌరి క్రొత్తగా కాపురానికి వచ్చినపుడు దాని సిగ్గుమాటలకు మురుస్తూ, సరసంగా "ఎంత చక్కని చుక్కవే గౌరీ! నీ వెంత వలపులరాణివే నారీ!" యని తాను పాడిన పదమూ, తన ప్రేమ క్రీడావినోదాలూ జ్ఞప్తికి వచ్చినాయి. తాను రోజంతా పనిచేసి ఇంటికి వచ్చేసరికి, కాళ్లకు నీ ళ్లిచ్చి, కంచం ముందరెట్టి, ఉడుకుడు కన్నం వడ్డించి తాను తింటూంటే, ఎదుట నిలబడి, "నిదానంగా మరోకడి మింగు మామా!" అంటూండే గౌరి అతని దృష్టిపథాన ప్రత్యక్ష మయింది. తాను జ్వరంతో సెయ్య కంటినపుడు, పైటకొంగుతో విసరుతూ, నిద్రాహారాలు మాని తన్ను కనిపెట్టుకొని కూర్చున్న గౌరి ఎదుట గోచ

రించింది. తాను పనిపోయినపుడు, ఇంటికి మరలిరాగా, "పోనీలే మామా! ఆ వ్రాసు మానేద్దాం. మా నాన్నిచ్చిన వెండి కడియా లమ్మి తిందా" మన్న వాక్కులు అతని తలపునకు వచ్చాయి. వీరయ్య నిశ్చేష్టుడై కొంతసే పట్టే నిలబడ్డాడు. గోడు గోడున కుందుచుండు బిడ్డలవంక ఒకసారి చూశాడు. కన్నీరు గార్చాడు. వెంటనే తనకష్టాలకు కారణభూతుడైన మిల్లుయజమాని తలపునకు వచ్చాడు. అతనిని మెప్పించదలచి తా నెంతకష్టపడ్డదీ, దాని పరిణామమూ యోజించాడు. మన్నించమంటూ తాను కాళ్లపై బడినందుకు పరిహారంగా "వెడతావా? జవానుచేత గెంటించనా?" యన్న మాటలు చెవులలో బిగ్గరగా వినబడినట్లయ్యాయి. వెంటనే అతనిహృదయం ఘనీభవించింది. నేత్రములు కోపారుణితములై నిప్పులు గ్రక్కుతున్నాయి. మనస్సు మారింది. మానవత్వం పోయి రాక్షసత్వం అతని నావహించింది. ఉబికుబికి వచ్చెడి ఆగ్రహాన్ని నిగ్రహించుకోలేకపోయాడు. ఎదుట ప్రపంచాన్ని మరచిపోయాడు. బిడ్డల అరపు లేమాత్రం అతని చెవినిబడడం లేదు. అతని కన్నుల ఎదుట గోచరించింది ఒకటే-యజమాని ఒకడే. పళ్లు బిగించి లేచి, తెరచుకొన్న కన్నులతో, తదితరములు చూడక, చక్కగా బయలుదేరిపోయి మిల్లుయజమాని ఆఫీసు గది చేరాడు. కుర్చీలో కూర్చొని లెక్కలు వ్రాస్తున్న యజమాని వీరయ్యని చూసి వెఱ్ఱికేక వేశాడు. బల్లపై గల కత్తితో వీరయ్య యజమాని నొక్కపోటు పొడిచాడు. అంతటితో యజమాని గాఢనిద్ర చెందాడు. ఎఱ్ఱని రక్తం చివ్వుమని పైకి చిమ్మింది యజమాని కాయంనుంచి. ఆఎరుపు చూచి వీరయ్యకోపం చల్లారింది. మనుష్య ప్రకృతి మరల వీరయ్యని ఆవేశించింది. తాను చేసిన పని అప్పు డాతనికి స్పష్టమయింది. కాని ప్రయోజన మేమి? తాను చేసిన నేరమున కెవరు బాధ్యులు?

తప్పెవరిదో? ఏమైతే నేం, వీరయ్యకథ గూడా అంతటితో సమాప్తి జెందింది.



# ఆలాపనము

పెనుమర్తి కామేశ్వరరావు
(సారస్వతకుటీరం)

రమ్ము ! నా ప్రేమసామ్రాజ్యరాజ్ఞి ! నాదు
విధురజీవితాకాశన వెలిఁగెడిశశి !
రమ్ము ! నీదరహాసలవమ్ముతోడ
అంధతమసహృదంతర మ్ములరఁజేయ.

సప్తసాగరవలితవిశ్వమ్మునందు
కరుణతో, ప్రేమతో సహాకార మొసగి
ఆదరించినవా రొకరైన లేరు !
ఆశమాత్రమె ! కడకు నీయందుగూడ.

జీవితాగాధవాహినీ స్నిగ్ధనీర
మెంతకాలము స్తంభించియుండగలదు ?
పైకెగయకున్నె, నిట్టూర్పువఱదలందు
పాఱి చేరును నైష్ఫల్యవారినిధిని.

జీవిత మ్మెల్ల ప్రేమపరీక్షలోన
క్రుంగిపోయెను ఆశాంతములకు దేవి !
ప్రణయినీకరస్పర్శసుఖానుభూతి
దూరమైపోయె, 'ప్రతిస్వల్పకోరిక'యును !

వత్సరమ్ములనుండి దుర్భరభరమ్ము
ఈకృపణజీవితమ్ము భరించినాను
దీనజనునిపై దయ ప్రసాదించి దేవి
రమ్ము ! నా కిమ్ము నీయధరామృతమ్ము

---

# రాష్ట్రలిపి: లిపి సంస్కరణము

ఎం. నాగేశ్వరరావు

ప్రస్తుత భారతరాజకీయసమస్యల్లో రాష్ట్రభాష, రాష్ట్రలిపి ప్రముఖసమస్యలుగా మారినాయి. స్వాతంత్ర్యసమస్యకన్నా యివే ముందు వస్తున్నాయి. భారతీయనాయకుల్లో కొందరు ......ముఖ్యంగా ముస్లిము నాయకులు ......స్వాతంత్ర్య సమస్యను దూరంగా వుంచి 'రాష్ట్రభాష, రాష్ట్రలిపి'సమస్యల వెనువెంట పడ్డారు. మాలిపి రాష్ట్రలిపి కావాలి, మాలిపి కావాలి అంటూ. ఇది మన సులామినుకోవృత్తి. ఈసందర్భంలో పంజాబుకేసరి లాలా లజపతిరాయిగారి వాక్యాలు జ్ఞాపకంవస్తున్నాయి. "మురికిగుంటలో నీరు కుళ్లి పురుగులు పడి ఏవిధంగా కంపుకొడుతూవుంటుందో అదేవిధంగా పరాధీనజాతి మెదడు ......ఆలోచనశక్తి ......కుళ్లిపోతుంది." నేడు భారతదేశంలో దీన్నే మాస్తున్నాం. అందుకనే రాష్ట్రభాష, రాష్ట్రలిపి వికటసమస్యలుగా మారినాయి. ఏకజాతిగల ఏపాశ్చాత్యదేశంలోనైనా అయితే స్వాతంత్ర్యంకన్న ముందుగా యీసమస్యలు వచ్చేవేగాదు. మామూలుసమస్యలుగా చూడబడేవి. మనదేశంలోనో! వివిధసంప్రదాయాలు, వివిధమతాలు, వివిధజాతులు. స్వాతంత్ర్యం రాకముందే అధికారాల్ని పంచుకోవాలంటారు. నేనుకూడ లిపిసమస్య సంఘర్షణలో ప్రభావిత బాధ్యుడనై ఈవ్యాసాన్ని వ్రాయ సంకల్పించుకొన్నాను.

అభావం ఆవిష్కారజనని. నిజంగా అభావం మానవుని చిరసంగిని. మానవునకు జీవనంలో 'అభావం' తోచినప్పుడే దాన్ని పూర్తిచేయడానికి ప్రయత్నిస్తాడు. దాంతో మానవునిలో అనేకభావాలు వస్తూంటాయి, పోతూంటాయి. నేడు భారతదేశానికికూడ అనేకఅభావా లున్నాయి. వాటిలో 'రాష్ట్రలిపి' అభావం ఒకటి. మరొకటి యుగపోకర్యాల కనుకూలమైనలిపి. ఈ రెండుసమస్యలు చాల వికటంగా వున్నాయి. మనకు (ఆంధ్రులకు) రాష్ట్రలిపితో అవినాభావసంబంధ మున్నది కాబట్టి ఆంధ్రులదృష్టికి 'లిపి'సమస్యను తీసుకరావడానికి సాహసించాను. తెలుగులిపినిగురించి కూడ కొద్దిగా విచారించుట యుక్తమని తోస్తోంది.

దినదినమూ భారతదేశం ప్రగతివైపుకు — స్వాతంత్ర్య వేదికవైపుకు — నడుస్తోంది. కాని మనస్వాతంత్ర్యమార్గాన్ని సాంప్రదాయికత అడ్డుకొంటోంది. మజహబి(మతం) వల్లరాయిబండలు వచ్చి ఢీకొంటున్నాయి. ఈసంఘర్షణలో నిప్పుకణాలు రాలుతున్నాయి. ఆనిప్పుకణాల్ని చూచి మరఘీరంగులకుకూడ వెనుకాడని మన స్వాతంత్ర్యాభిలాష వెనుకకు తగ్గుతూంది. ప్రతివిషయంలోనూ మజహబే(మతమే)- రాష్ట్రీయ పతాకవిషయంలో, వందేమాతరం విషయంలో, మసీదులముందు మేళతాళాల విషయంలో —ఇది అది ఎందుకు, ప్రతివిషయంలోనూ! ఉత్తరభారతదేశంలో రైల్వేప్లాటుఫారంమీద హిందూపానీ, ముస్లిముపానీ; హిందూచాయ్, ముస్లిముచాయ్; హిందూపాన్, ముస్లిముపాన్! ఇది స్వరాజ్యాన్ని పొందలేయ్యే మన దేశపరిస్థితి. ముందు భవిష్యత్తులో ప్రాణిమాత్రికి కావలసిన ప్రాణవాయువు కూడ హిందూ ముస్లిముసంప్రదాయాల ననుసరించి భేదిస్తుందేమో? ఈసాంప్రదాయిక సంఘర్షణలో బ్రిటిషు ప్రభుత్వం పూర్తిగా లాభం పొందుతూవస్తూంది.

ముస్లిము సోదరులు భావిప్రాప్యఫలాన్ని ముందుగానే పంచుకోవడానికి వస్తారు. మజహబు(మతము)ను ముందు పెట్టుకొని 'అల్పసంఖ్యాకులరక్షణ'కు వాగ్దానమివ్వమంటారు. వాగ్దానం యిచ్చినా విశ్వసించరు. కాని కాంగ్రెసులో హిందువులు హెచ్చుగా వున్నారుకాబట్టి కాంగ్రెసు 'హిందువులసంస్థ' అని రట్టుచేస్తారు. ఈవిషయంలో పక్షపాతంలేకుండా విచారించి చూస్తే మహమ్మదీయులలో సాంప్రదాయిక మూఢత్వం ఎక్కువగా వుంది. హిందువులలోను సాంప్రదాయికమూఢత్వం లేక

పోలేదు. కాని ముస్లిముసోదరులలోకన్న తక్కువ. ప్రాకృతికంగా హిందూధర్మం చాలా వుదారమైంది. ప్రతి మానవునకు హిందూధర్మంలో విచారస్వాతంత్ర్యముంది. ఆదినుంచి హిందూధార్మిక ఇతిహాసాన్ని పరిశీలిస్తే ఇది స్పష్టమవుతుంది. యుగానుసారంగా హిందువుల ఆచారవిచారాలు చాలవరకు మారుతున్నాయి. ధార్మికదృష్టి తగ్గుతోంది. ముసల్మానుల్లో? వారు అల్పసంఖ్యాకుల రక్షణపేరుతో నిత్యప్రతి కట్టరవాదులై పోతున్నారు. హిందూపానీ, ముస్లిముపానీ అన్నట్లు వారు ప్రతివిషయాన్ని మజహాబు(మతము)కు అంటగడుతున్నారు.

రాష్ట్రభాషకు పట్టినగతి రాష్ట్రలిపికికూడ పట్టింది. నాగరిలిపితోబాటు ఉర్దూ(పారసీ)లిపికూడ రాష్ట్రలిపి కావాలి నాగరిలిపి హిందువులది, ఉర్దూలిపి ముసల్మానులది. హిందూ(నాగరి)లిపిని రాష్ట్రలిపిగా చేస్తే ముసల్మానులిపి ప్రోత్సాహం లేక లుప్తమైపోతుందని మహమ్మదీయులభయం. వీరికి లిపి లుప్తమవుతుందనే భయంకన్న మజహాబే ముఖ్యం.

లిపిని మజహాబుకి అంటగట్టి ఇది మాది, అది మీది అనడం చాల అన్యాయం. ప్రాంతీయలిపుల్లాగ ఉర్దూలిపికి పంజాబు, సంయుక్త మొదలప్ర—ముసల్మానులు ఎక్కువగావున్న ప్రాంతాలలో స్థానం వుండనేవుంది. పంజాబులో హిందువు లందరూ ఉర్దూలిపినే వుపయోగిస్తున్నారు. ఆర్యసామాజికుల ధార్మికపత్రికలుకూడ ఉర్దూలిపిలో వెలువడుతున్నాయి. సంయుక్తప్రాంతంలో తరచుగా హిందువులు ఉర్దూలిపినే వాడుతున్నారు. కాయస్థకుటుంబాలవారు ఉర్దూభాషను ఎంతో ప్రేమతో చదువుతున్నారు. ఉర్దూసాహిత్యోన్నతిలో హిందువు లెందరో పాటుపడ్డారు. స్వర్గీయ ప్రేమచందు ఉర్దూలో ప్రసిద్ధరచయిత. ఇటువంటివా రెంతమందో వున్నారు.

ఇక్కడ వచ్చినతిగాదా అసలువైజ్ఞానిక(Scientific), అవైజ్ఞానికతల విషయంలో. ఉర్దూవర్ణమాల అసంపూర్ణమైనది. ప్రతి ధ్వనికి కావలసిన 'వర్ణము' లేదు. కొన్నివర్ణాలు కలిస్తేనేగాని ఒక'ధ్వని' పలుకదు. నాగరివర్ణమాలలో ప్రతి'ఉచ్చారణ'కు ఒకఅక్షరము— సంగ్త— వుంది. నాగరిలిపి నేర్చుకొన్నతరువాత దానిలో వ్రాసినవాక్యాలు సునాయాసంగా చదువగలము. ఈసౌకర్యం ఉర్దూలిపిలో లేదు. అలిఫ్, కాఫ్, లామ్ మొదలగు అక్షరాల్ని నేర్చుకొన్నతరువాత కొంతకాలంవరకు ఉర్దూ చదువలేము. ఉర్దూలిపి అసంపూర్ణమైంది కూడాను. వ్రాయడంలో ఒక'బిందువు' మరచిపోతే పెడర్థం వస్తుంది: 'సేక్ జీ అజమేర్ గయా' అన్నదానికి 'సేఠ్ జీ ఆజ్ మర్ గయా' అని అర్థం వస్తుంది.

దేవనాగరివర్ణమాల పూర్ణమైంది. "ప్రత్యేక ఉచ్చారణకు — ధ్వనికి చిన్ని చిన్ని ఖండాలుగా విభక్తమయింది. ఈఖండాలను మరల ఖండాలుగా చేయలేము. ఈధ్వనిఖండాలు స్వర, వ్యంజనాలుగా వేరు వేరుగా విభక్తములై అవి మరల స్వాభావికంగాను, వైజ్ఞానిక (Scientific) రీతిని క్రమపూర్ణమైన వర్ణాలుగా నియమితము లయినాయి ఒకధ్వనికి ఒకేచిహ్నము, ఒక చిహ్నానికి ఒకేసుర్తు వుంది. మరోదేశంలో ఇటువంటి పూర్ణవర్ణమాల లేదు. ఎంత పరిశ్రమచేసి సూక్ష్మబుద్ధితో మనపూర్వులు 'వర్ణమాల'ను సృష్టించారో!"

లిపి వేరైనప్పటికి సంపూర్ణ భారతదేశంలో (ఉర్దూ, తమిళములకుగాక), నాగరివర్ణమాలే వుపయోగింపబడుతున్నది. రెండున్నరవేల ఏండ్లకుపూర్వం నాగరిలిపి పూర్వరూపమను 'బ్రాహ్మి'లిపిని భారతదేశమంతటా వాడుతుండేవారు. ఈ 'బ్రాహ్మి'లిపి కాలక్రమేణ ఆ చేతుల్లో ఆచేతుల్లో పడి వర్తమాన నాగరిలిపిగా మారింది. ఒక్క నాగరిలిపిగానే గాదు, వర్తమాన భారతీయలిపులన్నీ (ఉర్దూమినహా) — దక్షిణభారతలిపులు కూడ — బ్రాహ్మిలిపినుండి పుట్టినాయి. కొద్దిలో బ్రాహ్మిలిపి చరిత్ర యిది.

జనగణనదృష్టితో చూచినా దేవనాగరిలిపి స్థానం ముందుకు వస్తుంది సేతుహిమాచలపర్యంతం దేవనాగరిలిపి తెలిసినవా రున్నారు. దక్షిణాన — ముఖ్యంగా ఆంధ్రదేశంలోకూడ ప్రతిపల్లెటూరిలో నాగరిలిపి తెలిసినవా రున్నారు. సంస్కృతసాహిత్యంతోబాటు 'దేవనాగరి'ప్రచారం ప్రపంచమంతటా (విద్వాంసులలో) వ్యాపించింది. ఉత్తరభారతంలో చెప్పనవసరం లేదు.

మహారాష్ట్రీ, హిందీభాషలు 'నాగరి'లిపిలోనే వ్రాయబడుతున్నాయి. గుజరాతిలిపి శిరోరేఖ తీసివేసిన నాగరి లిపిమాత్రమే. 'కైథీ, మహాజని' లిపులు నాగరిలిపిరూపాంతరాలు. వంగ, ఓఢ్రలిపులు నాగరిలిపినుండి పుట్టినాయి. ఓఢ్రలిపిమీద దక్షిణలిపుల — ముఖ్యంగా తెలుగులిపి ప్రభావం పడినందువలన వృత్తా(గుండ్రని)కారం వచ్చింది. అస్సామీ భాష వంగలిపిలోనే వ్రాయబడుతోంది.

ఇప్పుడు సవాలు రాష్ట్రలిపి ఏది కావాలి? పూర్వం నాగరిలిపి సర్వసమ్మతంగా స్వీకరించబడింది. కాని ముస్లిముభాయీలు ఉర్దూలిపిప్రశ్నను తీసుకొచ్చినప్పుడు గాంధీజీ మెత్తబడ్డాడు నాగరి, ఉర్దూ రెండు లిపుల్లో రాష్ట్రభాషను వ్రాయొచ్చునన్నారు. ఇదెక్కడి అన్యాయం? ముస్లిముసోదరులు కాదన్నదానికల్లా నీళ్లు వదులుకోవలసిందేనా? హిందీతో బాటు ఉర్దూకూడ రాష్ట్రభాష కావాలి, లేకపోతే మా భాష నాశన మైపోతుందనేటప్పటికి, హిందీని హిందుస్థానీగా మార్చారు. ఇప్పుడు ఉర్దూలిపికూడ రాష్ట్రలిపి కావాలనేటప్పటికి నాగరి, ఉర్దూలిపుల్లో రాష్ట్రభాషను వ్రాయొచ్చునన్నారు. మనం (ఆంధ్రులం)కూడ తెలుగు లిపిని రాష్ట్రలిపిగా చేయాలంటేనో? బంగాళీలు తమ లిపిని రాష్ట్రలిపిగా చేయాలని కోరుతూనేవున్నారు. అయితే రాష్ట్రలిపిగతి ఏం కావాలి?

అల్పసంఖ్యాకులరక్షణ అత్యంతావశ్యకమని ప్రతి సభ్యదేశీయుడు ఒప్పుకుంటాడు. భారతదేశంలో అల్ప సంఖ్యాకులను ముసల్మానుల హక్కుల్ని రక్షించాలి. కాదనే దెవరు? కాంగ్రెసు అనేకమార్లు వాగ్దానమిచ్చింది కాని మహమ్మదీయసోదరులికి విశ్వాస ముంటేగా? వందలఏండ్లనుండి హిందూదేశంలో వుంటూన్నప్పటికీ హిందువులను విశ్వసించరు. ప్రాంతీయలిపులకున్న రక్షణ ఉర్దూలిపికి కూడ వుంది. ఇప్పుడు రోమనులిపి కున్న స్థానం నాగరిలిపికి దొరుకుతుంది. దీనివల్ల ఉర్దూలిపికి నష్టమేముంది? నాగరిలిపివల్ల ప్రాంతీయలిపులు నష్టమైపోవునా? ప్రస్తుతం రోమనులిపివల్ల ప్రాంతీయలిపులు గాని, ఉర్దూలిపిగాని నష్టమైపోవుతున్నవా? సాంప్రదాయికబురకా వేసి సంపూర్ణభారతదేశంమీద ఉర్దూ లిపిని అంటగట్టడం అన్యాయం గాదుమరి?

యుగసౌకర్యాలదృష్టితో చూస్తే ఉర్దూ నాగరి లిపులు రెండూ మనఅభావాన్ని పూర్తిచేయలేకున్నాయి. కాని పీటితగాదా దినదినం వృద్ధిపొందుతూనేవుంది. "పిట్ట పిట్టపోరు పిల్లి దీర్చ"అన్నట్టు పీటితగాదాను తీర్చటానికి రోమనులిపి వస్తూంది. రోమనులిపిని రాష్ట్రలిపిగా చేయాలని కొందరు ప్రముఖభారతీయుల మనసుల్లో నాటుకపోయింది. ప్రథమం జవహరులాలు ఈసమస్యను తీసుకొచ్చాడు. కాని తరువాత వారిఅభిప్రాయం మారినట్టు కనిపిస్తుంది. ధురంధరపండితులగు సునీతికుమార ఛటర్జీకూడ రోమనులిపిపక్షాన వున్నారు. గతహరిపుర కాంగ్రెసువేదికనుండి "ప్రపంచంలోని యితర రాజ్యాలతో సరిసమానంగా వ్యవహరింపగలుగుటకు తగినలిపిని మనం అవలంబించుట ప్రశస్తమైనపద్ధతి అని నాఅభిమతం" అని రాష్ట్రపతి సుభాసుబాబు రోమనులిపి పక్షంలో తనఅభిమతాన్ని వెల్లడించారు. వీరిమాటల్లో ఏమీ గంభీరమహత్వం లేదుగాని, వీరు ఎక్కిన "వేదిక" మహత్వంవల్ల సంపూర్ణభారతదేశంలో — ముఖ్యంగా హిందీప్రాంతంలో — గొప్పఅలజడి కలిగింది. ఇంకను యీఅలజడి చల్లారలేదు.

"రోమనులిపి టైపురైటరు, లినోటైపు మొదలగు యుగసౌకర్యాలకు వుపయుక్తంగా వుంది. అంతర్ రాష్ట్రీయలిపిగాకూడ స్వీకరించబడింది. రోమనులిపిని మనం రాష్ట్రలిపిగా స్వీకరించినందువల్ల చాలలాభాలు కలుగుతాయి. అంతర్ రాష్ట్రీయ సాంస్కృతిక ఐక్యాన్ని త్వరగా పొందవచ్చును. నాగరి ఉర్దూలిపుల తగాదా కూడ తీరిపోతుంది" అని రోమనులిపిపక్షీయుల వాదన. భారతదేశంలో నూటికి ౯౦మంది నిరక్షరాస్యులు. వీరికి ఏలిపిలో శిక్షాప్రచారం చేసినా ఒకటే. కాబట్టి రోమను లిపిలో వీరికి శిక్షయిస్తే అన్యదేశాలవారితో త్వరగా పరిచితులవుతారు" అనికూడ వీరు వాదిస్తున్నారు. కాని ఇది వారికూరదృష్టి లేమిని తెలుపుతుంది. కొంచెం గంభీరంగా ఆలోచిస్తే యివన్నీ నిరర్థకవాదాలని తెలుస్తుంది.

లిపి భావమాధ్యమరూపం. లిపిబద్ధ మైనపుడే భాష స్థిరత్వాన్ని పొందుతుంది. భాషద్వారా మానవీయ భావాల మూర్తరూపమును సాహిత్యం బంధింపబడు

తుంది. సాహిత్యానికి జాతిసంస్కృతికి అవినాభావ సంబంధ ముంది. కాబట్టి భాషకు జాతికికూడ ఎడతెగని నికటసంబంధం వుంది. ప్రతిశబ్దంలో జాతివ్యక్తిత్వం వుట్టిపడుతూంటుంది. సాంస్కృతిక భావాల ననుసరించి భాషారూపం ఏర్పడుతుంది. శబ్దసముచ్చయాన్నే 'భాష' అంటాం. శబ్దములను బంధించి నిలిపేది లిపి. లిపిని శబ్దములను వేరుచేయలేము. కాబట్టి భాషదృశ్య రూపాన్నే 'లిపి' అంటాము. లిపినిబద్ధమైనపుడే భాష దృశ్యరూపం వహిస్తుంది. కావున లిపికి భాషకు సంబంధం లేదంటే ఎలా? మన భావాలకు స్థిరరూపం యిస్తూ వచ్చేలిపికి మనకు ఎడతెగనిసంబంధం వుంది. మన పూర్వులు కష్టించి సూక్ష్మాతిసూక్ష్మదృష్టితో ఆవిష్కారంచేసిన నాగరిలిపిని త్యజించగలమా? వర్తమాన యుగ సౌకర్యాల కనుకూలంగా లేకపోతే లేకపోవుగాక; నాగరిలిపి మనపూర్వులసూక్ష్మబుద్ధిని, వైజ్ఞానిక ఆవిష్కారాన్ని చాటుతున్నది. నేడుకూడ దీనికి సరిపోవులిపి ప్రపంచంలో మరొకటి లేదు. (బ్రాహ్మిలిపి ప్రపంచంలో అన్నిటికన్న విజ్ఞానసమ్మత పూర్ణఆవిష్కారము (the most perfect scientific invention which has ever been invented)". మనపూర్వుల గౌరవాన్ని, సర్వోత్తమస్మారకచిహ్నాన్ని కాపాడడానికి నాగరిలిపిని రక్షించాలిసిందేనని నా వ్యక్తిగత అభిప్రాయము. పూర్వుల గౌరవనీయసంపత్తిని త్యజించగలమా? లేము. ముమ్మాటికి త్యజింపలేము, త్యజించలేము. తరతరములలో భారతీయరక్త మున్నవాడు త్యజించడు. దేశప్రేమ నీరసరాష్ట్రీయరాజనీతిలోనే లేదు; భారతదేశంలోని ప్రతివస్తువును అణువణువును ప్రేమించేవాడు కూడ దేశభక్తుడే!

లిపి భావమాధ్యమరూపంగదా అని రోమనులిపిని భారతీయప్రజనెత్తిన రొట్టినందువల్ల చాల అనర్థం కలుగుతుంది. తరతరాలవరకు భారతీయ ఇతిహాసంలో 'నల్లమచ్చ' పడివుంటుంది. మన దాస్యచిహ్నం శాశ్వతంగా వుండిపోతుంది. మనదాస్యపుమూర్తరూపం భావిభారత సంతానంయొక్క నిత్యప్రతికర్మల్లో వస్తూపోతూంటుంది!

గతజూలై నెలలో వార్తలో, నొకవ్యక్తివేసిన లిపిప్రశ్నకు జవాబిస్తూ రాష్ట్రపతి సుభాసుబాబు తన అభిమతాన్ని యీవిధంగా వెల్లడించాడు. "క్రొత్తలిపి (రోమనులిపి) మనభాషకు పనికిరాదనేవారివాదన నిర్మూలమైంది. అది పునాదులులేని గోడలాంటిదే. ఇప్పుడు మనం రాష్ట్రలిపిగా తలంచే 'నాగరిలిపి' మనకు క్రొత్తదేగా? వైదికకాలంనుండి 'నాగరిలిపి' ఎన్నో రూపాలు పొందుతూవచ్చింది." కాని ఇది రాష్ట్రపతి అసారదర్శితను వెల్లడిస్తుంది. రోమనులిపిని రాష్ట్రలిపిగా తీసుకొన్నందువల్ల మనలిపి బాహ్యాకారమే మారదం లేదు, ఆబాహ్యాకారంలో యిమిడివున్న ధ్వనిసమూహము 'వర్ణమాల'కూడ మారుతోంది. "క, ఖ, గ, ఘ"లకు బదులుగా "A, B, C, D"లు వస్తాయి. లిపిబాహ్యాకారం మారినందువల్ల ఎవరికీ ఏమీ యిబ్బందిలేదు.

రోమనులిపి (వర్ణమాల) భారతీయభాషలకు అయోగ్యమైంది. భారతీయభాషాస్వప్రకృతికి రోమనులిపికి (వర్ణమాలకు) సంబంధం కుదురనే కుదురదు. పరిపూర్ణమను భారతీయ(నాగరి)వర్ణమాలస్థానాన్ని రోమనువర్ణమాల పూర్తిచేయలేదు.[1] ఖ, ఘ, ధ, ఝ ఆది మహాప్రాణాక్షరముల్ని 'h'సహాయంవల్ల పలక (వ్రాయ) వచ్చును. కాని త, ద, న ఆదిఅక్షరాల్ని వ్రాయటానికి క్రొత్తగా ఆవిష్కరించేనాలి; లేదా T, D, N అక్షరాలను కొన్నిగుర్తులద్వారా అయినా కనుగొనాలి. రోమనులిపిలో "చ, ఛ"ల శుద్ధఉచ్చారణ రానేరదు. 'శ, స'ల భేదానికికూడ 'గుర్తు' వుంచాలిసివస్తుంది. రోమనులిపిద్వారా హ్రస్వ దీర్ఘాక్షరాల్ని కనుగొనడం చాలకష్టం. Ka-'క' లేక 'కా' అని సందేహం కలుగుతుంది. ఈదీర్ఘస్వరానికి 'Kā అడ్డగీటు అక్షరంపైన పెడుతున్నారు. కాని ఈగుర్తులవల్ల రోమనులిపిలోవున్న సులభసౌకర్యం కొంత పోతుంది. పాశ్చాత్యవిద్వాంసులు ప్రాచీనభారతీయ సాహిత్యాన్ని పరిశోధించి, ఆగ్రం

---

1. ఈవర్ణాల్ని నాగరిలిపిలో యివ్వలేదు. నాగరి, తెలుగువర్ణమాల ఒకటేకాబట్టి తెలుగులిపిలోనే యిచ్చాను. ముందు వుదాహరణశబ్దాలనుకూడ తెలుగులిపిలో యిచ్చాను. పాఠకులు నాగరిలిపిగా తెలిసికొందురుగాక.

థాల్ని రోమనులిపిలో ప్రకటించారు. కాని భారతీయ ధ్వనిని ప్రకటించడానికి రోమనులిపికి క్రొత్తగా అనేక గుర్తుల్ని ఆవిష్కారం చేయవలసివచ్చింది. అప్పటికిని రోమనులిపి అసమర్థమైందనే తేలింది. సాధారణవిషయాలకి 'రోమనులిపి' వుపయోగించినా గంభీరవిషయాలకి పనికిరాదు. భాషానుకూలంగా భాష, భాషానుకూలంగా 'లిపి' గంభీరత్వాన్ని పొందుతాయి. సంస్కృతంవంటి క్లిష్టభాషలకు 'రోమనులిపి' అసలే పనికిరాదు. 'సంస్కృతభాషను నాగరిలిపిలోనే వ్రాయొచ్చును' అని రాష్ట్రపతి సుభాస్ బాబు సెలవిస్తున్నాడు. కాని రేపు రాష్ట్రసాహిత్యాన్ని (లిటరేచరు) గంభీరభాషలోనే వ్రాస్తారే? ముసలమ్మలు మాట్లాడేభాషలో గంభీరవిషయాల్ని వ్రాయగలమా? విషయానుకూలంగా భాషకూడ మారుతుందని వ్రాసేవున్నాను. కొన్ని వుదాహరణలు చూడండి:

ప్రయత్నోత్పాదిని= **Prayatnotpadiny;**
ఓష్ఠ్య= **Oshthya;**
ఈర్ష్య= **Irshya**

ఉదాహరణకు యీశబ్దాలు చాలు. రేపు రాష్ట్రభాషలో ఎన్నో గంభీరవిషయాలు వ్రాయాలి. వాటిలో ఇటువంటి శబ్దాలు ఎన్నో వస్తుంటాయి. రోమనులిపి ద్వారా భారతీయభాషల శుద్ధఉచ్చారణ పలుకలేము. రాష్ట్రలిపిగా చేసుకోవడానికి రోమనులిపిలో అనేక మార్పులు తీసుకరావాలి. అప్పటికి భారతీయభాషలకు రోమనులిపి అసంపూర్ణంగా వుంటుంది. దానిద్వారా శుద్ధవుచ్చారణ పలుకలేము.

రోమనులిపిని సంస్కరించి 'రాష్ట్రలిపి' చేసుకొనే బదులు నాగరిలిపినే సంస్కరించుకోగూడదు?

భౌగోళికస్థితినిబట్టి భాష వుచ్చారణ మారుతూంటుంది. భౌగోళిక విభిన్నతకు భారతదేశం పుట్టిల్లు. ఇన్ని భాషలు, ఇన్ని ఉచ్చారణలు గలదేశం మరొకటి లేదు. బంగాలీ ఉచ్చారణ వేరు, హిందూస్థానీ(హిందీమాట్లాడువారి) ఉచ్చారణ వేరు, ఆంధ్రుల ఉచ్చారణ వేరు. ఒకదాని కొకటి కలవనే కలవవు. ఈఉచ్చారణావిభిన్నతను 'రోమనులిపి, పోగొట్టలేదు. ప్రస్తుతం ఆంగ్లభాష రాజభాషగదా! దీనితోబాటు రోమనులిపికూడ వాడబడుతోంది. రోమనులిపి, ఇంగ్లీషుద్వారా భాషాప్రయుక్తరాష్ట్రాల్లో పరస్పరభావవినిమయం జరుగుతోంది. కాని హిందీవార్తాపత్రికలుకూడ చూచే ఆంధ్రులకు రోమనులిపి భారతీయప్రకృతికి పనికిరాదని తెలుస్తోంది. దక్షిణభారతవార్తలు ఇంగ్లీషు, రోమనులిపిద్వారానే హిందీపత్రికలకు అందుతాయని వేరే చెప్పనవసరం లేదు. రోమనులిపి భారతీయనామాల్ని కూడ ప్రకటించలేదు. రాష్ట్రభాషను ఏం ప్రకటిస్తుంది? "పట్టాభిసీతారామయ్య"ను "పట్టభిసీతరమైయా"గా హిందీపత్రికలు వ్రాస్తుంటాయి. రోమనులిపి దీనికి కారణం. ఈఉచ్చారణ వివిధత్వాన్ని చాలవరకు నాగరిలిపి పోగొట్టగలదు.

నాగరిలిపి(ఆకారం)ముద్రణ ఆదిసౌకార్యాలకు, త్వరితలేఖనకు అనుకూలంగా లేదని త్యజించడం మూర్ఖత్వం గాక మరేమిటి? ఇంత పరిపూర్ణమైన వర్ణమాలను త్యజించుట మంచిదా? నిజమే, రోమనులిపి త్వరితలేఖనకు, లినోటైపు, టైపురైటరు మొదలనువాటికి సులువుగాను, అనుకూలంగాను వుంది. రోమనులిపి(ఆకారం) త్వరితలేఖనకు అనుకూలంగా నిర్మించబడింది. కలం ఎత్తకుండా వ్రాయొచ్చు. ఈఆకారసృష్టిలో వైజ్ఞానికత్వం వుంది. అస్తు.

"రాజును చూచి మొగుణ్ని మొట్టిం" దన్నట్టు రోమనులిపిని చూచి నాగరిలిపిని త్యజించడం మంచిది కాదు. నాగరిలిపిని సంస్కరించుకోవాలి. భారతీయధ్వనికి అనుకూలంగా నాగరిలిపిని పరిమార్జితం చేయొచ్చు లేదా క్రొత్తలిపి భారతీయోచ్చారణ ధ్వనులకు భిన్నం రాకుండా సృష్టించుకోవచ్చు. ఇది విద్వాంసులపని. ఈవైపు విద్వాంసులు తగుశ్రద్ధ వహించాలి. రోమనులిపిని రాష్ట్రలిపిగా చేసుకొనేదానికన్న "వైజ్ఞానికఆధారంమీద సరళమైన, త్వరితలేఖన కనుకూలమైన లిపిని లినోటైపు మొదలగు సౌకర్యాల కనుకూలంగాను, ఏభాషాధ్వనినైనను వ్రాయడానికి చదువటానికి వీలయ్యేలాగున సృష్టించుట చాలయుక్తం." నాగరిలిపిని త్యజించి రోమనులిపిని 'రాష్ట్రలిపి' చేసుకోవాలనడం భారతీయవిద్వాంసుల అలసత్వాన్ని బోధిస్తుంది.

హిందీవిద్వాంసులు నాగరిలిపిని — రాష్ట్రలిపిని — సంస్కరించటానికి అనేకప్రయత్నాలు చేస్తున్నారు. కాని ఈవైపు హిందీవిద్వాంసులు తగినంత శ్రద్ధ తీసుకోవడం లేదనే చెప్పవచ్చు. నాగరిలిపి సంస్కర్తలలో కాకాకలేల్కరుగారు సర్వప్రథమం వస్తున్నారు; కాని కాకాసాహబ్ లిపిసంస్కరణ యోజన కూడ సంతోషజనకంగా లేదు. వీరు కేవలం 'హిందీ వైపు'దృష్టితో 'లిపిసంస్కరణ' చేస్తున్నట్టు కనిపిస్తుంది.

* * *

భాష అతిపవిత్రస్రవంతి. ఇంత అమూల్యమైన, ప్రభావంగల మరోవస్తువు యీసృష్టిలో లేదు. రెండు భిన్నహృదయాల్ని కలుపగలిగింది భాష ఒక్కటే. భాష హృదయసామ్రాజ్యానికి సమ్రాట్టు. భాషకు జన్మస్థానం హృదయమే. భాష ప్రభావాధికారానికి లోబడేది హృదయమే. ఒకేభాష మాట్లాడువారిలో సోదరభావం జనిస్తుంది. ఈభాషాస్రవంతికి మూర్త— దృశ్య—రూపం యిచ్చే 'లిపి'ప్రభావంకూడ తక్కువగాదు. 'ఏకలిపి'వల్ల జాతిలో 'ఏకీభావం' వృద్ధిపొందుతుంది. విభిన్న భాషీయులు ఒకరి కొకరు దగ్గరగా వస్తారు. ఒకరిభావాల్ని మరొకరు త్వరగా తెలుసుకోనగలుగుతారు. కావున భిన్నభిన్న భాషలు, లిపులు, ప్రకృతులుగల భారతదేశానికి 'ఏకలిపి' అత్యంతావశ్యకము, అనివార్యముకూడాను. ఈ 'ఏకలిపి'స్థానానికి ఒక్క 'దేవనాగరి'లిపిమాత్రమే అర్హురాలు.

శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు గత ఆంధ్ర-దసరాసంచిక(౧౩ అక్టోబరు ౧౯౩౮)లో "టైపు టెలిగ్రాము మున్నగుసౌకర్యములు వున్నవి కాబట్టి రోమనులిపిని ఏకలిపిగా స్వీకరించుట మంచి"దని వ్రాశారు. మన తెలుగుకుకూడ రోమనులిపి పనికివస్తుందన్నారు. కాని వారు గంభీరంగా ఆలోచించినట్టు కన్పించదు. "ఈఉద్యమమును అనవసరచర్చలలోకి దింపక" అని పూర్తిచేసారు. ఇంత ముఖ్యవిషయాన్ని చర్చించకుండా, యోజించకుండా వుండేదెలా? తర్కవితర్కాలు లేకుండా కళ్లు మూసుకుని రోమనులిపిని స్వీకరించవలసిందేనా?

వర్తమాన 'నాగరి'లిపికన్న మన తెలుగులిపి చాల పూర్ణమైంది. నేటి భారతీయలిపుల్లో (ప్రపంచంలో కూడా) యింత పరిపూర్ణమైనలిపి మరొకటి లేదు. వర్తమాన 'నాగరి'లిపిలో ఎ, ఒ [2], ౘ, ౙ, చ, జ, ఱ, ళ అక్షరాలు(ధ్వనులు) లేవు. ఔత్తరేయుల ఉచ్చారణకన్న మన(ఆంధ్రుల) ఉచ్చారణ చాల శుద్ధమైనది. రాష్ట్రభాష[3]కు పనికిరాని, 'రోమను'లిపి మన తెలుగుకు ఎలా వుపయుక్తంగా వుంటుంది?

ఇంగ్లీషు, రోమనులిపి పరుల వని — మనల్ని దాస్యశృంఖలలో బంధించిన ఇంగ్లీషువారివని — ఏవగించుకొనగూడదు నిజమే. ఇంగ్లీషు, రోమనులిపి భావి భారతభాగ్యోన్నతిలో చాల సహాయపడతాయి. వీటి సహాయాన్ని కళ్లకద్దుకొని స్వీకరించాలి మనం. వీటిని తిరస్కరించి మనం భావిఉన్నతిని పొందజాలం. ఇంగ్లీషుతోగాని, రోమనులిపితోగాని మనకు పరస్పరసంబంధం సహకారం వుంటుంది; వుండక తప్పదు. కాని సర్వస్వము ఇంగ్లీషు రోమనులిపిచేతుల్లో ఒప్పజెప్పితే ఎలా? వైజ్ఞానికపర్యాయవాచిశబ్దాలు రాష్ట్రభాషలో (తెలుగులోకూడ) లేవని, క్రొత్తగా సృష్టించుట కష్టమని ఇంగ్లీషును రాష్ట్రభాషగా స్వీకరిస్తామా? రోమనులిపి సమర్థకులు ఇంగ్లీషును రాష్ట్రభాషగా చేద్దామనరేమో? భారతీయు డెవడూ ఇంగ్లీషు 'రాష్ట్రభాష' కావాలనడు. రోమనులిపికూడ అంతే. రోమనులిపిలో యుగసౌకర్యాలన్నీ వున్నాయని భారతీయులు మోహపడుట సహజమే. కాని క్షణికమోహావేశంలోకి వచ్చి అపూర్ణ — భారతీయభాషలకు పనికిరాని — లిపిని రాష్ట్రలిపిగా స్వీకరించుట యుక్తిసంగతం గాదు. రేడియో మున్నగు సౌకర్యాలకు 'రోమనులిపి'సహాయం తీసుకోవచ్చును. కాని రోమనులిపిని సర్వాధికారిణిగా చేయుట మంచిదికాదు. రోమనులిపిలో వున్న

---

2. ౘ, ౙ యీ రెండుఅక్షరాలు తెలుగువర్ణమాలలో అనవసరమని తోస్తోంది.

3. పైన వ్రాసిన ప్రతి పాదన (రాష్ట్రభాషకు) మన తెలుగుకుకూడ అన్వయిస్తుంది. వేరేవ్రాయుట అనవసరం.

యుగసౌకర్యాల్ని సాధ్యమైనంతవరకు మనలిపి (రాష్ట్రలిపి) లోనికి తెచ్చుకోవాలి. ఈపని మానవునకు అసాధ్యమైంది కాదు. పండితులు శ్రద్ధవహించిన చాలవరకు సఫలం కాగలదు.

మనలిపి (తెలుగు) ఇంత పూర్ణమైనాకూడ చాల క్లిష్టమైంది త్వరితలేఖనకు పనికిరాదు. వ్రాతలో ప్రతిఅక్షరానికి కలం ఎత్తవలసిందే? టైపురైటరుకు అచ్చుకి కూడ అతిక్లిష్టమైంది. అందువల్ల టైపురైటరుకు నోచుకోలేదు. నాగరిలిపికన్న తెలుగులిపి అతిక్లిష్టమైం దని నా అభిప్రాయం. నాగరిలిపికన్న తెలుగులో 'అచ్చు'కు మరీ ఎక్కువ అక్షరాల్ని — వత్తులు మొదలగువాటిని —వుంచవలసి వస్తోంది. అందువల్ల ముద్రణయంత్రాలకు చాలయిబ్బంది — ఆలస్యం — కలుగుతున్నది. తెలుగు లిపిని సంస్కరించడానికి విద్వాంసులు — లిపిశాస్త్రజ్ఞులు పూనుకోవాలి. ఇది నాబోటిసామాన్యులపని గాదు. మన ఆంధ్రవిద్వాంసులు 'లిపి సంస్కరణముపట్ల వుదాసీనులై వున్నట్లు తోస్తోంది. తెలుగులిపిని సంస్కరిస్తేనే గాని కొన్ని సౌకర్యాలైనా సమకూరవు. లేదా:

భారతదేశం వివిధప్రకృతులకు నిలయమని వ్రాసి వున్నాను. కాని అనేకభాషలు, అనేకలిపులు, అనేక జాతులు వున్నప్పటికి 'ఆత్మ' ఒక్కటే. విభిన్నభారతీయభాషలలో (ఉర్దూవినా) సమున్నతసాహిత్యాలున్నాయి. కాని వాటిఅంతరంగంలో 'ఆత్మ' ఒక్కటి. లిపులుకూడ విభిన్నరూపాలుగా వున్నప్పటికి వుద్గమస్థానం 'బ్రాహ్మీలిపి'. లిపులరూపు(శరీరం) మారినప్పటికి వర్ణమాల ఒక్కటి. కాని దైహికభిన్నతవల్ల భారతీయులలో 'ఐక్యత' లేకుండాపోతూంది. ఇది రాష్ట్రైక్యత యుగం. ఈయుగంలో 'ఐక్యత' ప్రధానమైంది. ఈ 'ఐక్యత'ను దృఢపరచడానికి ఏకభాష, ఏకలిపి అత్యంతావశ్యకము. ప్రాంతీయభాషల్ని మంటిలో గలిపి 'ఏకభాష'ను స్థాపించడం కష్టమేగాదు, చేతగానిపని కూడాను; భలేహీ రాష్ట్రభాషను స్థాపించవచ్చును. కాని కనీసం భారతదేశానికి 'ఏకలిపి' అవసరము. 'ఏకలిపి'వల్ల విభిన్నభాషా ప్రయుక్తభారతీయులు ఒకరి కొకరికి దగ్గరగా వస్తారు. విభిన్నత చాలవరకు రూపుమాస్తుంది. ఈ'ఏకలిపి'స్థానానికి 'నాగరి'లిపి వుపయుక్తమైంది. లిపిఆకారం (శరీరం) వేరైనప్పటికి 'వర్ణమాల' ఒక్కటే కాబట్టి తెలుగుకూడ 'నాగరి'లిపి వుపయుక్తమైందని నావ్యక్తిగత అభిప్రాయము. వర్తమాన 'నాగరి'లిపిలో తెలుగుకు కావలసిన కొద్దిధ్వనులు లేనప్పటికి అనుకూలంగా వుంటుంది. ఈధ్వనుల్ని పూర్తిచేసుకోవచ్చును. భారతీయవిద్వాంసులు — లిపిశాస్త్రజ్ఞులు — అందరు 'నాగరి'లిపిని సంస్కరించుటకు పూనుకొన్నయెడల విభిన్నలిపుల సంస్కరణ పరిశ్రమలు తగ్గుతాయి; ఫలం దక్కుతుంది. యుగసౌకర్యానుకూలంగా 'ఏకలిపి' ఏర్పడగలదు. విభిన్నలిపులస్థానంలో 'ఏకలిపి'ని స్థాపించగలుగుతాము. 'ఏకలిపి'వల్ల భారతదేశానికి చాల లాభము కలుగుతుంది. ఆంధ్రవిద్వాంసులు లిపిశాస్త్రజ్ఞులు — తమ అమూల్యసమ్మతిని ప్రకటించెదరుగాక.

* * *

గతసెప్టెంబరు ౧౯౩౬ 'భారతి'లో శ్రీమతి కణ్ణకుమారి'గారు "మనలిపి పూర్ణమైనప్పటికి ఇతరభాషలధ్వనులకు అక్షరాలు (గుర్తులు) లేవని, ఆలోట్లు సవరించుకొనుట మంచిద"ని వ్రాశారు. వారు చూపించిన ధ్వనులకు క్రొత్తఅక్షరాలు[4]

ఫ (ఉ = Father. फल, फसली)

ఝ (ఉ = Treasure, Measure, பழம்)

హైఁ (ఉ = हैं)

మా (ఉ = Mat, Pass)

మొదలగునవి. ఇది నాకు యుక్తిసంగతంగా తోచుట లేదు. ఇక్కడనే 'లిపి' భారమై చస్తూ రోమనులిపి కావాలని గోలపెడుతూంటే పరభాషాధ్వనులకు క్రొత్తఅక్షరాల్ని — గుర్తుల్ని — కనిపెట్టడం ఎందుకు? అనవసరంకూడాను. తెలుగులిపిలో యితరభాషల్ని - ఇంగ్లీషు, హిందీ మొదలగువాటిని వ్రాస్తూంటే తద్భాషాధ్వని ప్రకృతిరక్షణకు క్రొత్తఅక్షరాలుగాని, గుర్తులుగాని కనిపెట్టడం యుక్తమే. ప్రాచీనభారతీయ గ్రం

4. ఉదాహరణలో యిచ్చిన శబ్దాలక్రింద అండరులైనుచేసిన ధ్వనులకి ఈగుర్తులు సృష్టించబడ్డాయి.

థాన్ని రోమనులిపిలో ప్రకటిస్తూ పాశ్చాత్యవిద్వాంసులు భారతీయధ్వనిప్రకృతిరక్షణకై రోమనులిపికి అనేకగుర్తులు పెట్టారు. ఇది యుక్తిసంగతంగాని, అన్యభాషాశబ్దాల్ని మనభాషల్లోకి తీసుకొనేటప్పుడు వాటి ధ్వని ప్రకృతిరక్షణ అనవసరం. భారంకూడాను.

ప్రత్యేకభాషయొక్క ధ్వనిప్రకృతి ఒకవిశిష్టతను గలిగివుంటుంది. ధ్వనిప్రకృతి కనుకూలంగా 'లిపి'అస్తిత్వం ఏర్పడుతుంది. ధ్వనిప్రకృతివినా 'లిపి'అస్తిత్వమే వుండదు. హిందీధ్వనిప్రకృతి వేరు, ఉర్దూధ్వనిప్రకృతి వేరు, ఇంగ్లీషుధ్వని ప్రకృతివేరు. కావున యీభాషల ధ్వనిప్రకృతిరక్షణ మనభాషలో చేయగలమా?

ప్రపంచంలో సదా సంఘర్షణ జరుగుతూవుంటుంది. ఈసంఘర్షణవల్ల ప్రతివిషయంలోను పరస్పరమూ ఆదానప్రదానములు జరుగుతూ వుంటవి. అట్లే ఒక జాతిప్రభావం మరోజాతిమీద; ఒకభాషప్రభావం రెండోభాషమీద పడుతూవుంటుంది. ఈప్రభావవినిమయం అతిసూక్ష్మంగా జరుగుతోంది. దీన్ని ఎవరూ అడ్డుకోలేరు.

అవసరాన్ని బట్టి ఒకభాషశబ్దాలు మరోభాషకు గ్రాహ్యాలుగా వుంటాయి రాజనైతిక విప్లవంతోపాటు విజేతలభాషాప్రభావం విజితుల భాషమీద పడుతుంది. నేడు దీన్ని మనం కండ్లార చూస్తూనే వున్నాము. ఉర్దూ, హిందీశబ్దాలు మనభాషలో ఎన్నో వచ్చాయి. ఇప్పుడు ఇంగ్లీషుప్రభావం మనభాషమీద (యితరభారతీయభాషలమీదకూడాను)స్పష్టంగాకనిపిస్తోంది ఎన్నో శబ్దాలు మనభాషలో వచ్చి చేరినాయి. ఇతరభాషల శబ్దాలు ఉచితమైనంతవరకు గ్రహించినందువల్ల మన భాషకు ముప్పునాటిల్లదు. కాని యీశబ్దాలప్రకృతిని —ధ్వనిని-మనభాషాప్రకృతి(ఉచ్చారణ)లో జీర్ణింప జేసుకోవాలి. అప్పుడే భాష సజీవంగా వుంటుంది. పరభాషాశబ్దాల ధ్వనిప్రకృతిని ఉన్నదున్నట్లు తీసుకొంటే మనభాష పులగంలా తయారవుతుంది. పరభాషాశబ్దాల్ని జీర్ణింపజేసుకొనేశక్తి తెలుగుకన్న హిందీలో ఎక్కువగా వుంది. ఉదా: Box (బక్సా), officer (అఫ్సర్). December = (దిసంబర్) తెలుగులో ఉదా: Hospital = ఆసుపత్రి, कचहरी (కచహరీ) = కచ్చేరి. ఈవిధంగా అన్యభాషాశబ్దాల్ని మనభాషలో జీర్ణింప జేసుకోవాలిగాని వాటికై కొండగుర్తుల్ని పెట్టుట వుచితంగాదు.

భాషకు నియంతలు జనసామాన్యం. జనసామాన్యం వాడుకను అనుసరించి భాష మారుతూంటుంది. అందువల్ల భాషోచ్చారణలోకూడ మార్పులు వస్తుంటాయి. నేడు ఈమార్పులు తెలుగులోకూడా కన్పిస్తున్నాయి. ఉదా: తాటాకు. ఇక్కడ 'టా'లో ఎత్వను అత్వను (ఎ. అ స్వరాలు) కలసివున్నాయి. 'Man'లోని 'Ma' ధ్వనిలాగ ఉచ్చరింపబడుతుంది: ఈధ్వని తెలుగులో వృద్ధిపొందుతున్నట్టు కన్పిస్తున్నది. ఈధ్వనిని ఈవిధంగా వ్రాయొచ్చునని నాఅభిప్రాయము. 'తాటాకు'-'టా'కు ఎత్వము అత్వము యిచ్చిన యీధ్వని పలుకగలరు. అట్లే 'చేరారు'అని వ్రాయటానికిబదులు 'చేరారు'అని వ్రాయుట మంచిది. (తెలుగులో 'వస్తో'ను 'వెూ'గా వ్రాస్తున్నారు. ఇది లిపివైజ్ఞానికదృష్టితో తప్పని తోస్తోంది. ఇది 'Man'లోని 'Ma'లాగ పలుకుతుంది.)

తెలుగులో యింకను అనేకగ్రామీణధ్వనులున్నాయి. కాని అవి యింకను సాహిత్యరంగంలోకి రాలేదు. కావున 'వర్ణమాల'లో స్థానమిచ్చుట అనవసరము. హిందీలోని గ్రామీణభాషలలో విచిత్రధ్వనులు పలుకబడుతున్నాయి. వాటి కింతవరకు 'నాగరి'లిపిలో స్థానంలేదు. భాషావిజ్ఞానులు (Philologists) ఏవో కొండగుర్తులు పెట్టుకొంటున్నారు.

# దీక్ష

రామ కృష్ణ శాస్త్రి

'కవర్డ్ — యూ...డర్టీ...కవర్డ్ —'.

—కలత నిదురలో వెన్ను చరచినట్టుగా అయి, ఉలిక్కిపడుతూ, పక్కమీదనుంచి క్రిందకు దొర్లి, లేచి కూర్చుని మూసిన కనులతోనే... కలలో మెరసిన దీనపు చూపులను మనసులో తొంగిచూసుకుంటూ మళ్లా పారాయణకు ఉపక్రమించాడు...కవర్డ్...

ఆమే!...అవే నీళ్లోడే కన్నులు...అవే పరివేదనతో బ్రతిమాలే చూపులు...నన్ను 'మరచిపోకండి' అని, పాలిపోయిన పెదవులమీద, మందారమాలలైన పలుకులు...కనుమూసినప్పటినుంచీ అనేకల!

తెలుసును...ఉభయులకున్నూ, ఈజన్మకు తిరిగి కలుసుకోవడం ఉండదేమోనని... తెలుసును అశుభ సూచనలతో గుండె ఉండి ఉండి ఝల్లుమంటూంది: మరునాడు ఉదయం బయలుదేరుతుందనగా...తెల్లవార్లూ, బాల, మంచాన్ని ఆనుకుని కటికనేలమీద కూర్చుని...'నన్ను పంపకండి! నాకేదో భయంగా, దిగులుగా ఉంది; ఏమైనాసరే, మీదగ్గరనుంచి పంపేయకండి'...అని ఎంత వేడుకుంది...బండీ ఎక్కేటప్పుడు, ... ఏలా విలపించింది ... కడసారి ... ఏలా చూసింది!

ధైర్యంచేసి ... తండ్రిమాటకు ఎదురాడి ... భార్యను పంపకుండా నిలుపుకునే సాహసం, అప్పుడు లేకపోయింది; తరువాత...ఎన్నిసార్లు ప్రయాణమైనా...ఆయన అనుగ్రహించి పైసా రాల్చందే...ఎక్కడికి కదలడం?...ఉత్తరం వ్రాయడానికి అణాడబ్బులకు గతిలేని వాడికి...ఊరి ప్రయాణానికి...

చివరకు...జబ్బుచేసిందని, టెలిగ్రాంవచ్చినా, అప్పుడైనా, ఆయన — కిరాతుడిగుండె కరగిందా? డబ్బే ప్రాణం...పాతబాకీ వసూలు చేసుకోవడం ముఖ్యం కాని...ప్రాణం ఎక్కువా? — పోయిందని...సుఖప్రసవం కాలేక, ఎంతో కష్టపడి పోయిందని...తెలిసిన తరువాతకూడా, ఏమనుకున్నాడు...చీలికలు వాలికలైన పాతపంచ పారేసేటప్పుడు పడేబాధంత అయినా ఆయనకు లేకపోయిందే!...కోడలు పోయిందని కాదు...ఇక వియ్యాలవారిదగ్గరనుంచి డబ్బు గుంజానికి వీలులేకుండా పోయిందని...విచారం!

కిరాతుడు...ఆయన కడుపున పుట్టీకూడా అబంధతనం...మనసు — రాయి — తనం, తనకు ఎందుకు అబ్బిందికాదు? జగవడబ్బుకోసం...ఆయన, ఎన్ని ప్రాణాలైనా దిగదుడిచి బలివేస్తాడే...ప్రాణానికి ప్రాణమైన — బాలను కాపాడుకునేందుకు ... ఆ తండ్రికి కొడుకు...తానేం చేయగలిగాడు?...ఏమి చేతకాని...తెగ తెంపులులేని...కవర్డ్.

ఎల్లకాలమూ, అలా పరాన్నభోజనం చేస్తూ... భూభారం వృద్ధిచేస్తూ...కన్నవారి వంటయింటి కుందేలుగా...జీవనంచేసేవాడేమో? కాని...గొర్రెను మేపి మేపి, కసాయివాడికి అప్పజెప్పకుండా ఊరుకునే కరుణాళువా...ఆ తండ్రి! పుట్టగానే, తల్లి కరవైన, ఆ పసిపాపసంగతి ఇక తలచకూడదూ?...మళ్లా కొత్త పెళ్లికొడుకు కావాలి? —

అయేవాడేమో — ఏమో, తండ్రిమాటనా ... కాదనే నిబ్బరం ఎక్కడ వచ్చింది? కాని...ఆమెకన్నులు...బాల చివరసారిచూపిన చూపు....

ఎదిరించి ఆపంచక్రింద ఒకక్షణం నిలువలేడు. ...తండ్రి చిట్టెడు ఉప్పు దక్కనియ్యడు...పోట్లాడుతూనే ... అక్కడనే ఉండగల తాహతు ... తనపిల్లను తెచ్చి పెంచుకుంటూ...తనకు రావలసినదేమో నిలవేసి గుంజుకుని...ఆయింటిపట్టునే...ఆ పోరులోనే కాలక్షేపం చేయగల తాహతు...లేదు:

కట్టుబట్టలతో...ఎవరితోనూ చెప్పకుండా, ఎక్కడికి వెళ్లుతూన్నదీ తెలియనీకుండా...చేత కానీ లేకుండా...నానాబాధలూ పడి, పట్నం చేరుకుని... తిండికి మాడి, తలదాచుకునే చోటులేక, ఆదరించే దిక్కు లేక, నలమల లాడిపోయి...ఇన్నాళ్లకు, ఓ పూట కడుపునిండే కొలువుకు కుదిరి...కాలం ఏలాగో గడుపుకుంటున్నాడు :

సుఖపడాలని కోరిక లేదు...అంతకన్న మంచి ఉద్యోగం...ఉండటానికి వసతీ దొరకాలనీ...విద్యకు తగినలాభం కలగాలనీ అపేక్ష లేదు : అదకతవక జీవితం వల్ల పడినకష్టాలు...మరచిపోవాలని లేదు :

కవర్డ్ —

నమ్మిన అనాయకురాలిని రక్షించుకోలేక పోయినాడు...పెళ్లకపోతే, బ్రతికేదేమో : రమ్మని ఎన్ని ఉత్తరాలువ్రాసినా, తండ్రికి ఝడిసి, ఇల్లి మానినన్నా లేకపోయినాను : తండ్రి కోరాలూ మెరియాలూ నూరుతాడని...కరుడుదీర ఏకనవన్నా లేకపోయినాడు...ఆయింట్లో...కవర్డ్ — ఎందుకు వచ్చిన ఏళ్లు ...ఎందుకు వచ్చినచదువు...

ఇక్కడ ఒకసుఖం...తండ్రిభయం లేదు... ఎప్పుడూ, బాలను తలచుకోవచ్చును...కలలో...ఆమె చూపులు మననం చేసుకుంటూ దద్దరిల్లిపోవచ్చును.

ఎవరితోనూ స్నేహం లేదు...ఏజోక్యానికీ పోవడంలేదు : అనుభవంవల్ల పరిపాటి అయిపోయి... మరపువచ్చినప్పుడల్లా...బాలచూపులు మెలకువ తెప్పించాలి...కవర్డ్...అని జ్ఞాపకంచేయాలి !

—మనసులో కణకణలాడుతూన్న అధీర భారంతో కళ్లు జేగురు ముద్దలై పోయినవి : ములుగర్రతో పొడిచినట్టు శీతాకాలం సూర్యకిరణాలు...తలుపులూడిపోయిన కిటికీగుండా చొరుచుకువచ్చి రెప్పలమీద కుమ్ముతూన్నవి. అల్లార్చి...మొహం తెమల్చుకుని... అరచేతులతో కను లద్దుకుని...కర్మసాక్షికి అంజలిపట్టి పక్కను మోచేతులమీద ఆనిన ఊపులో లేచి నిలుచుని ...లుంగీ బంధించుకుని...లోకంలోకి దిగిపోయినాడు ;

స్టవ్ రగిల్చి...స్నానం అదీ చేసి వచ్చేశాడు : పాలు అందుకుని...కాఫీచేసుకు త్రాగి...సిగరెట్ కోసం వెదికి...ఖాలీపెట్టెను మూలకు విసిరికొట్టి... దిగి వెళ్లి తెచ్చుకునేందుకు ఓపిక చాలక రాత్రి చూడటం మరచిపోయిన పత్రిక చేత బుచ్చుకుని తిరగవేస్తూ ..కుర్చీలో జార్లపడిపోయినాడు : తిరగపడి, ఒళ్లో పరచుకుపోయిన 'హిందూ' వెనకపేటీఅంతా...మోపె డేసి పూలదండలతో, భుజాలు రాచుకుంటూ ఎదురుగా నిలుచున్న...నూతనదంపతులముఖం. అది, కళ్లకు ముళ్లులాగా గుచ్చుకోగా, పేపే, గొగ్గిఅంచు గుప్పిటలో పట్టి...చీల్చేస్తూ...అలాటి ప్రమరానందం...గడ్డకట్టుకుపోయిన తనగుండెల్లో త్రెళ్లించిన అసహ్య — వేదనా — ఉన్మాదానికి ... తెప్పిరిల్లిన మనసులో మెరుపులాగా...నవ్వు తెచ్చుకున్నాడు... ఆలోచనలమీదుగా ... దంపతులు ఎడాపెడా వేసుకుని, బొమ్మసుఖంలో, నందనవనీవిహారసుఖం చిందించుకునే...వివాహ — పీటను...తరువాత...జీవితం, ఏ కారణంవల్ల...ఏలా దగ్ధమైపోయినా...ఆ కుములు ధైర్యంగా లోకానికి...ప్రకటించ లేడేం ? అవును... ఒళ్లంతా సంసారం...ముళ్లుగా గుచ్చుకుపోయినవీరదటు చెంపల్లో, కావాలని తెచ్చిపెట్టుకునే రోజారేకల మెరమెచ్చు లేలా నిలుస్తవి ? అనంతా...కలలు కలలని తెలుసుకోనీయని...పీడకల....

— ఇంకా కల అనుకుంటూనే ఉన్నాడు.... ఎదురుగుండా...తనహోదాకు తగిన యిగిలింపుతో... తనపై అధికారి...ఆయనపక్కను...చేత పూలకొమ్మతో సిగ్గు దిగమ్రింగుకు నేకల్లు, ఓరచూపులకు మళ్లించే ...ఆయనకూతురు....

మూకాభినయంలో...భావప్రకటనం ... అతని మీద అంతసేపటినుంచీ పనిచేయకపోవడంవల్ల...పకిలింపుమొహాదు పెద్దదిచేసి... 'హలో' అని ఆతడు తెలివితెచ్చుకుని ఉచితమర్యాద చేసేలోపుగా...స్థూలకాయం...ఉన్న ఖాలీకుర్చీలో దించేశాడు.

అతడు లేచి నిలుచుండగానే...ఆ అమ్మాయి పూలు దోయిలించి...అర్పించే భంగిమలో అందిం

చింది...వాటిని, మర్యాదాగా మేజామీదకు...గుప్పిట విడిచి...ఆయనజాపిన సిగరెట్ ఆప్యాయనంగా...తీసుకున్నాడు:

ఒకదమ్ము... అతని కళ్లల్లో... వాళ్లు అప్పుడు అలా దయచేయడం ఎందుకా అనే ఆశ్చర్యం ఊదినవి: ఆ జనమాపులు ఆరాకకు భారతగాథ అంత వెనుక అంత ఉన్నదనే.. గాంభీర్యం తట్టించినవి.

రెండోదమ్ము...ఆతిడికవళికలో ... ముదిరిపోతూన్న...అర్థం - కాని - తనం: ఆయన మానంలో ...ఇక నోరు విప్పకతెనకే...ఆలోచన - నిశ్చయం:

— కానలాగా చేరుకున్న కాడి, కుర్చీ చేతికి చూపెట్టి...రాలుస్తూ...ఆయన తెలివి కేటలుగా...

'పీనపూజ ... చేయడానికి వచ్చాం' అని మీసాలు సర్దుకున్నాడు.

'ప్రాణదానం చేసినందుకు' ... వాక్యం సగంలో వీణె ముక్తాయించినట్టూ...చిరునవ్వు...చూపులకు అందిపుచ్చుకోనిచ్చింది....

అలా తెల్లబోయి ... తండ్రిముఖంమీదనుంచి... కూతురివంకకు చూపు తిప్పుకుని...అప్పుడు పోల్చుకుని...అంతటితో ఆనాటకం అర్థంఅయి.. బిగ్గరగా నవ్వుతూ...

'చేయి పట్టుకుని...అంత మోటగా లాగినందుకు దండించడానికి...మీతండ్రిగారిని తీసుకురావాలిసింది కాని...ఈపూలపూజ లేమిటి'...అని చల్లనిగాలి చిరురించిన కొంటెతనం ఆమెమీదికి విసిరాడు.

'అంతకన్న ఏం చేయగలం?...నీవు దేవుడులాగా.. తోడుపడి రక్షించకపోతే, అమ్మాయి అక్కడా — అక్కడా కారుక్రింద పడిపోయేదేనా...ఏం ప్రత్యుపకారం చేసి నీరుణం తీర్చుకోగలను'...అని ఆయన...ప్రాధేయపు — జవాబు.

"నేను ఆసంగతే మరచిపోయినాను...మీ అమ్మాయిని...మీ మాటలధోరణివల్ల పోల్చడమే కాని ...ఒంటరిగా కనబడితే...గుర్తుపట్టలేకపోయేవాడినే ...అయినా ఏంఘనకార్యం అని...మనిషైనవాడు ఆ మాత్రం..."

"ఊఁ...ఏదీ ఒక్కడిని చూపించు, ఎవడికి వాడు తనపుచ్చె కాచుకోవడమే కాని...ప్రాణానికి తెగించి ...'

"తెగించడాని కేముందీ?"

"ఇలా చెప్పేయడం...నీ వీరహృదయానికి... వినయానికి లక్షణం".

"నన్ను పొగడకండి".

"పొగడటమా? కృతజ్ఞత...తెలుపుకోవడం."

"అర్థాన్నా?"

"కాదనడం...నీతరమా?"

...కోటీ ఎక్కడమేతప్ప...మాటల ప్రయోజనం కనిపించనందువల్ల...వాళ్లను కరువుదీరా అభినందించనిచ్చి ... సాగనంపి ... తలుపుగడియ బిగించి... నిట్టూర్పుసగం విడవకముందే, మళ్లా ఎవరో వచ్చినట్టు ...తలుపు ధగల్ మంది: తీయగా...బొమ్మతీసి పత్రికలకు...అమ్మకునే...అయ్యర్...

అంతసేపూ...మర్యాదాకోసం అరికాలిక్రింద అణచిపెట్టినమంట...ఒక్కమారు నెత్తికి ఎగదట్టింది: రెండుచేతులతో ఆగంతుకుడి రెండు చెవులూ పట్టుకుని ...వెనుకకు త్రిప్పి...'ఇక్కడనుంచి...మీ ఆఫీసు దాకా...ఎన్ని అడుగులో లెక్కపెట్టుకుంటూ వెళ్లి ...మొత్తం ఎంతో ఉత్తరం వ్రాయి. మెడ మెదిల్చావా...మళ్లా అడుగు కనక్క వేశావా...నీఉపిరి తీశాననుకో...' అని ఖంగుమనేటట్టుగా ఉరిమి మేడ అదిరేటట్టు తలుపువేసుకున్నాడు....వెంటనే కుర్చీలో పడి — విమం శ్రేణుపులుగా...నవ్వునురగలు గ్రక్కుతున్నాడు....'వీరుడు'...ఓహో.

ఉదయాన్నే ఎత్తుకున్న మైకం...ఎంత కాస్తూన్నంతసేపూ...తరగనేలేదు: నాలుగుగంటలు దాటిన తరువాత...భోజనంచేయలేదన్న సంగతి జ్ఞాపకం వచ్చి ...నిలిచిపోయి...హోటలుకు పోయి...ఆత్మారాధన పుష్టిగా చేసుకుని...కాఫీకమ్మదనానికి...నిలువెల్లా కమ్ముకుంటూన్న ఖులాసాతో...సుమ్మం దిగగానే ఆ అమ్మాయి...కారులో ఎదురుగా ఉంది: చూసి గిరుక్కున పాన్‌షాపులో కల్పించుకుని...జనసమూ

హాంలో కలిసిపోదామని చూశాడుకాని...'ఆమెను ఇప్పుడు వేమరించడం నీతరము' కాదని మనసు నచ్చ చెప్పినందువల్ల...పళ్లబిగివిని...సమీపించాడు. మర్వర్ తలుపుతీసి ఉంచాడు. ఆమె చేయి చాచి మనసులో ...లోపలికి లాగేసింది...

బాణవేగంతో...ఎక్సైరు చేరుకుంది కారు. కుదిలింపులకుకూడా...చలించకుండా ... వీసమైనా శరీరాన్ని జరగనీయకుండా...కూర్చున్నాడు....ఇసుక గుట్టలుగా పేరుకున్న చోటికి...ఇద్దరూ ... మౌనంతో ...నడచిపోయినారు.

'మూగనోము...మాకన్న మగవాళ్లు పడితేనే, ముచ్చటగా ఉంటుందనిపిస్తుంది' అని స్వగతానికి ప్రకాశం యిచ్చింది. ఆతడు వంచిన తల ఎత్తి చూసి ఊరుకున్నాడు. ఎన్నోమాటలు చెప్పింది ...ఎన్నో రకాలుగా కిలకిలలాడింది: ఎన్నోవిధాల నో రూరించాలని...సిగ్గుగా ... నిర్భయంగా...ప్రయత్నించి...మౌనాన్ని ఇక సహించలేని చొరవలో ... మీదకు వాలింది.

— హుంకరించాడు...మెడకు చేతులు పెనవేసింది...విడిపించుకోబోయినాడు...ముఖానికీ,ముఖానికీ తేనెచినుకంత ఎడమన్నా లేదు...విదిలించుకుంటేనే గాని...పీడ వదల లేదు.

'ఒళ్లు మరచిపోకు'...అతనికళ్లు...ఎక్కడో చూస్తున్నవి...మంటల్లో.

'పోను...కాని, మిమ్మల్ని మరవలేను'.

'నీవు...ఎవరు?'

'విడదీసుకున్న...మీ కౌగిలి వదలకండి'.

'పెళ్లివాడా!'

'అలా చేసింది...మీరే'.

'నేను చేసినదేమిటో నీకేం తెలుసు...'

— ఒకదమ్ములో...తన పూర్వగాథను, ఆమె మనసు విరిగేటంత విషపు పూత పూసి...భార్యను భ్రమింపజేసిన పరమకిరాతుణ్ణి...అని నమ్మించాలని ప్రయత్నం చేశాడు: ఆమె...పెదవులు వణకుతూండగా...

విని...విని కన్నీరు రెప్పలతో అప్పళించుకుని...చాలా జాలిగా,

'ఎంత బాధపడ్డారండీ?,...అంది మారనిమనసుతో.

'బాధ..., పెట్టాను'.

'నేను...నమ్మను'.

'పోనీ'.

'...పోనీయను'.

— అరంపరోత భరించలేక ... నిబ్బరంగా... సంభావణ చంద్రోదయంమీదికి త్రిప్పి...ప్రొద్దుపోతూన్నదని జ్ఞాపకం తెప్పించి ఆమె ఎటు...అనుకునేందుకూ పాలుపోనీకుండా...యింటికి మళ్లించాడు: కారు పరుగుతీస్తూన్నంతసేపూ, ఏలాగా ఇంకా రంధి పెరగనీక తప్పించుకోవడం అనే ఆలోచనలో పరధ్యానంగా ఉండి, పూర్లోకి రాగానే...దోవ పోయే ఎవడి వంకనో...స్నేహితుడని చూపిస్తూ...అతనితో పని ఉందని...ఆగేలోపల క్రిందికి దుమికేసి...మందిలో కలిసిపోయి...యింటికి చేరుకున్నాడు.

అలవాటు ప్రకారం పేపరు కొని పట్టుకు తెచ్చుకోవడం మరచిపోలేదని...అప్పటికి స్పృహ తెలిసి... పేజీ తిరగవేయగానే...కొట్టొచ్చే అక్షరాల్లో...తను చేసిన ఘనకార్యం ప్రశంస...ఆఫీసు గ్రూప్‌లోనుంచి ...సంగ్రహించిన...తనబొమ్మ!

అంతవరకూ చించి ఆపేలికతో సిగరెట్ ముట్టించుకుని...జారవిడిస్తే నిక్షేమం కాదేమోనని...వేళ్లు కాలేదాకా... రేజామిగలకుండా...నుసి కంట చూసి విడిచాడు.

...క్రిందపడిఉన్న కవరు చించి చూశాడు: దానిలో...'మేము తెలుగులో మొదటి స్టంట్ పిక్చర్ తీయ సంకల్పించాము. అందుకు, మీలాంటి వీరులు, మాతో కలిసి పనిచేయడానికి అంగీకరించిరే' ఇక ఆపై అక్షరం చూడకుండా...నలిపేశాడు: వరాలు యివ్వడానికి చేతగాని దేవతలు ... వంచనలకు మాత్రం ముందంజ. కళ్లు మూసుకుపోయినలోకం... ఏపాట పాడినా...'బాల' తనకళ్లల్లో మెదులుతూంటే చాలును....గుండె దిట్టం కరగకుండా నిలవడానికి...

— రెండురోజులు గడచినవి. ఆఫీసునుంచి... ఎందుకు రాలేదో అని కనుక్కొని పోవడానికి వచ్చిన జవాను చేతికి రిజైన్ చేసినట్లు వ్రాసి యిచ్చి పంపేశాడు. ఆ అమ్మాయి...రెండుమూడుసార్లు వచ్చి...చనవు చేసుకోవాలని...మీదమీదకు వస్తే...ఆమె కూరిమినంతా...దూదిపింజెలాగా ఎగరగొట్టాడు. ... కాని, మనసు మార్చుకోదని తెలుసు....తనమనసు ఈజన్మకు సుఖలాలసలలోకి నూరకూడదని... తెలుసు : ఇక చేయవలసింది ?

ఒంట్లో త్రాణ లేకపోయినా...ధూకుడుగా... దిగి, వీధులోకి వచ్చి...వచ్చే ట్రాం ముందర...

కళ్లకు కమ్మిన చీకటి విడిపోయేటప్పటికి...డైవరూమ్‌లాగా ఉన్న తల ... తలగడలమీద నిలువలేకుండా ఉంది. చీకటిచారికలలోనుంచి...ఆ అమ్మాయి ముఖం...అదుర్దాపడుతూ...గోడమీది కేలెండరులో ... ఆనాటికి ... పదోనాటి లేడీ ... కొట్టొచ్చినట్టు...

పోలీసు జరీచారల తలపాగా రాయడికంఠం... 'మీసాహసానికి ధన్యవాదాలు...మీ రలాప్రాణానికి తెగించి...ట్రామ్‌కు అడ్డపడకపోతే ... ఆఖూనీదారు తప్పించుకునేవాడే...'

పట్టు తప్పి పడి ఉన్న దేహం...మనసును ఆ వీర— కళంకం మాయించుకోమని... హెచ్చరించిన క్లైత్రుల్లి పవటంలో కట్టు చెదిరి...పిగిలి...వల్లనికాలువ ...మెగం ... కమ్ముకుంటూంది .... బాధను సుత్తించడానికి తడుముకునే చేయి....కళ్లకు నెత్తురుపూసింది. చుట్టుప్రక్కల గడబిడ...మళ్లా చీకటి.

చీకటిలో...వెన్నెలగూటిలో...నేరం మరచిపోయి...చిరునవ్వే...బాల... చిక్కి శల్యమై...బాధలు కరగించినరూపం...విరిసిపోతూ ... మెదడుకు ... అమృతస్నానంతో...తాపం ఆర్చేసి...

—తలపులో వెన్నెలవెలుగు...కన్నులలోకి... జీవచైతన్యజ్యోతిగా తరళించుకుంటూ రెప్పలు ఆర్పడంలో ... వెలమారిన లేడీలగడులకౌగిళం ... 'గడచిన నెలను కాలంలోకి తోసేశాను....ఇప్పుడు నీవు కావలసింది...నేను' అన్నట్టు కొత్తనెత్తురు రంగు అంకెలతో...గాలికి ... రెపరెప లాడుతూ ... ఆకర్షించిన చూపు...వాలుకోవడం...ఉద్రేకం నిరంతర నేవాజాగరణంలో చివికి...దోహదమైపోగా లేడీగా సాగిన... ప్రేమవల్లరి పోలికల...కళ్లలో...కాచుకునిఉన్న... ఆ అమ్మాయి కవళికలో...ఏకమూర్తిగా...పెనవేసుకుపోతూ బాల ... అందుబాటుచేసి ... తానందనిదైపోవడం...

గుండె సారించే...కవర్డ్ ... శైవసామ్యన... కంఠగతంగా కుదించుకుని...పరీక్షాధికారి...ప్రత్యేకం పగబట్టి ఫెయిల్ చేశాడని తెలుసుకున్నప్పుడు...ఆత్రంతో బడి చదువు మానివేసి...పంతం విద్యాస్పర్థతో చెల్లించుకోవాలనుకునే ఘట్టుబాయ్‌లాగా...పైఅంతస్తుకు...ఉద్ధరించుకోవాలని...

— నరబలం మిగిలిపోయిన చేయి...ఆమెపై పులకు ...సాగనిచ్చాడు....గుప్‌మన్న దీపం మెఱుపున... ఆతని కనుకొలుకుల్లో కుదురుకున్న ... నీటిబిందువుల తొణికిసలు...చేతికి చేయి కౌగిలిగా యిచ్చి వీరగంధాను లేపనంగా పులకలై పోతున్న...ఆ అమ్మాయిలో... సుమంగళి — కైశికి జలదరించింది.

---

# పశ్చాత్తాపము

పాకల వేంకట సూర్యనారాయణ

రాధికా! సాంధ్యమల్లికారమ్యగాత్రి!
మాధవుడ నేను; క్షమియింపు; మసలినాడ!
వల్లవీకృతఘనతటిద్వల్లి నిన్నె
కోరి నేడు గవేషించుకొనుచునుంటి.

మధురబృందావనీమధుమాసవిదిత
మృదులమందారపథముల వెదకినాడ;
అర్ధవికసితశేఫాలికాంకురాళి
వర్ధితవితర్దు లీక్షించి వచ్చినాడ ;

హరిదరహాసభారకల్హారపూర్ణ
సారసాకరతీర దేశమ్ములందు
యుష్మదీయపదాంభోజయుగళముద్ర
లెల్లెడల దోచి మోహంపువెల్లి ముంచె.

విమలతావకచరణచిహ్నములయందు
పదములను మోపికొనుచు సంభ్రమముతోడ
వేణువనసీమ దూరి నిన్ వెదకి వెదకి
క్రుంగిపోయితినే నన్ను గూఢకోపి!

నాకొఱకె వేచి నాకొఱకే కృశించి
ఎంత నవసితో నవనీతహృదయ వకట?
సంతతవిషాదబాష్పస్రవంతు లెన్ని
ప్రబలి నటియించెనో కపోలములమీద?

మారుతతరంగసంగతసౌరభంబు,
పరిమళాన్వితమకరందమధురిమంబు,
మధురచంద్రమరీచులమార్దవంబు,
కలవు ప్రణయినీ! నీవిలోకనములందు.

---

# ఆంధ్రుడు - ఢిల్లీసామ్రాజ్య మహాప్రధాని

## ఒక అద్భుతమయిన చరిత్రగాథ

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య

కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి ముఖ్య సేనానులలో నాగయ్య గన్నసేనాని ఒకడు. ఇతడు నియోగిబ్రాహ్మణుడని కొందరును, కమ్మనాయుడని కొందరును చెప్పుదురు. కాని దీనికి తగునాధారములు ఏవియు కానరావు. ఇతనికి అంకితము చేయబడిన మార్కండేయ పురాణమునందు ఇతడు "చతుర్థకుల సుధాంబుధి నుదయించె" అని చెప్పబడియుండుటచేత ఇతడు శూద్రు డనుట నిశ్చయము. ఇతనితాత మల్లసేనాని. తండ్రి నాగయ; కాకతీయ గణపతిదేవచక్రవర్తి అనుంగుతలవరియగు మేచయ అల్లుడు. ఇతనితమ్ములు ఎల్లయ, మేచయ లనువారు ప్రతాపరుద్రుని కొలువున నుండిరి. గన్నయ ప్రతాపరుద్రచక్రవర్తిదయచేత రాజ్యచిహ్నములను, సంపదయును, నాయకత్వమును బడసెను. మరియు

'కాకతిక్ష్మాధీశకటకపాలుడు'— అని యుండుటచేత మాతామహునివలె ఇతడును ఓరుగంటికి తలవరిగా నుండినట్లు తోచుచున్నది.

గన్నయసేనాని ప్రతాపరుద్రచక్రవర్తి కొలువునం దారితేరి యుద్ధములం దాతనికి చేదోడువాదోడుగ నుండెను. క్రీ. శ. ౧౩౨౨-౨౩ సంవత్సరములలో ఢిల్లీచక్రవర్తియగు ఘియాజుద్దీన్ తుఘ్లాక్ అను సుల్తాను ఒకమహాసైన్యమును తనజ్యేష్ఠపుత్రుడగు ఉలూఘ్‌ఖానుని యాధిపత్యముక్రింద ఓరుగంటిని ముట్టడించుటకై పంపెను. ఉలూఘ్‌ఖానుడు మొదట ప్రతాపరుద్రునిచేత పరాజితుడై పారిపోయినను అచిరకాలముననే మహాసైన్యముతో మరలి వచ్చి యోరుగంటిని ముట్టడించెను. ఇత డింత త్వరలో మరలివచ్చునని ప్రతాపరుద్రచక్రవర్తి తలచియుండలేదు. తత్పూర్వము తురకల యడావుడివల్ల దేశమంతయును నాశనమై ప్రజాక్షోభ కలిగి తిన నాహారముకూడలేక జనులు బాధపడుచుండిరి. వారిబాధను తొలగించుటకు చక్రవర్తి కోటలో నిలవచేసి యుంచిన ధాన్యము, ఇతరసామగ్రులను అల్పక్రయమునకు అమ్మించి వారికి కొంత తోడ్పడెను. మరియు కోటసంరక్షణకై వచ్చియుండిన నాయకుల నందరిని తమతమ సైన్యములతో గూడ స్వస్థానములకు పంపివేసి దేశమునందు వ్యవసాయము విరివిగా సాగించుటకు తగుఏర్పాటులు కావించెను. ఈకారణముల వల్ల ఉలూఘ్‌ఖానుడు రెండవమారు ఓరుగంటిని ముట్టడించినపుడు ముట్టడికి నిలిచి, శత్రువిదారణము కావించుటకు ప్రతాప

రుద్రునికి శక్తి చాలకపోయెను. తత్కారణమున శీఘ్రకాలముననే ప్రతాపరుద్రచక్రవర్తి తురకలకు లొంగిపోయి, దైవవశమున వారికి బందిగా చిక్కెను.

ఉలూఘ్‌ఖానునికి ప్రతాపరుద్రుని తెలుగుదేశమున నిలువనిచ్చుట కొంతమాత్రము నిష్టములేకపోయెను. చక్రవర్తి పట్టుబడ్డవిషయమును నాయకు లెరింగినవెంటనే వారందరును మరలివచ్చి యాతనిని బందీవిముక్తుని కావింప ప్రయత్నింతురని ఉలూఘ్‌ఖాను డెరుగును. ఇదివరకు ఆంధ్రుల కత్తిపోటును రెండుమూడుపర్యాయములు రుచి చూచినవాడగుటచేత తాను ఆనాయకులతో పోరి నిర్వహించుకొనగలనన్న నమ్మక మాతనికి లేకపోయెను. తత్కారణమున అతడు ప్రతాపరుద్రుని శీఘ్రముగ తగు కావలి సైన్యమును తోడిచ్చి ఢిల్లీకి పంపివేసెను.

ఇట్లు ఢిల్లీకి బందీగ పోయినవాడు చక్రవర్తియొక్కడే కాదు. ఆకాలమున రాజధానియందుండిన అనేకులు దొరలును,నాయకులునుగూడ బందీలుగ గొంపోబడిరి. అట్టివారిలో ఓరుగంటి పురపాలకుడును,చక్రవర్తితోకూడ కడవరకు పోరినవాడును అగు నాగయగన్న సేనాని యొకడు. ఇతడు చక్రవర్తిని అనుసరించియే ఢిల్లీకి పోవుచుండెను. మార్గమధ్యమున ప్రతాపరుద్రచక్రవర్తి తన స్థితికి మిక్కిలి దుఃఖితుడై దివంగతుడు కాగా గన్నయ మహమ్మదీయమతమును పుచ్చుకొని ఢిల్లీపాదుషాకొలువున చేరెను. ఈలోపల సుల్తాను ఘయాజుద్దీను మృతినొందగా ఉలూఘ్‌ఖానుడు ఢిల్లీసింహాసన మెక్కి సుల్తాను మహమ్మదను పేరుతో రాజ్యము చేయ నారంభించెను. ఇతనికి గన్నయసేనానియన్న నెక్కువ యభిమానము. మహమ్మదీయమతము నవలంబించినపిమ్మట అతనికి మల్లిక్ మకబ్బూల్ అను నామకరణముచేసి సుల్తాను అతనిని తన యాస్థానమున నుంచుకొనెను. అటుపిదప జరిగిన కిష్లుఖానుని పితూరి నణచివేసి సుల్తాను మకబ్బూలును ముల్తానుకు అధిపతిగా నియమించెను. మకబ్బూలు ముల్తానును పరిపాలించుకాలమున హాలూజార్, గుల్చంద్ అను నిద్దరు సర్దారులు సుల్తాను ప్రభుత్వముపై తిరగబడి పంజాబు నల్లకల్లోలము కావించిరి. వారిని నిర్జించి మకబ్బూలు సుల్తానుమన్ననకు పాత్రుడాయెను. క్రీ. శ. ౧౩౩౪-వ సంవత్సరము ప్రాంతమున దక్షిణాపథమున ఢిల్లీసామ్రాజ్యమునకు చెందిన రాష్ట్రము లన్నియు తిరుగబాటుచేసెను. అందు ముఖ్యముగా మధురయందు కొత్వాలుగానున్న సయ్యదు జలాలనువాడు అచ్చట ప్రభుత్వముచేయుచున్న రాష్ట్రపాలుని, అతని యనుయాయులను కృత్రిమముగ వధించి జలాలుద్దీన్ అహ్సన్ షా అనుబిరుదుతో స్వతంత్రుడాయెను. వానిని తరుమగొట్టి మధురయందు మరల స్వాధికారమును పునఃప్రతిష్ఠించుటకై సుల్తాను గొప్పసైన్యముతో దేవగిరిమార్గముగ వచ్చి వరంగలుపట్టణమును చేరెను. నెలరోజులపర్యంతము అచ్చట నాగి సుల్తాను మహమ్మదు యుద్ధమునకు వలయు సన్నాహములను చేయుచుండగా ఓరుగంటియందప్పుడు విజృంభించియుండిన ప్లేగుజాడ్యము అతనిసైన్యమునగూడ వ్యాపించి, దానిలో మూడువంతులు నాశనముచేసెను. సుల్తానుకుకూడ ప్లేగు తగిలెను. అతడు మృతినొందె నన్న కింవదంతి రాజ్యమునందంతటను వ్యాపించెను. ఈవార్త తెలిసి పెక్కుస్థలముల

యందున్న సర్దారులు అధికారులకు లొంగక తిరుగబాటుచేసిరి. ఇట్టిపరిస్థితియందు సుల్తాను మధురదండయాత్రను చాలించి దేవగిరికి ఢోలీలో తిరిగి వెళ్లెను. పోవునప్పుడు దేశము నందున్న కలవరమును శాంతింపజేయుటకు తగువాడని తలచి కాబోలు అతడు మకూ్బలును తెలంగానాకు పాలకునిగ నియమించెను. కాని మకూ్బలు జన్మతః ఆంధ్రుడయ్యు, దేశమున పూర్వము చక్కని పలుకుబడిగలిగిన వాడయ్యు అన్యమతావలంబనము చేసిన కారణమున ప్రజ లాతనికి లొంగరైరి. ఆతడు తన యధికారమును నెగ్గించుకొనజాలక పోయెను. కావున సుల్తాను ఢిల్లీకి పోయిన కొద్దికాలమునకే ఆంధ్రనాయకుడగు కాపయ నాయకునిప్రతాపమున కోర్చుకొనలేక ఓరుగంటిని ఆంధ్రరాజ్యముతోసహా అతని కర్పించి, మకూ్బలు ఢిల్లీకి పారిపోయెను. అప్పటికి నతడు సుల్తాను అనుగ్రహమును కోల్పోవలేదు. వెంటనే సుల్తాను ఇతనిని గుజరాతుకు పాలకునిగా నియమించి అచ్చటికి బంపెను. సుల్తాను కడపటిరోజులవరకును అత డచ్చటనే యుండెను. సుల్తాను తఘిఅను పితూరీదారును వెంబడించి సింధు దేశమునకు పోవునపుడు అతడు రాజ్య సంరక్షణకై ఢిల్లీయందు ఏర్పరచిన మంత్రాంగ సభయందు మకూ్బలు నొకనిగ నియమించెను. సుల్తాను థథపట్టణమునందు మృతినొందినప్పుడు మకూ్బలు ఢిల్లీపట్టణమునం దుండెను. సుల్తాను మహామ్మదు ముఖ్య మంత్రియగు ఖ్వాజా జహాను సుల్తాను మహామ్మదుకుమారుని సింహాసనము నెక్కించగా సైన్యాధిపతులు తమ సుల్తానుగా ఎన్నుకొన్న ఫిరోజిషాపక్షము నవలంబించి, మకూ్బలు పట్టణము వదలి సైన్యములతోగూడ ఢిల్లీపై వచ్చుచున్న ఫిరోజిషాను గలసికొనెను. అతడు మకూ్బలును మిక్కిలి గౌరవించి తన రాజ్యాభిషేకానంతరము అతనికి ఖానిజహానన్న బిరుదు నిచ్చి అతనిని తన ప్రధాన మంత్రిగ ఏర్పరచుకొనెను. అదిమొదలు తనమరణమువరకును ఖానిజహాను ఆపదవి యందే యుండి ఢిల్లీసామ్రాజ్యమును కడు జాగరూకతతో కాపాడెను. ఇతడు రాజనీతిజ్ఞుడు. రాజు పట్టణమును విడిచి దూరదేశమునకు యుద్ధమునకు బోవునప్పుడు ఈతని యందుగల నమ్మకముచేత సుల్తాను ఫిరోజిషా రాజ్యము నతని కప్పజెప్పిపోవువాడు. ఖానిజహాను అఖండవైభవము ననుభవించి పుత్రపౌత్రులను బడసి, వృద్ధుడయినవెనుక తన యధికారమును తనకుమారుని కప్పగించి క్రీ. శ. ౧౩౬౭-౩ లో మృతినొందెను.

---

# అశ్రుపూజ

కొండేపూడి సుబ్బారావు

కలల బరువుల కృశియించి కనలిపోవు
నాశిథిలజీవమునకు సౌందర్యలవమె
కానఁబడ దెన్ని జన్మాలకైన నాహృ
దయవిపంచి నదించునే తరుణగీతి ?

ముద్దుమొగ్గలు బంధనమ్ముల సడల్చి
పూలుగా వింతగా విడిపోవునటుల,
నాహృదయభావములుకూడ నన్ను వీడి
గాలులై పొంగి పొరలును గగన మెల్ల.

సంజబంగారు లోలుకు వసంతవీథి
నడచిపోతి పూజాప్రసూనములకొఱకు;
అంతలో మార్గమే మాయమయ్యె నిబిడ
నీల వర్ష మేఘాంధకారాల మునిఁగి.

భావములె కరఁగి జారె బాష్పములుగాఁగ;
అశ్రుహృదయము స్వామిపూజాంకిత మ్మొ
నర్చి కూర్చుంటి : తుహిన కణార్ద్రసుమము
గాలిబరువునకె ప్రిదిలి రాలినట్లు.

ఎవ్వరో నన్నుఁ గని చిరునవ్వకొనిరి,
పత్రములగాలి పల్కె విన్పడనిరీతి
ఒకటి రెండుచుక్కలును నిట్టూర్చు వినరె;
వెనుదిరిగినాడ, నిరుపేద మనసుతోడ.

"కావ్యాంజలి" నుండి.

---

# రేడియో సంక్రాంతి

సోమయాజుల వెంకటరామమూర్తి

౧

పోతరాజుగారికుటుంబం చూస్తే, కాపులలో మూడుతరాలనాటి నాగరికత గోచర మౌతుంది. ముసలిదానయ్య కౌపీనం విడిచిపెట్టినట్టి సహస్రమాస జీవి; అతనికుమారుడు అబ్బిరయ్య కౌపీనం విసర్జించి ముతుక రకం వడుకునూలుపంచ మోకాళ్లు దిగకుండా కట్టుకోవడం ప్రారంభించి పదిసంవత్సరాలు కావచ్చింది; ఇతడివయస్సు సుమారు ఏభై. మనకథానాయకుడు ఇతనికుమారుడే: పేరు సాధారణంగా 'పోతరాజు'; యింట్లో తండ్రికీ, తాతగారికీ 'పోతయ్య', 'పోతన్న'. పోతరాజు పెద్దింటి రైతుబిడ్డ. తండ్రికి ప్రథమ సంతానం; వయసు పాతికవత్సరాలు — నవయౌవనంలో ఉన్నాడు — దినభాగంలో సూర్యోదయంలాగూ, అబ్దచక్రగతిలో వసంతాగమంలాగూను. పోతరాజు అసలు నాజూకైనమనిషి. స్వయంగా తానో, భార్య అంకమ్మో వడికిన సన్నని నూలు నేయించుపంచా, అదే నూలులాల్చీ తొడుక్కుంటాడు. బాగా తెలుగూ, కొద్దిగా హిందీ నేర్చుకొని గ్రామంలోని తోడియువకులకందరికీ ఆదర్శప్రాయుడే కాకుండా నాయకుడు కూడాను. పోతరాజుసలహా లేనిదీ ఏముఖ్యమైనపనీ ఆ గ్రామంలో జరగదు. అతడు చెప్పినదేమాట. సుఖమైనస్వభావం, దానికి తగిన తెలివితేటలు, విద్యాబుద్ధులు అతనికి పెట్టని అలంకారాలు. మోటార్లు రావడంవల్ల పూర్వంకంటె పదిరెట్లు దగ్గరైన పట్నప్రవాసనకూడా ఉండడంచేత అతడికి టాకీ ప్రదర్శనాలు, రేడియో మొదలైనట్టి విద్య, విజ్ఞాన, వినోదదాయకములైన ముఖ్యవిషయాల్లోకూడా పరిచయంవుంది. రేడియోలో రైతుల వ్యాసంగాన్ని పట్నంలో విని తనకాపుజాతి ఎంతమట్టుకు వెనకపడివున్నదో అని దిగులుపడి, తనజాతిని ముందుకి తెచ్చే మార్గాలు ఆలోచించే సద్బుద్ధికలిగినవాడు. నాడు 'మాలపిల్ల' టాకీప్రదర్శనంలోని శంపాలత అమాయకత్వము, నిష్కాపట్యము చూచి హృదయం ద్రవించి, కన్నీరు కార్చిన కోమలస్వభావుడు. అంతేకాక ప్రాపంచిక నాగరికతాహర్మ్యానికి వ్యవసాయదారు డైన కాపే పునాది అని గుర్తెరిగిన స్వకులాభిమాని. వీటన్నిటికీ పైమాట హాస్యరసప్రధానమైన స్వభావంలో జనరంజకుడైన రసజ్ఞుడుకూడాను.

౨

గ్రామంలో గొప్పసభ. ప్రధానమంత్రిగారి రాక, పతాకోత్సవం, రేడియోప్రతిష్ఠాపన, రేడియోశ్రవణం, ఊరేగింపుటుత్సవం — ఇదీ నాటిసాయంకాలపు కార్యక్రమం. గ్రామంలోని ఆబాలగోపాలం సభకు వచ్చారు. మంత్రిగారి ఉపన్యాసం శ్రద్ధగా విన్నారు. "గ్రామీయుల పురోవృద్ధికీ, విజ్ఞానానికీ బాగా తోడ్పాటు కాగల దని యెంచి ప్రభుత్వంవారు పట్టణాల్లోనే కాకుండా ముఖ్యమైన గ్రామాల్లోకూడా ఈ 'రేడియో' లేక 'ఆకాశవాణి'ని అమర్చినారు. దీనిద్వారా కాలనియమానుసారంగా మీకు, భారతమాత ముద్దుబిడ్డలైన మీకు, ప్రపంచమంతటికీ ఆహారం పెడుతూన్న మీకు, ఉపకరించేటందుకున్నూ, విజ్ఞానం విస్తరించేటందుకున్నూ, కొన్ని ఉపన్యాసాలు, కొన్ని ఇతర వ్యాసంగాలు, పండితులచేతనైతే నేమి, పామరులచేత నైతే నేమి ఈ 'ఆకాశవాణి' ద్వారా వినికిడౌతుంటవి. చెన్నపట్నంలో చెప్పిన ఉపన్యాసం వెంటనే మీ గ్రామానికి వచ్చి ఎలాగు వినబడుతుందన్న సందేహం మీ కెంతమాత్రం అక్కరలేదు. విజ్ఞానశాస్త్రవేత్తలు, కనిపెట్టిన మహాయంత్ర మిది. ఆకాశంమీదనుంచి ప్రపంచం అంతటా ప్రసరించే శబ్దము కర్ణగోచరం అయేటట్టు చేసే ఈ 'రేడియోను' మీరు సద్వినియోగంచేసికొంటూ మీ మీ జ్ఞాన ప్రతిభను ఎక్కువచేసికొని, నలుదిక్కులా వ్యాపింపజేస్తారని నమ్ముతున్నాను...."

అని మంత్రిగారు చెబుతూంటే గ్రామస్థులంతా కాపు జనం యావన్మందీ చకితులై విన్నారు. ఉపన్యాసానంతరం మంత్రిగారు ఒక చిన్నమాట నొక్కారు. వెంటనే గాలి వీచినట్టు 'బస్' మని ఒక రొద, పిమ్మట ఆకాశంనుంచి పెద్ద గొంతుకతో ఒక ఉపన్యాసం వినిపించింది. అది డాక్టరు పిచ్చయ్యగారి 'కలరా' ఉపన్యాసం: "కలరా భయంకరమైనజాడ్యం. గ్రామాల్లో ఈ జాడ్యానికే 'గొట్టాలమ్మ' అని కూడా పేరున్నది. ......" అంటూ డాక్టరు పిచ్చయ్యగారు రేడియోలో చెప్పిన ఉపన్యాసం వినిన కాపుజనంయొక్క ఆశ్చర్యానికి అంతులేదు. మీదనుంచి శబ్దం వినిపిస్తూంటేకదా, ఆకాశమార్గాన్ని ఎవ్వరైనా ఉన్నారేమోనన్న భ్రమచేత నింగికి నాలుగు వైపులా దృష్టి నిగిడ్చి చూచాడు, ముసలి దానయ్య, తొలకరి మేఘానికి ఆత్రుతగా దృష్టి సారించే రైతుబిడ్డవలె.

దానయ్య: (కుమారుడు అసిరయ్యతో) "మీద మనుసులు లేరుగందా, ఈశబ్దం ఏటంటా? పెద్దోడా, ఇది 'ఆకాశోణి' అయితే, మీద మనుసులైనా వుండాల, లేకపోతే తీగెలపాసాగు, తివ్వలైనా వుండాలగదంట్రా!"

అసిరయ్య: "తీగలేదు, ఏటీలేదు, — గొట్టం భూమిలోంచి లెగిసిందిగనక, దీనికి 'భూవాణి' అన్న పేరు బాగుంటాదేమో, 'ఆకాశవాణి'కంటె."

మరొకముసలిరైతు: (దానయ్యతో) "చూసినావా, నేస్తం! బావిలోంచిగొట్టం, దానిమీద నాలుగు దిక్కులా కొమ్ముగొట్టాలు నాలుగు— అంతా గొట్టాలమయం! అందుచేత, నా నేటంతానంటే, ఇదీ 'ఆకాశోణి' కాదు, 'భూవోణి' కాదు, ఇది నిక్కచ్చిగా 'గొట్టాలమ్మవాణి' అందుచేతనే, తొలుతనే గొట్టాలమ్మగొడవతో ఆరంబం సేసింది."

దానయ్య: "మరైతే, మంత్రి ఇది జంతరమంటాడే!"

* * *

ఇంతలో 'రేడియో' కలరా ఉపన్యాసం కట్టిపెట్టి చల్లనిగీతం పాడడం ఆరంభించింది. అది సుబ్బారావుగారి 'ఎంకిపాటల'లోనిది ఒకటి. శ్రావ్యంగా, చల్లగా, కాపుజనం హృదయాల్ని కలవరపెట్టిందా గీతం. యువకులంతా శ్రద్ధగా విన్నారు. విని ఆనందించారు. బాలికలు పకపక నవ్వారు. నవోఢలు ముసిముసి నవ్వులు నవ్వుతూ ఇంటికి దారి తీశారు. నడివయసు స్త్రీలు ముక్కు మీద వేలేసుకుని ముఖముఖాలు చూసుకున్నారు. ముసలి అత్తగార్లు, "చే గింటి కల్లి గెంజి కాసండే" అని వాళ్లని మందలించారు. గీతం ముగిసిన పిమ్మట 'రామాయణకాలక్షేపం' వినిపించింది 'రేడియో.' కాపుజనమంతా భక్తిపరవశులైనారు. ఈవిధంగా 'రేడియో' శ్రవణంలోను, ఉత్సవంలోను, నాయకుల ఊరేగింపులోను, మంత్రిగారి వందనాలతోను సాయంకాలం గడిచిపోయింది. కాని, 'రేడియో' 'గొట్టాలమ్మవాణి' అన్నమాట ఊరంతా అల్లుకున్నది. పెద్దకాపుల గుసగుస లూరికేపోతాయా, మరి? బాలురు భయంతోనే నిద్రపోయారు. వృద్ధులు గొట్టాలమ్మకి తృప్తి అయ్యేటట్టుగా గ్రామంలో భజనలు చెయ్యమన్నారు. ముసలి ముత్తైదువలు, అర్ధరాత్రివేళ పానకం, పచ్చడిఅన్నం తీసుకెళ్లి రేడియో లౌడ్‌స్పీకరు మొదలున దిగదుడిచి పారేశారు. పోతరాజుమాత్రం గ్రామస్థుల మూర్ఖత్వానికి నవ్వుకున్నాడు. 'రేడియో' ప్రమాదకరమైన దేవతా, దెయ్యం కాదని వాళ్లకి నచ్చచెప్పడానికి అతనికి దండిగడియం పట్టింది: నాటి 'ఆంధ్రపత్రిక' తీసి చూచి, సాయంకాలం ఇన్నిగంటలకు ఈరేడియో కార్యక్రమం ఈవిధంగా వుంటుందనీ, అంతా హాయిగా వినవచ్చుననీ చెప్పి తిరిగీ సాయంకాలం అందరినీ రేడియోవద్ద చేర్చి వారికి భయంతొలగించాడు.

## 3

గ్రామంలో కాలం చక్కగా సాగిపోతూంది. అందరూ నిశ్చింతగా వారివారి పనులలో మగ్నులై, సాయంకాలం, మునిమాపుప్రొద్దులలో 'రేడియో' నిమగ్నులై హాయిగా వుంటూన్నారు — ఒక్కరు —గ్రామ పురోహితుడు విశ్వేశ్వరసోమయాజి తప్ప!- అసలు అతడు ఏయజ్ఞం చెయ్యకుండానే సోమయాజి అయినాడు తాతగారిపేరు పెట్టుకొని. గొప్ప స్వాభిమాని. దురహంకారం. సనాతనధర్మం చావకుండా

తానే నిలబెట్టిన శ్లాఘించే గర్వి. నూతనభక్తి తత్వం అతగానికి నచ్చవు. నచ్చజెప్పినా వినడు. ఒక్కనాడు రేడియో వినడానికి రాలేదు. దానికి మరో కారణం కూడా వుంది. ఈ 'రేడియో' వచ్చినప్పట్నుంచీ, అతగాడి పురాణకాలక్షేపం వినడానికిగాని, ఇతర వెర్రిమొర్రి వేదాంతపుకబుర్లు వినడానికిగాని గ్రామంలోని పిల్లలు, పెద్దలు బొత్తుగా రావడం మానేశారు. ఇక నేముందీ, సోమయాజిగారిని అసూయా దేవత, లోభదేవతా, రెండూ ఒక్కసారి ఆవేశించినాయి. తన పురాణం భక్తిటపురాణమై మూల పడడంచేత తనకు చిక్కవలసిన నాలుగు డబ్బులు చిక్కవాయె,—పాపం, అసలుకే వచ్చింది ప్రమాదం. అతడు కోపపూరితుడైనాడు. సహజమైన ఆత్మస్తుతి, పరదూషణ ప్రారంభించాడు. "బ్రాహ్మణద్వేషం ప్రబలమైపోయింది. భక్తి, శ్రద్ధా, యిడీ, బొత్తుగా అంతరించిపోయాయి. భారత భాగవత రామాయణాది మహాపురాణములు సాంగోపాంగముగా చదివి, జీర్ణించుకున్న ముండాకొడుకుని నన్నే ధిక్కరించేస్తూంటే, వీళ్లకి తక్కినవాళ్లు లెక్కేమిటి? అయినా ఈ 'రేడియో' ఏం వచ్చిందోకాని గ్రామం పూర్తిగా పాడైపోయింది. వర్ణసంకర ప్రభుత్వం ఎలాగుందో ఈయంత్రాలూ, ఈ తంత్రాలూ, తందానపదాలూ అలాగే వున్నాయి. అన్నింటికీ 'రేడియో'నేనట! ప్రపంచ పరిస్థితు లేలాగుంటాయో తెలుసుకోవటందుకూ, పంచాంగం అక్కర్లేదట! అవి ఏరోజు కారోజు రేడియోలో వస్తాయట! ఇక శాస్త్రం వస్నెవ్వరూ అడగరట! అదీ ఆ రేడియోనే చెబుతుందిట, వీళ్ల రేడియోముండా! హరికథలు చెబుతుందిట, పురాణం చెబుతుందిట, వాళ్ల పిండం చెబుతుందిట,—రేపు వాళ్ల యిళ్లల్లో శ్రాద్ధాలకి మంత్రంకూడా చెబుతుంది కాబోలు!" అని తలపోసుకొని, రేడియో ప్రతిష్ఠ అయిన మరుచటివారంనుంచీ 'రేడియో'కి వ్యతిరేకంగా ధ్వజం ఎత్తాడు. నలుగురు ముసలాళ్ల సిబ్బందిని తయారుచేశాడు. వాళ్లని కూర్చోపెట్టుకొని, రేడియో ఒక గొప్ప ప్రమాదకరమైన వస్తువనీ, నాడుకంకుని బొందెలోని ప్రాణాలు తియ్యడానికిదే మూలకారణమనీ, ఈయంత్రాలన్నీ మన పూర్వులకు తెలియనివి కావనీ, పూర్వులు నేటి మరకుంకాయలకంటె మేధాసంపన్నులనీ, వారికి అన్ని యంత్రాలు తెలిసినప్పటికీ, వానివల్లనుండే ప్రమాదం గుర్తెరిగి వాటిని ఆచరణలోకి తేలేదనీ, భరతఖండం సాత్త్వికసాంప్రదాయమైనదనీ, ఈదేశానికి రజోగుణప్రధాన్యములైన ఈ యంత్రాలన్నీ అరిష్టకారణాలనీ,— అర్థంలేనివి కొన్నీ అర్థం ఉన్నవి కొన్నీ ముక్కలు సుబ్బిసెట్టి, రామిరెడ్డి మొదలైన తన అనుచరులకు గట్టిగా దమాయించి చెప్పడం ఆరంభించాడు. సోమయాజి రేడియో మీదనే కాక అందరిమీదా ధ్వజం ఎత్తి తిడుతూన్నవార్త, గాలివార్తగా మన పోతరాజు చెవికిసోకింది. ఇక నేముంది!—వచ్చింది సంఘర్షణ - పూర్వాచారాలకీ, ఆధునిక విజ్ఞానానికీ; పురాతన భక్తికీ, నూతన భక్తికీ; వృద్ధాప్యానికీ, యౌవనానికీ; జడత్వానికీ, ఉద్రేకపూరితమైన సంచలనానికీ; పాతకీ, క్రొత్తకీ;— ఆ గ్రామంలో రాపిడి సంభవించింది. అగ్నిపడింది, జ్వాలగా పరిణమించి వ్యాపించింది. బ్రాహ్మడి అసూయ బట్టబయలయ్యేటట్లు పోతరాజు గ్రామంలో ఉపన్యాసం చెప్పాడు. ఈసంగతి సోమయాజులు యింట్లో వుండే, విని హుంకరించి వూరుకున్నాడు, తాత్కాలికంగా. కాని తగిన సమయంకోసంమాత్రం నిరీక్షిస్తూనే వున్నాడు.

## ౪

ఈ సందర్భాల్లో పోతరాజు పలుకుబడి గ్రామంలో మరీ రెక్కువై పోయింది. సబబుగానూ సహేతుకంగానూ మాట్లాడితే ఎవ్వరికి నచ్చదుగనుక? బాలురు, యువకులు, వృద్ధులుకూడా పోతరాజు పక్షాన్నే వున్నారు.

సంక్రాంతిపండుగ నాలుగురోజు లుంది. సంక్రాంతి, తక్కినవాళ్ల కేమోగాని, సోమయాజికి మాత్రం నిజంగా పండుగే. అతడికి నాలుగు వరహాలు దొరికేసమయ మది. అంతవరకూ వీధిచావడి ఎక్కని సోమయాజి ఆనాడు వీధి అరుగుమీదే కూర్చున్నాడు సగర్వంగా. ఎదురింట సుబ్బిసెట్టిగారి సావడిలో సెట్టి కొమును లెక్కలు రాసుకుంటున్నాడు. సోమయాజి పొడుం పీల్చి, "సంక్రాంతి వస్తుందికదా- ఈకుంత

లంతా పెద్దలకి పెట్టడంఅదీ వుందికదా- నాడు సంకల్పానికి నన్ను పిలవకాపోరు, అప్పుడు వీళ్ల పెద్దలకి విలికిరైనట్టు వీళ్లతాడు పుటుక్కున తెంచకాపోను" అని గట్టిగా గద్దించాడు, సెట్టికొడుకువైపు చూచి. సెట్టికొడుకు అప్పటికి ఊరుకున్నా, మధ్యాహ్నంలోపున ఆకబుర్లన్నీ పోతరాజుకి టపా కట్టాడు.

శెట్టికొడుకు: సంక్రాంతినాడు మన అందరి పీకలూ నొక్కుతానని తాటిస్తున్నాడు పురోహితుడు.

పోతరాజు: మన యిళ్లకి రానంటాడా లేమిటి, మన పెద్దల్ని తరింపజేయడానికి ?

శె. కొ: మరే మనకందరికీ బుద్ధి వచ్చేపాఠం చెప్పే సమయం వచ్చిందని మురిసి పోతున్నాడు, బ్రాహ్మడు.

పో: కానీ, అదేదో మనమూ చూద్దాం. రాకపోతే చెడిపోయిం దేమీలేదు. బ్రాహ్మడు మనయిళ్లకి రాకపోయినంతమాత్రాన్ని మన పెద్దల ఉత్తర గతులు అరికట్టబడతాయని నా కింతమాత్రం నమ్మకం లేదు. మన పెద్దలపూజ సంక్రాంతి నాడు మనసారా మనమే చేదాం. నిర్మలమైన హృదయాలతో వారిని మనమే కొలిచి ఆరాధించుదాము. బ్రాహ్మడికి చెల్లించవలసిన సుంకమే మనకి మిగిలిపోతుంది. ఈ విషయం నేటి సాయంకాలమే ఒక బహిరంగ సభచేసి అందరికీ తెలియపరుద్దాం. మీ నాయన నేమీ భయపడవద్దని చెప్పి బందోబస్తు చెయ్యి, పైచర్య నేను జరిపిస్తాను.

నాటి సాయంకాలం పెద్దసభ జరిగింది. బ్రాహ్మడు మామూలుగా సంక్రాంతినాడుదయం యిళ్లకి వస్తే సరి, లేకపోతే ఎప్పటికీ పిలవకూడదని తీర్మానించారు. అంతేకాక, సంక్రాంతినాటి ఉదయం సరిగా ఎనిమిది గంటలకు, గ్రామంలోని జనం అంతా 'రేడియో'మండపమువద్ద సమావేశమై, పోతరాజు, తదితర ముఖ్యుల ఉపన్యాసాలు విని, వారిపూర్వ పురుషుల పూజ- అర్థం తెలియని మాటలలో కాకుండా, అర్థం విశదంగా తెలిసే ముక్కలతో - కలిసి చెయ్యడానికి నిశ్చయించారు. ఈవార్త కర్ణాకర్ణిగా సోమయాజులుగారికి కూడా తెలిసింది. తెలిసి అతడు మరింత బిర్రబిగిసి బెట్టు సరిచేశాడు.

అహంకార ప్రవాహంలో కొట్టుకు పోతూన్న బ్రాహ్మడికి యుక్తాయుక్తవిచక్షణత లేకపోయింది. దెబ్బ తిన్న త్రాచవలె బుసకొట్టడం ఆరంభించాడు. తనకాళ్లు పట్టుకుంటేనేకాని బ్రతికివున్న వారికీ, లోకాంతరగతులైనవారి ఆత్మలకీకూడా గతిలేదన్న గాఢమైన దుర్భ్రమలో పడిపోయాడు. వారిఆత్మలకు స్వర్గద్వార ప్రవేశము చేయించే తాళంచెవి తానే ననుకున్నాడు. పెద్దలను పాపపంకిలంనుంచి లేవనెత్తే చేయూత, పట్టుగొమ్మ, తానుతప్ప మరెవ్వరూ లేరనుకున్నాడు. ఎంతటిమూర్ఖత! ఎంతటి తెలివిహీనత!

తెల్లవారింది, నాడే సంక్రాంతి, మహాపవిత్రమైన దివసము. గ్రామస్థులంతా ఒక్కసారి తనకు పాదాక్రాంతులై, గడ్డికరిస్తేనేగాని, వీధి గుమ్మంలో అడుగు పెట్టనని భీష్మించుకు కూర్చున్నాడు, యింటి చావడిలో, వీధి తలుపు తెరచుకొని సోమయాజి, సుమారు ఎనిమిది గంటలవేళ. గ్రామస్థులు, సాయంత్రం చేసుకున్న తీర్మానంప్రకారం 'రేడియో'మంటపానికి పయనమైనారు. సోమయాజులుగారి గుమ్మంలోనుంచే వారిదారి. తన్ను బ్రతిమాలుటకే వారు వస్తున్నారని భ్రమించాడు బ్రాహ్మణుడు. కాని, జనం తన యిల్లు దాటి సాగిపోగానే, హతాశుడైనాడు.

సరిగా ఎనిమిదిగంటలవేళ, —కాకతాళీయంగా 'రేడియో'లో ఆవేళకి'సంక్రాంతి'మీదనే ఉపన్యాసం. తదనంతరం 'స్పెషల్ ప్రోగ్రామ్'. ప్రసిద్ధ ఆంధ్రపండితులు, నారాయణశాస్త్రిగారి సంకల్పం- ఆపైని వేదాంతగోష్ఠి- గ్రామస్థుల సంతోషానికి మేరలేదు. ఉత్సాహంతో ఉప్పొంగిపోయారు. వారు ఇట్టి సుముహూర్తంలో తమ పెద్దల్ని తలుచుకొని, నీళ్లచుక్కలు వదిలి పెట్టడమే గొప్పసంగ తనుకున్నారు. గ్రామపురోహితుడి తలంపే వాళ్లకి లేకపోయింది. "మహానుభావుడు, సంకల్పం చెప్పాడు రేడియోలో; మనం ఆచరించాము భక్తిపూర్వకంగా; నేడు సుదినం. 'రేడియో' ప్రభావం వల్ల నేటి సంక్రాంతి, ఎల్లరకూ సంతృప్తిగా జరిగిపోయి

వందుకు ఈశ్వరునికి ధన్యవాదాలు" అని పోతరాజు నాటి ఉదయం కార్యక్రమం ముగించినాడు. జనం అంతా ఆనందంతో ఎవరి గృహాలకి వాళ్లు చేరిపోయారు.

సోమరాజులుగారి భార్య గుమ్మంలోనే నిలబడి జనాన్ని చూసి, లోపలి కెళ్లి భర్తతో "ఆఖరికి మీ అహంకారమే మీకు మిగిలింది కాని, కొసంతలాభం లేకపోయింది. మీ అహంకారమూ, మీరూ నన్ను-ఎప్పుడూ ఇంతే! గ్రామస్థుల మీదను అలిగి జాగ్రకున్న వేసుంటి! ఏదోవిధంగా జనంతో రాజీ చేసుకోండి; లేకపోతే ఇక్కడ్నించి మకాం ఎత్తేయవలసి వస్తుంది" అన్నది. "నాకేదు పేరో నే నే చేస్తాను, మధ్య లోపలి కెళ్లు" అన్నా డాయన ముఖం చిట్లించుకొని. బ్రాహ్మడు జరిగిన పరాభవం హృదయంలో నాటించుకున్నాడు. పశ్చాత్తాపం పొందినాడు.

మరునాటి నుంచీ, అందరితో పాటు 'రేడియో' మంటపానికి తానూ పయనమయేవాడు ఆయన.—

రెండు నెలలు గ్రుడువ తిరిగేసరికి మళ్లీ బ్రహ్మశ్రీ విశ్వేశ్వర సోమరాజులుగారికీ, గ్రామస్థులకీ పూర్తిగా రాజీ కుదిరిపోయిందని వింటున్నాం.



# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్లవారికి ఈనెల భారతి (1939 సం. ఫిబ్రవరి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1939 సం మార్చి 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన బ్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

A 6, 17. B 3, 24. H 33. L 14. P 51, 52, 53. S 48, 49, 54, 73, 75, 139, 150, 151, 152, 153, 154, 155, 156, 157, 158. T 1. V 42. Y 3.

# లోటు

జనమంచి కామేశ్వరరావు

ఎంతో ఒత్తుగ నిరుడు
తురుముకొన్న తురాయి,
ఈయేడు యి ల్లేల
చిన్న బోయింది ?

ఎంతో తడిగా నిరుడు
ముద్దు లొసగిన ప్రేమ,
ఈయేడు యి ల్లేల
పెదవి విరిచింది ?

ఎంతో బాధతో నిరుడు
పదను పెట్టిన బ్ర [illegible]కు
ఈయేడు యిల్లేల
బండబారింది ?

---

# స్వాతి చినుకు

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ఉన్నతాభ్రపథంబున నుండలేక
చేరుచుంటి నపార గంభీర జలధి
నచ్చటి తరంగమాలికలందు నెచటొ
పేరు నూరును లేక జీవింపవలయు.

నా పురాకృత భవ్య పుణ్యంపుమహిమ
చేర్చె నన్నొక ముత్తెపు జిప్పయందు
నమితలావణ్యపు న్ముత్తియంబ నైతి
ఫలము లేదొకొ సత్సంగవశత జగతి.

ఇపుడు కాలక్రమంబున నిందుముఖియు
రక్తనలిక విహరింతు, తత్ప్రాణవిభుని
హృదయమున సంతసంబు రేకెత్తునట్లు
నావిలువను గ్రహించుమానవులు గలరు.

---

# మాదన్నగారి విదేశాంగనీతి

కే. వి. భూపాలరావు

చరిత్ర పరిశోధకులమార్గము కంటకావృతము; అభేద్యము కూడాను. చరిత్రయందలి ముఖ్యవిషయముల నిర్ధారణగ చర్చించి ఫలితమును స్థిరపరుచు పురాతనాధునిక గ్రంథ బాహుళ్య మున్నను దైనందిన పరిశోధన ఫలితములవలన ఏతద్విషయయాథార్థ్యము సందేహాస్పదమగుచు వచ్చుచున్న దని, గ్రంథస్థము గానట్టియు, లేక స్వార్థపరులవలనను, ఈర్ష్యాళువులవలనను, సామ్రాజ్యవాదుల వలనను అనృత, అసత్యకల్పనలమధ్య బిగించబడి గ్రంథస్థము చేయబడిన వస్తువు లేక వ్యక్తినిగురించి శోధించబూనుట యెంతయు సాహసము! ఇట్టి వ్యక్తులలో అగ్రతాంబూలము బ్రహ్మశ్రీ పింగలి మాదన్న గారి కిచ్చుటకు కురుపితామహు ననుజ్ఞ గాని, శిశుపాలుని యభ్యంతరము గాని అవసర లవలేశములు లేవు.

మాదన్నగారు ౧౬౪౮-వ సంవత్సరమునకును ౧౬౫౩ - వ సంవత్సరమునకును మధ్య గోలకోండ ప్రభుత్వోద్యోగములో ప్రవేశించిరి. మొదట వీరు మీర్ మహమ్మద్ సయీద్ మీర్ జుమ్లాగారి భూమ్యాదాయ శాఖలో సాధారణోద్యోగిగా ప్రవేశించిరి. మీర్ మహమ్మద్ సయీద్ మీర్ జుమ్లా కావించిన స్వామిద్రోహకార్యమందు వీరు పాల్గొనలేదు. విషమపరిస్థితులలో ధైర్యముగ శ్రమకోర్చి సేవాధర్మమును నిర్విఘ్నముగ కొనసాగించుచు క్రీ. శ. ౧౬౬౮ – ౧౬౬౯ -వ సంవత్సరము వరకు గోల్కొండ సర్వసైన్యాధ్యక్షుడును ఎక్కువ పలుకుబడికలవాడును అగు సయ్యద్ ముజప్ఫర్ వద్ద పేష్కారుగ నియమింపబడిరి. క్రీ. శ. ౧౬౭౨ నాటి విప్లవములో అబుల్ హసను తానీషాను సింహాసనాసీనుని చేయుటలో ఈ బ్రాహ్మణ సోదరులు ముజప్ఫర్, మూసాఖానులతో సమానముగ పాటుపడిరి. సయ్యదు ముజప్ఫర్ మూసాఖానులు తమసేవకు ప్రతిఫలముగ మీర్ జుమ్లా, సరెఖేల్ (సైన్యాధ్యక్షు) పదవుల నధిష్ఠితులైరి. మాదన్న గారిప్పుడు ప్రభుత్వపు దివానుగాను, అక్కన్న గారు వారికి పేష్కారుగాను నియమింపబడిరి.

క్రీ. శ. ౧౬౭౨ మేనెలనుంచి ౧౬౭౩ డిశంబరువరకు సయ్యదు ముజప్ఫరు నిరంకుశముగ ప్రభుత్వముచేయుటయేగాక, అతనిలో 'పాదుషా తన కనుసైగల ప్రవర్తించవలయు'నను అభిలాష దినదినప్రవర్ధమానమగుచుండుట నిశితబుద్ధియగు పాదుషా కనిపెట్టెను. మూసాఖాను ముజప్ఫరుల పరస్పర ద్వేషములు మెండగుచు రాజకార్యములకు ముప్పుదెచ్చుచుండుటచే సుల్తాను అబుల్ హసన్ మాదన్న గారిసాయమువల్ల ముజప్ఫరుసైనికులను తదితర ఉమ్రావులను లోబర్చుకొని ఒకనాటినిండుసభలో ముజప్ఫర్ అవజ్ఞతను సభికులకు సాకల్యముగ తెలిపి అతనిని పదభ్రష్టునిజేసి మాదన్న గారిని ఆ పదవియందు ప్రతిష్ఠించి గౌరవించెను. అక్కన్న

మరల మాదన్నగారిపేష్కారుగ నియమితుడయ్యెను. ఈ ప్రకారము మాదన్నగారు ప్రతికూలపరిస్థితులలో, స్వామిభక్తికి కొరతరానీక సేవచేయుచు మెల్లమెల్లగ అభివృద్ధిగాంచుచు తుదకు గోలకొండ ప్రభుత్వ ప్రధానిగ నియమింపబడిరి. కొందరనుకొనునట్లు వీరు అప్పటి కప్పుడు ప్రధానిగ నియమింపబడి యుండలేదు. అటుగాక వీరు ఒక్కొక్కమెట్టు యెక్కుచు క్రమముగ ఈ ఉన్నతపదవి నలంకరించిరి.

క్రీ. శ. ౧౬౩౬వ సంవత్సరమునుండి గోల్కొండప్రభుత్వమునకు ఏదోయొకరీతిగ ఢిల్లీ మొగ్లాయిదర్బారుతో సంబంధములు గుచు వచ్చెను. క్రీ. శ ౧౬౩౬ సంధిసూత్రము ననుసరించి గోల్కొండ ఢిల్లీసమ్రాట్టుకు కప్పముక్రింద రెండులక్షల వరహాలను చెల్లించుచు లోబడి యుండవలసివచ్చెనది. ౧౬౫౬వ సంవత్సరపుయుద్ధమునకు పిదప గోల్కొండ రాజకీయపరిస్థితులు పూర్తిగ తల్లక్రిందైనవి. మొగ్లాయివారు యుక్తిగ గోల్కొండ భాండాగారమును గుల్లచేయుచు గృహ విషయములలో కల్పించుకొనుచు రాజద్రోహులకు చేయూతనొసంగుచు దానిని నిర్వీర్యముగ జేసివైచిరి. మొదటినుంచియు మొగ్లాయిరాజ్యాంగప్రధాన ముఖ్యసూత్రము దక్షిణమునయున్న స్వతంత్ర రాజ్యములను కబళించుటయె. ౧౬౩౬ తర్వాత ఆదిల్షాహి, ఖుతుబ్షాహి రాజులు దీనిని గ్రహించిరి. అప్పటినుంచి వారు పరస్పరము వివాహాది సంబంధములద్వారా తమమైత్రిని దృఢపరుచుకొనుచు శత్రువుతో పోరవలసివచ్చినప్పుడు తమతమ సైన్యముల నొండొరులకు సాయముగ బంపుకొనుచుండిరి. ఇంతలోనే (శ్రీ) శివాజీమహారాజుకూడ రంగములో ప్రవేశించెను. ఈవిధముగ ఈ ముగ్వురి దృక్పథము, ఆశయము (అనగ తమవ్యక్తిత్వమును మొగ్లాయివారి బారినుండి కాపాడుకొనుట) ఒకటె గనుక వారు మొగ్లాయి ప్రభుత్వమునకు వ్యతిరేకముగ ఒకరి కొకరు సాయము చేసుకొనుచు వచ్చిరి.

ఈ మూన్నుజీవితము, అనగా ఒక నియమమునకు కట్టుబడియుండక ప్రభుత్వమునకు అలజడి కలిగించునదిగ నుండెను. సైన్యము క్రమశిక్షణరహితమై స్థాయి (Standing) గాక జమీందారి (Feudatory) నుండెను ఈ ప్రకారము మాదన్నగారు ప్రధానిగాకపూర్వము గోల్కొండ సైనికముగను, ఆర్థికముగను, రాజకీయముగను, అంతరంగిక, విదేశాంగనీతివిషయములపైనము ఎంతహీనముగ నున్నదో పాఠకులు గ్రహింపగలరు. ప్రస్తుతము పైన పేర్కొనబడిన విషయములలో, విదేశనీతినిగురించి మాత్రమె దిగువ క్లుప్తముగ చర్చింపబడును.

మాదన్నగారి విదేశాంగనీతినిగురించి తెలుసుకొనవలయునన్న వారు విజాపూరు మహారాష్ట్రులతో నొకవైపును, మొగ్లాయి సమ్రాట్టుతో మరియొకవైపును ఏట్టిసంబంధ బాంధవ్యములు కలిగియుండిరో తెలుసుకొనుట ముఖ్యము. ఇంతేగాక వీరలలో వీరు పరస్పరము సంబంధ, సహాకారములు చేసికొనవలసిన యవసరమును గ్రహించుటకు గోలకొండ యెల్లలను, వాటినైజమును, ఎల్లల పరిసరప్రాంతములందలి పరిస్థితులను గ్రహించుట ముఖ్యతరము.

గోలకొండరాజ్యమునకు ఉత్తరమున మొగ్లాయివారును, పడమర బీజాపురమును,

దక్షిణమున కర్ణాటకమును, తూర్పున సము ద్రమును కలవు. మొదటిమూడును సహజ సంరక్షణరహితములై ఎల్లప్పుడును శత్రువుల ఆక్రమణమునకు వీలుగ నుండెను. తూర్పు జలమయము. పరంగివా రిప్పు డిప్పుడే వర్తకము సాగించిరి. కాని వారి వక్రవర్త నము మాదన్నగారికి తెలియవచ్చుచునే యుండెను. జలగామియగు సైన్యము గోల్కొండనవాబుకు చాలినంత లేకుం డుటచే పరంగివారిని సైనికశక్తిగ వృద్ధిజెంద కుండునట్లు చూచుటయేగాక విదేశీయుల కావశ్యకములగు నుచితగౌరవ సౌకర్య ములుగూడ సమకూర్చవలసియుండెను. ఇట్లు ఉత్తరమున మొగ్లాయివారినుండియు, పడమర విజాపుర, మహారాష్ట్రుల నుండియు, దక్షిణమున కర్ణాటకమందలి అరాజకమువల నను, తూర్పున పరంగివారి నౌకాబలము వలనను అపాయమున కవకాశములు బహు శముగ నుండెను. ఫ్రెంచివారితో విరోధము మెండు. వీటి నన్నిటిని పరిచూచుకొనుచు రాజ్యచక్రమును సక్రమముగ నడుపవలసిన బాధ్యత మాదన్న ప్రధానిఘనభుజములపైని మోపబడెను. మిణుకుమిణుకు మనుచున్న గోలకొండ దీపకళిక, - ఘోర ఝంఝా మారుతమున నుద్రూతలూగుచు ఇప్పుడో ఇంక నొక క్షణమునకో అగాధపారావార మున మునుగనున్న మహానౌక, - మరణ శయ్యపై పొరలాడుచు దుది శ్వాసను బీల్చు చున్న అట్టి దక్షిణ ఖుతుబ్షాహి స్వతంత్ర రా జ్యమును త్రయోదశవర్షములపాటు విపరీత ప్రతికూల పరిస్థితులలో అతులిత మేధావిశేష మున నడపించిన మాదన్నామాత్యునకు ధన్యవాదములివ్వకుండ నెవ్వ రుండగలరు?

మొగ్లాయిలతో యుద్ధము పొసగినపు డెల్ల విజాపురి గోల్కొండలు పరస్పరము సైనిక సాహాయ్యము చేసికొనుచుండుటను మనము పైన గమనించియే యున్నాము. క్రీ. శ. ౧౬౭౭లో కూడ అదేప్రకారము మాదన్నగారు బహుళసైన్యముతో తమ యాధిపత్యమున గోలకొండకు సాయచేయ నరిగిరి. కాని మొగ్లాయిసైన్యాధ్యక్షుని మం తనమువల్ల అతడు తిరిగిపోయెను. ౧౬౮౧ వరకు విజాపురమునందు విపరీతముగ కక్షలు అంతర్యుద్ధములు మితిమీరుటచే, నచ్చటి అమీరు లందరును అబుల్హసనును తీర్పు చేయ ప్రార్థించిరి. ఈ తీర్పు ననుసరించి విజాపురవిదేశసీతిని సక్రమపద్ధతులపై నడుప అక్కన్నగారు నియమింపబడిరి. ఇట్లు గోల్కొండ విజాపురముల విదేశాంగనీతిని మాదన్నగారే నడుపుచువచ్చిరి.

గోలకొండదక్షిణమున కర్నాటకమందు విపరీతమగు అరాజకము ప్రబలుచుండెను. తంజాపూరుమొదలుగాని పశ్చిమకర్నాటక మందలి విశేషభాగము షాజీకొడుకగు ఏకోజీ పాలనకు లోబడియుండెను. అయినను పరి పాలనాదక్షతలేమి నచ్చటిపరిస్థితులు భయం కరముగ మారుచుపోయెను. నారాయణ రావు హనుమంతెయొక్క ప్రోద్బలముపై శ్రీ శివాజీగారు దానిని ఆక్రమించదలచిరి. ఆయన విజాపురరాజ్యముగుండ పోవుటకు పరిస్థితు లనుకూలించినవి కావు. గోలకొండ ద్వారా పోవలసియుండెను. అబ్దుల్లా ఖుతుబ్షా కాలమునుండియే పరస్పరసహాయము చేసి కొనునట్లు ఒడంబడికయుండెను. దానిని మా దన్నగారు మరల పునఃప్రతిష్ఠించిరి. వారి యాహ్వానముపై ౧౬౭౭ లో ఛత్రపతి

శివాజీ గోలకొండకు వచ్చెను. మరల నొక సంధి జరిగెను. దానిప్రకారము అబుల్ హాసన్ ౫౦౦౦లు శతఘ్నికాసంచయమును, తుపాకిసైనికులను, మరియు శివాజీసైన్యమునకు నిత్యము ౩౦౦౦ హొన్నులను ఇచ్చుట కంగీకరించెను. ఇందుకు ప్రతిఫలముగ శివాజీ తనతండ్రి జాగీరమైనహో తాను జయించినకర్నాటకరాష్ట్రములోనియొకభాగమును గోల్కొండకు ముట్టజెప్ప నంగీకరించెను. మరియు ఒకలక్షహొన్నుల వార్షికమునకు బదులు అవసరసమయములందు శివాజీ, అబుల్‌హాసనుకు సైనికసాహాయ్యముచేయుట కొడంబడెను. ఇవ్విధముగ మాదన్నగారు శివాజీదో పిడిచేతులను సంధినిగళములచే బంధించి మహారాష్ట్రపుబందిపోటు బారినుండి గోల్కొండను రక్షించుటయెగాక, గోలకొండస్వాతంత్ర్యరక్షణలో మహారాష్ట్రశక్తిని ముఖ్యాయుధముగ మార్చి తనవిశేషరాజనీతిని చాకచక్యముగ ప్రదర్శించిరి. మాదన్నగారిపై రెండభియోగములుకలవు. ఒకటి వీరు తనయేలికలాభమునకు విరుద్ధముగ శివాజీకి సాయముచేసె ననుట! రెండవది మాదన్నగారు తనరాజును అవురంగజేబుకు నమ్మ ప్రయత్నించెననుట!! సంశయాత్ములు దయచేసి సంధిసూత్రముల శ్రద్ధగ పఠించిన మొదటియభిప్రాయము మార్చుకొందురని నమ్ముచున్నాను. అదియుగాక పొదిలి లింగన్నగారు ౧౬౮౩ లో చిక్కనాయకంపటం, బన్వపటం అనురెండుపట్టణములను మాదన్నగారి యాజ్ఞప్రకారము మహారాష్ట్రులను నిర్జించి కైవసముచేసికొనిరి. కనుక మాదన్నగారిని సందేహించునవకాశము గానరాదు. రెండవది యెంతనిరాధారము అంతకన్న యెక్కువ హాస్యాస్పదముకూడను.

అవురంగజేబు ౧౭-వ శతాబ్దమందు పేర్కొనదగిన భారతముస్లిము మతాభిమాని. పరమతసహిష్ణుత శూన్యము. హిందూమతము సంప్రదాయము విజ్ఞానము నాగరికతల కతడు బద్ధవిద్వేషియనుట జగద్విదితము. తాతతండ్రులనాటినుండి వచ్చుచున్న మత సహిష్ణుత మటుమాయమై జిజియా పన్ను మొదలగు నిర్బంధములు హిందువులపై మరల ప్రయోగింపబడెను. హిందువుల ఔన్నత్యము అతనికి కంటకము. అతడు దక్షిణములో హిందువుల స్వాతంత్ర్యమును నిర్మూలింప దృఢసంకల్పుడై యుండెను. మాదన్నగారి కీవిషయము బాగుగా తెలియును. అదియునుగాక, తమ కత్యంత మహోపకారియు, విశాల హృదయుడును హిందూ-ముస్లిం ప్రజలను సమదృష్టితో జూచువాడునగు తానీషాప్రభువును, ఇట్టిగుణము లేవియు లేనివాడేకాక హిందువులకు బద్ధద్వేషికూడనగు ఔరంగజేబున కప్పగించుటలో వారలూహించగలిగిన ప్రతిఫల మేమి? పారసీకగ్రంథములు మాదన్నగారికి వ్యతిరేకప్రచారము చేయుటలో ఎట్టికొరతయు నుంచలేదు కాని విశేష మేమన వారు మాదన్నగారి పరిపాలనావిధానమందలి బాగోగులను గురించిగాని లోటుపాటుల గురించిగాని యొకయక్కరమైనను వ్రాసినపాపాన పోలేదు.

ఐరోపా దేశస్థులను మాదన్నగారేతీరున అదుపుఆజ్ఞలలో నుంచిరో విపులముగ వ్రాయువలయునన్న ఒకపురాణ మగును. ముఖ్యముగ మనము గమనించవలసిన విష మేమన వీరుయు నిష్కర్షగ నిశ్చలముగ

గోలకొండ యధికారమును ఎంతయు నొప్పించిరి. ఈ సందర్భమున పొడిలి లింగన్న యెంతయు ప్రశంసార్హుడు. మాదన్నగారి యీనిశ్చలత్వము ఐరోపీయులకు నచ్చలేదు. అందుచే వారు తమయిష్టమువచ్చినట్లు వారిని దూషించుచు వ్రాసిరి. కాని ౧౬౮౧ లో వారే మాదన్నగారిని ఎంతయు కొనియాడుచు వ్రాసినారు. దీనినిబట్టి తేలునదేమన? తుదకు ఆయిరోపీయులుకూడ గోలకొండప్రభుత్వమునకు లోబడి నియమబద్ధులైరి. అని అందువల్ల మాదన్నగారు వారి నాదరించిరి.

మాదన్నగారివిషయమున పరిశోధించి తేల్చవలసిన దెంతయొ కలదు. ధనము, అవకాశముగల పక్షపాతరహితులయిన పరిశోధకులు బయలుదేరి వీరినిగురించి ఇంకను ముఖ్యవిషయములు పాఠకలోకమున కెరుకపరిచెదరుగాక.

---

# కాంక్ష

కందుకూరి రామభద్రరావు,

మావిలేమ్రాఁకులీరున జీవితంబు
పూయ నామూలచూడంబు, పొంగిపోయి
పండ్లకారు సంపదలకై ప్రాతిపదిక
మొదవె నని లోన నువ్విళులూరినాను.

కప్పుకొని రాఁగ హేమంతకాలనిశలఁ
దేనెపాగమంచుతెర లెన్నొ, తేఱుకొనుచు
శైశిరానిలపరిరంభ సౌఖ్యమునకుఁ
బైరుకొంటి శలాటుకాభరము దాల్చి.

ఉత్తర దిశాంతరమ్మున నుఱిమి, చిఱుత
మబ్బు తోఁచెనయేని తబ్బిబ్బుపడుదు
ప్రళయకాలవాత్యాహతి భాగ్య మెల్ల
దులుచుకొనిపోవ మ్రోడయి నిలుతు ననుచు.

నిండు వైశాఖపూజల నీదు మ్రోలఁ
బలుకఁబాఱెడి జాడలు పాదుకొనిన
కాపునంత నివేదించు కాంక్షతోడఁ
దడవుకొందు నీయభయహస్తమ్ము కొఱకు.

---

# క్రీడావనము

బి. కుప్పుస్వామి

[పాఠశాలకు వెళ్లే యీడు రాని బాల, బాలికలను గురించి శ్రద్ధతీసికోవడము చాలా అవసరమని ఇప్పుడిప్పుడు యూరోపు దేశాలలో గుర్తిస్తున్నారు. అందువలన బాల, బాలికల జీవితానికి సంబంధించిన అన్ని విషయాలలోను విపులంగా పరిశోధనలు జరుగుతున్నవి. అందులో పిల్లల ఆటలను గురించి గ్రూస్, హాల్, ఫ్రోబెల్ మొదలయిన వారు పరిశోధనలుచేసి ఎన్నెన్నో సిద్ధాంతాలు—పిల్లల ఆట భావిజీవితానికి తయారీ అనీ, అవసరమైన దానికంటెను అధికంగా ఉండేశక్తి అనీ ఏమేమో సిద్ధాంతాలు—చేశారు. పిల్లల వికాసానికి ఆట ముఖ్యావసరం అనేదిమాత్రం రూఢీ అయినది. పిల్లలు పొందే ప్రతీవిధమయిన వికాసమూ ఆటద్వారానే వ్యక్తమవుతుందన్న విషయం నిరూపణ అయింది. పిల్లల తెలివి తేటల అభివృద్ధికీ, శరీరాభివృద్ధికీ వారి ఆటలకూగల సంబంధమును గురించి పరిశోధనలు చేసిన బూలర్, స్టట్స్మన్ గారలు బాగా జాగ్రత్తగా ఆలోచించి పిల్లలలో పిల్లలకు పెట్టినపోటీ ఆటలద్వారా పిల్లల శారీరక, వివేక వికాసముల మితిని (level) అంచనావేయుటకు ఆటనే ప్రాతిపదికగా తీసుకొన్నారు. పైని చెప్పిన విషయాలనుబట్టి పిల్లల సర్వతోముఖాభివృద్ధికి ఆట ఎంతముఖ్యమయినదో తెలుస్తుంది. సామాన్యంగా పిల్లలందరకూ తమతమ యిండ్లలో ఆట స్థలము లుండవు గనుక ప్రతిపట్టణంలోనూ పిల్లలనిమిత్తం క్రీడావనము లుండవలసిన ఆవశ్యకతను నిరూపిస్తూ కొద్దిఖర్చులో అట్టివాటిని ఎట్లా నిర్మించవచ్చునో ఈ వ్యాసంలో శ్రీయుత బి. కుప్పుస్వామిగారు తెలుపుతున్నారు. హిందూదేశమంతటిలోను పిల్లల మానసిక తత్వాన్ని గురించి పరిశోధనలు చేయడాని కవకాశమున్నది ఒక్క మైసూరులోనే; చేస్తూన్నవారు ఒక్క కుప్పుస్వామిగారే. వారిచ్చిన సలహాలను గురించి ఎల్లరు బాగా ఆలోచిస్తారని నమ్ముతున్నాము—**భా. సం.**]

పెద్దపెద్ద పట్టణాలలో ప్రజలు విశ్రాంతి పుచ్చుకొనుటకు, నిర్మలమైన గాలి పీల్చుటకు చాలాచోట్ల పార్కులు (పౌరోద్యానవనములు) నిర్మింపబడుచున్నవి. ఇటువంటివి ముఖ్యంగా క్రిక్కిరిసిపోయిన పట్టణాలలో చాలా అవసరమని సర్కారువారు గ్రహించి, అక్కడక్కడ అనుకూలమైనచోట్ల ఉద్యానములను ఏర్పరుచుచున్నారు. ఇవి చక్కని రంగురంగుల పూలచెట్లతో నిండి కూర్చుండుటకు బల్లలు అమర్చబడి ప్రదేశమంతయు అందముగా వుండుటచే చల్లగాలికొఱకు విశ్రాంతికొఱకు ప్రజలు చేరెదరు. సాధారణంగా స్కూలుకు వెళ్లే పిల్ల లందరు స్కూళ్ల వద్దనో లేక పూరిబయటనో ఆటమైదానము (Plays grounds)లలోనో ఆడుకొందురు.

కాని స్కూలుకి వెళ్లడానికి ఇంకా వయస్సు చాలని పిల్లలకుమాత్రము మన దేశంలో ఇంకా ఏవిధమైన సౌకర్యాలు కలుగజేయటంలేదు. వారికి స్కూలుకి వెళ్లడానికి ఇంకా ఈడు చాలదు. అయితే ఆడడానికి కావలసినంతశక్తి. ఒక్కనిమిషం స్థిమితంగా వుండలేరు. ఇంట్లో చోటు చాలదు. వారికి తగినటువంటి సౌకర్యాలు ఇవ్వటం సాధారణ కుటుంబాలలో చాలా కష్టం. ఎక్కడో ఐశ్వర్యవంతులకు తగినంత కాంపౌండు వుండును. చాలామంది పేదవారగుటచే కాంపౌండు వుండదు. పిల్లలా ఆడకమానరు. సామాన్యంగా రోడ్డుమీద దుమ్ములోపడి ఆడుదురు. ఇందుచే వారికి అపాయమే కాక దురలవాట్లుకూడా సంభవించును. దుమ్ములో ఆడినందుకు తల్లు

లచే చీవాట్లు దెబ్బలు. ఆడడానికి వట్టి బహిరంగస్థల ముండిన చాలదు. ఆటస్థలములో పిల్లలకు ఆనందము కలిగించుటకు, వ్యాయామము చేయుటకు తగినటువంటి సౌకర్యాలు ఏర్పాటు చేయవలెను.

రెండేళ్లనుంచి ఏడేళ్లలోపు పిల్లలకు స్వేచ్ఛగా ఆడుకోడానికి క్రీడావనములను ఏర్పరచుట అత్యవసరము. మనదేశములో ఇటువంటి క్రీడావనములను నిర్మించి పెంపొందించుటకు తగినటువంటికృషి చేయవలెను. దీనిని స్థాపించుటకు ఎక్కువఖర్చుకూడ అవసరము లేదు. మనదేశంలో చక్కగా ఆరోగ్యముగా పెరిగి కంటి కింపైన పిల్లలను చూడటం అరుదు. అందులో ముఖ్యంగా పేద వాళ్ల పిల్లలస్థితి చెప్ప నలవికాదు. దీనికి కారణం సరియైన ఆహారము లేకపోవుట, అశుభ్రమైన చోట్లలో పెరుగుట. పిల్లల శరీర పుష్టికి, ( Physical development ) ఆరోగ్యమునకు వ్యాయామము అవసరము.

ఒకక్రీడావనము నేర్పరచుటకు సుమారు నూటయాభై చదరపుఅడుగుల సమప్రదేశము అనుకూలముగా వుండును; లేక పార్కు (పౌరోద్యానవనము)లోనే ఒకపక్క ఈ క్రింద చెప్పబడు జారురాయి, వుయ్యాల, పేతం మొదలైనవి వేయవచ్చును. పార్కులోనే ఈసౌకర్యాలు వుంటే తలితండ్రులకు చాలా అనుకూలము. వారు బిడ్డలను తమతో తీసుకువచ్చినపుడు అక్కడ ఆడించుకోవచ్చును; లేదా ఏదైనా వూరికి మధ్యలో అనుకూలమైన చోటులో ఏర్పాటు చేయవచ్చును. దీనికి చుట్టూ ఇనుపతీగతో బందిలి కట్టితే ఆవులూ మొదలైనవి రావు. లోపల చక్కని పూలచెట్లు కొన్ని, నీడ నిచ్చు పెద్దవృక్షములు కొన్ని వేయుట అవసరము.

పిల్లలు పెరుగుటకు, వారికి మంచిబలము రావడానికి జారటం, ఎగరడం, పరుగెత్తడం కావాలి. ఇలా జారడానికి, గెంతడానికి ఒక జారురాయి (Jumping and sliding board) సులభంగా కట్టవచ్చును.



౧. జారురాయి

దీనిని ఇటికతో కట్టిన చాలాకాలము గట్టిగా వుంటుంది. ఆటమైదానముమధ్యలో దీనిని కట్టవలెను. రాతిపునాదిమీద నేలమీద నుంచి ౧ ౩/౪ అడుగుఎత్తున ౪ ౩/౪ అడుగుల పొడుగు 3 ౩/౪ అడుగుల వెడల్పుగల ఒక అరుగు కట్టవలెను. తరువాత ఒకవైపు ౧౩/౪ అడుగువెడల్పున ఒకమెట్టు వదలిపెట్టి మిగతాదాన్ని పైకి ఎత్తవలెను. రెండో వైపు ౧ ౩/౪ అడుగు వెడల్పున ఇంకొక మెట్టు. ఇది నేలమీదినుంచి ౨ ౩/౪ అడుగుల ఎత్తులో వుండవలెను. మూడోపక్క మరొకమెట్టు నేలమీదనుంచి 3 ౩/౪ అడుగులఎత్తున వుండవలెను. నాలుగోప్రక్క నేలమీదనుండి అయిదడుగుల ఎత్తున, జారుటకు ౭౦ డిగ్రీల కోణము వుండేలాగ వాలుగా అరుగు కట్టవలెను. దానిమీదనుంచి అందరూ జారడానికి చాలా ఆనందంగా వుండును. తక్కిన మూడు ప్రక్కలనుంచి పిల్లలు వాళ్ల వాళ్ల వయస్సును

తగినట్లుగా కావలసినంత ఎత్తునుంచి ఎగరవచ్చును. దీని నంతాకూడా సిమెంటుతో గిలాబా చేస్తే నున్నగా అందంగా వుండటమేకాక గట్టిగాకూడా వుండును. దీనిచుట్టూ పిల్లలు జారినపుడు దుమికినపుడు దెబ్బలు తగులకుండా వుండడానికి చుట్టూ మూడడుగుల వెడల్పు వరకూ మన్నుతవ్వి ఇసుకతో నింపవలెను.

క్రీడావనములో ఇంకొకపక్కను ఒక సులభమైన ఏతం (See-saw) ఒకటి వేయవలెను. రెండు ఇనుప స్తంభాలుగాని, లేక కఱ్ఱ స్తంభాలుగాని నేలమీాద ౧½ అడుగు ఎత్తున వుండేటట్లు భూమిలో పాతవలెను. ఆ రెండింటికీ మధ్య ఆరంగుళాలు ఎడంవుంటే



౨. ఏతము (See-saw)

చాలు. వాటిమధ్య ఆరడుగుల పొడువుగల ఒక దూలమును ఒక ఇనుపసీలతో అమర్చవలెను. అప్పుడది రెండుపక్కలకూ వూగును. పిల్లలు అటూఇటూ పైకి క్రిందికివూగుతూ ఆడుతారు.



3. వుయ్యాల

పిల్లలకు వుయ్యాల వూగడమంటే చాల సరదా. ఇంకొకప్రక్క ఎనిమిదడుగుల పొడువు స్తంభాలను నిలబెట్టి పైన ఒక దూలం వేసి, దానికి తాళ్లతో వుయ్యాల బల్ల కాని లేక పాత మోటారు టైరు కాని కట్టిన ఉయ్యాల యగును.

ఇసుకలో ఆడట మంటే పెద్దవాళ్లకే ఇష్టం. ఇంక చిన్న పిల్లలమాట వేరే చెప్పనక్కరలేదు. ఇంకొకచోట ౧౨ అడుగుల వెడల్పు గల చక్రం చేసి దానిలో నుంచి ¾ అడుగుల లోతున మన్ను తవ్వి తీసివేసి ఇసుకతో నింపవలెను. ఈ ఇసుకలో పిచికగూళ్లు, దూదుంపుల్లా మొదలైన ఆటలు కావలసినన్ని ఆడుదురు. కొన్ని సిగరెట్టు డబ్బాలు మొదలైనవి ఇస్తే వాటితో అచ్చులు చేయుదురు.

ఈ చోట ఎప్పుడూ ఎవ్వరూ కావలి వుండవలసిన పనిలేదు. ఇక్కడుండే సామానులు దొంగతనానికి పనికిరావు. పైగా రిపేరులు మొదలైనవి అవసరము లేదు. ఇందులో పిల్లలు పరుగెత్తడానికి, ఎగరడానికి, జారడానికి, వూగడానికి కావలసినంత అవకాశ ముండును. వాళ్లు ఆడుకుంటూంటే చూసేవాళ్లకుకూడా చాలా ఆనందము. పెద్దవారికి క్లబ్బులు ఎల్లాగో నోరెరుగని పసిపిల్లకు ఇవి అట్టివి; స్వర్గము. ఇటువంటి ఒక క్రీడావనము। నిర్మించుటకు సుమారు ౧౫౦ రూపాయలలోపు అగును. ఇది మరీ భారమైన ఖర్చు కాదు. ఒక్కొక్క గ్రామములోను ఒక్కొక్క పేటలోను ఇటువంటివి ఏర్పరచుట అవసరము. మునిసిపాలిటీవారూ ధనవంతులూ ముందుకు వచ్చి ఇటువంటివి కట్టించినచో బిడ్డలకు ఆనందమే కాక వారు శక్తివంతులుగా పెరుగుటకు అవకాశ ముండును. ప్రతి స్త్రీ సమాజములలోను క్లబ్బులలోను ఇవి నిర్మించుట చాలా అనుకూలము, ఉపయోగమూను.

# ఎపుడో?

ముట్నూరు సంగమేశము

౧

ఆశ పుష్పించు టెరుగనియట్టి యెడద
జివురులెత్తించు వాసంతశ్రీ లిగుర్చి,
పుష్పఫలభార భరితమై, పుడమి ముట్టి
నీకునై 'సలాము'లు చేసి నెగడు టెపుడొ ;

౨

విశ్వమోహన కల్యాణవిమలమూర్తి-,
రాజరాజేశ్వరార్చితరమ్యమూర్తి
కంజలి ఘటించి, హృదయ మర్పించుకొఱకు
ఆస లయ్యెడి: ఫలితంబు నందు టెపుడొ !

౩

కలుషపూరితపాషాణకఠినహృదయ
మంది విహరించు సంఘమం దందమైన,
స్వచ్ఛ, కరుణార్ద్రనవనీతసదృశ రాగ
హృదయము జనించి, యమృతము నించు టెపుడొ !

౪

సర్వమానవకల్యాణసదనమందు
క్రూరకాలాహిసంకాశభూరివికట
శ్వాసఘోషితసంఘపైశాచిలాస్య
గానముల మాని శాంతిని గాంచు టెపుడొ !

౫

జగతి పుష్పించె నున్నతాశయసుమాలు :
పరిమళానిలపూర్ణ మీ భావవీథి !
బూని చరియింప హృదయ ముప్పొంగుచుండె
ఆశ ఫలియించి, మోదాశ్రు లందు టెపుడొ !

---

# నాజీజర్మనీ: నిరుద్యోగసమస్య

కొచ్చెర్లకోట సత్యనారాయణమూర్తి

"డబ్బులేనివిద్య దరిద్ర హేతువు."

- గురజాడ అప్పారావు.

"అరయగా సమంత్ర మౌ నక్షరము లేదు
మందుగాని వేరు మరియు లేదు
భువి నయోగ్యుడైన పురుషుం డొకడు లేడు,
కూర్చువా డొకండె కొదువగాని."

- వేదం వేంకటరాయశాస్త్రి.

ఈ దేశంలో మొత్తంగా, దామాషాయిని తలకొక్కంటికి రోజుకు మూడు అణాలుమాత్రమే సంపాదించే ప్రజకు, మొత్తంజనసంఖ్యలో నూటికి ముగ్గురికి మాత్రమే అక్షరజ్ఞానం వున్న ప్రజకు, ముందుగతు లుండవో వని పండితు లంగీకరించారు.

ప్రజల ఆచారవ్యవహారాలు, మత సంప్రదాయాలు, ఆర్థికపరిస్థితులు, ప్రభువుల యిష్టాయిష్టాలు, ప్రజానాయకుల ఆలోచనలు, వారి స్వార్థపరమైన పన్నాగాలు మొదలైన అనేకవిషయాలమీద ఆధారపడివుంటాయి-సంఘంలో వృత్తులను విద్యను గురించిన యేర్పాట్లు. వీటి కన్నిటికీ లోబడి బాలుడు అభివృద్ధి చెందాలి; తన శక్తి సామర్థ్యాలను, తెలివితేటలను, వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకోవాలి. అవి అనుకూలంగా లేకపోతే అణగారిపోవాలి; తనకు నామరూపాలుగాని తనవల్ల సంఘాని క్షేమప్రయోజనంగాని లేకుండా జీవచ్ఛవంవలె బ్రతికివుండాలి. ఈ విధంగా, ఉన్న పరిస్థితులను ఉన్నట్లు వదలివేయడంవల్ల సరియైన పనిపాటులకు సరియైన మనుష్యులు అమరడంలేదు. విద్యార్థులకు "వృత్తి తెలివితేటలు" కుదరటంలేదు. ఇటువంటి అనర్థకాలను తొలగించడంకోసం, బాలురను వృత్తులలో తర్ఫీదు చెయ్యడం, స్కూలు చదువులు ప్రజల సాంఘిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను గుర్తించడం అవసరం.

ఐరోపాఖండంలో ప్రస్తుతం ప్రతిదేశంలోను వ్యాపించివున్న సమస్యలు రెండు. ౧. గాఢమైన జాత్యభిమానం; ౨. లక్షలాది నిరుద్యోగులు.

యుద్ధానికి పూర్వం, ఎగుమతులనీ దిగుమతులనీ విదేశవర్తకం రెండువిధాలుగా వుండేది. యుద్ధానంతరం, పరిశ్రమాభివృద్ధిగాంచిన అన్ని దేశాలూకూడా తమ తమ దిగుమతులను తగ్గించుకోడానికీ ఎగుమతులను అభివృద్ధిచేసుకోడానికీ, భగవత్సృష్టిలో తమదేశానికి చేకూరిన ఆర్థికములైన లోపాలను సవరించుకొనేటందుకు సృష్టికి ప్రతిసృష్టి చేయడానికీ తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. 'ప్రతిదేశానికీ ఎగుమతులూ దిగుమతులూ ఏదోవిధంగా సరిసమానంగా వుండాలి. ప్రతిదేశమూ తన ఎగుమతులకు ప్రతిఫలం దిగుమతుల రూపకంగా కొంతవరకైనా పొందాలి. ఏదేశమూ ఎన్నడూ విదేశాలనుంచి వచ్చే సరుకుల నన్నిటినీ పూర్తిగా డబ్బిచ్చి కొనుక్కోజాలదు. ఇరుగుపొరుగు దేశాలతో ఇచ్చిపుచ్చుకునే మర్యాదలు కొంతవరకైనా వస్తురూపకంగా వుండనియెడల అంతర్జాతీయ వర్తకం నశిస్తుంది' అన్న చిన్ననాటి స్కూలుపాఠాలు గంగలో కలిసిపోతున్నాయి. తంతివార్తలు, టెలిఫోనులు, రేడియోలు, వాయువిమానాలు మొదలైన వార్తా, ప్రయాణ సౌకర్యాలు అధికమైనకొద్దీ అంతర్జాతీయమైత్రికి బదులు అంతర్జాతీయవిరోధమూ, మనస్పర్థా, అధికమవుతున్నాయి. ఏదేశాని కాదేశమే తనకు కావలసిన వస్తుపరికరాలను తనదేశంలోనే తయారు చేసుకుంటూ, తన యింటికి తాళంవేసుకొని తాచేతివృత్తిని ముడిచిపెట్టుకొని కూర్చోడానికి ప్రయత్నిస్తోంది. ఇంగ్లాండుకు నూనెపంట లోటు; దానిని రాతిబొగ్గులోనుంచి తయారు చేసుకుంటోంది. స్విట్జర్లాండుకు రాతిబొగ్గు లోపం; అందుకుబదులు నీటి

నుంచి శక్తి నుత్పత్తిచేసుకొంటోంది. జర్మనీలో తిండి గింజలపంటలు తక్కువ; అందుచేత తనబంజరుభూము లన్నిటినీ సాగుచేసుకొని తిండిగింజలకోసం మరొకరి మీద ఆధారపడి వుండవలసినఅవసరం లేకుండా చేసుకుంటోంది.

కాని యిటువంటి ప్రయత్నాలవల్ల ప్రతిదేశం లోను నిరుద్యోగసమస్య అధిక మవుతోంది. శరవేగంతో ఫ్యాక్టొరీసరుకులు తయారు అవుతూవున్నప్పటికీ వాటిని కొనుక్కునేవాళ్లు అగపడటంలేదు. లక్షలాది ప్రజకు పనిపాటులు దొరకటంలేదు.

ఒక్కరష్యాలోమాత్రం ఇప్పటివఱ్ఱుకు నిరుద్యోగసమస్య లేదని చెప్పవచ్చునని అందరూ అంగీకరించారు. అక్కడకూడా వ్యక్తికన్న సంఘమూ, వ్యక్తిలాభంకన్న సంఘక్షేమమూ ప్రధానమని పరిగణిస్తున్నారుగాని అచ్చట స్కూలువిద్య ముగిసిన తర్వాత యువకులు వృత్తులలో ప్రవేశించడం సులభంగానేవుంది. "ఏవృత్తిలో ?" అన్న సందేహమేగాని "ఏదైనా వక వృత్తి దొరుకుతుందా ? లేదా ?"అన్న సందేహం లేదు.

భగవంతు డిచ్చిన ప్రకృతిసంపదనూ మనుష్య బలాన్నీ పూర్తిగా వినియోగంచేసుకునే తెలివితేటలూ అదృష్టమూ లేనంతకాలం దారిద్ర్యబాధా, నిరుద్యోగ సమస్యా, దేశంలో తప్పవు. పైగా పనిచేయడం ఇష్టంలేనివాళ్లూ, చేతకానివాళ్లూ ఎప్పుడూ వుంటూనేవుంటారు. ప్రజలందరకూ పనిపాటులను ఏర్పాటు చేసి అందుకు తగిన అవకాశాలను వారికి కల్పించడం ప్రభుత్వంయొక్కా సంఘంయొక్కా ముఖ్యధర్మం. కడచిన ఐరోపాయుద్ధం తర్వాత యూరోపుఖండంలో ప్రతిదేశంలోనూ ఈ విషయమై తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రతిదేశంలోను, ఆర్థికపరిస్థితులలో కలిగేమార్పులను వివరంగా పరిశీలిస్తున్నారు; దేశకాలపాత్రాదులను జాగ్రత్తతో గమనిస్తున్నారు. వ్యక్తిసౌఖ్యంతోబాటుసంఘాభివృద్ధికోసంకూడా విడువకుండా పాటుపడుతున్నారు. అందుకు విద్యాసంస్థలు ఘట్టిగా తోడ్పడుతున్నాయి. వృత్తిశిక్షణను గురించిన కార్యక్రమాలను స్కూళ్లు విరివిగా అభివృద్ధి చేసుకుంటున్నాయి. ఈ ప్రయత్నాలు దేశకాలపరిస్థితుల ననుసరించి దేశాని కొకతీరుగా వున్నాయి గాని ప్రతిదేశంలోను గవర్నమెంటు అధికారానికి లోబడి "ఎంప్లాయిమెంటు సంస్థలు" (Employment bureaus) విసుగు విరామాలులేకుండా శ్రద్ధతో పనిచేస్తున్నాయి. వీటికి స్కూళ్లు చేయూత యిస్తున్నాయి. ఉదాహరణార్థం — జర్మనీలో జరుగుతూవున్న ప్రయత్నాలను కొంతవరకు వేరొక సందర్భంలో వివరించివున్నాను.

ఒక విధంగా చూస్తే జర్మనీ బహు విచిత్రమైన దేశ మని చెప్పక తప్పదు. పాతా కొత్తా, మార్పులకు మార్పులూ, పూర్వసంప్రదాయాలకు పూర్వసంప్రదాయాలూ అంత చిత్రంగా అక్కడ మిళితమైనాయి. విప్లవకరమైన మారిన ఉద్యమాలు, శాంతియుతమై పూర్వపద్ధతులు, ఒకవంక హిట్లరుసింహగర్జనలు, నాజీ పార్టీ విజృంభణ, ఇంకోవంక యువకుల మిలటరీతర్ఫీదు, జనసామాన్యం యావత్తూ యుద్ధసన్నద్ధులై సైనిక జీవితానికిఅలవాటు పడివుండడం, మరోవంక పల్లెలలోను పట్నాలలోను కర్షకుల కార్మికుల శాంతియుతమై సామాన్య జీవనం, యిట్టి పరస్పరవిరుద్ధమైన విషయాలనేకం ఆజాతియొక్క దినచర్యలో ఏకకాలమందే అగపడతాయి. ప్రాచీన హిందూసామ్రాజ్యాలలోవలెనే నేడు అక్కడకూడా నిరంకుశాధికారముగల పరిపాలకుడే జాతిధర్మాన్ని పరిపాలించవలసినవాడు; వ్యక్తిసౌఖ్యానికీ సంఘక్షేమానికీ బాధ్యుడు.

ఈమధ్య జర్మనుపరిశ్రమలు అతివేగంగా అభివృద్ధిచెందాయి. భూమి చాలాభాగం సారవంతమైనది కాకపోవడం, దేశంలో పండే పంటలు ప్రజలకు చాలకపోవడం, ఈ యిబ్బందు లున్నప్పటికీ తిండిగింజలకోసం ఇతరదేశాలమీద ఆధారపడి వుండడానికి వారి కిష్టం లేకపోవడం, ఈకారణాలన్నీ వారి పరిశ్రమాభివృద్ధికి తోడ్పడ్డాయి. 'సైన్సు' సహాయంతో యావచ్ఛక్తులా కష్టపడి పనిచేసి భూమిలో పండే ఆఖరు గిద్దెడు గింజలూ కూడా పండిస్తేనేగాని వారికి జీవనం జరగదు. ఈ విధంగా జర్మనుజాతికి కావలసిన ఆహార సామగ్రి యావత్తూ దేశంలోనే ఉత్పత్తి అయ్యే పరిస్థితులు త్వరలోనే ఏర్పడుతున్నాయని అనేకు లంగీకరించారు.

నాజీప్రభుత్వంయొక్క ముఖ్యమైన ఆదర్శాలలో అది ఒకటి. అందుకోసమై వారు తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నారు. ప్రజల వృత్తిధర్మాలను నిర్ణయించడంలో వారు ఆ ఆదర్శాన్ని యెన్నడూ మరవటంలేదు.

"(ఆహారపదార్థాలను పండించే) యీశాఖను సంరక్షించి, అభివృద్ధిచేసి శాశ్వతం చెయ్యడంకోసం ఎంతటి శ్రమనైనా వారు 'అతి' అని అనుకోవటం లేదు. వ్యవసాయవృత్తిని వర్తకవ్యాపారాలకు సంబంధించిన జూదపు యెత్తులనుంచి తప్పించి, దానికి ప్రత్యేకమైన, సుస్థిరమైన మనుగడ ఏర్పాటు చెయ్యడం నేటి జర్మనురాజనీతియొక్క ముఖ్యోద్దేశము"[1]!

ఎలిమెంటరీ స్కూళ్లలో చదువులు ముగియడంతోటే బాలురు బాలికలు ఒక యేడాదికాలం పల్లెటూళ్లలో వ్యవసాయవృత్తిలో నిర్బంధంగా గడపవలసి వున్నదని యిదివరలో వ్రాసివున్నాను. అచ్చట, బాలురు వ్యవసాయదారులకూ, బాలికలు వారి ఆడంగులకూ సహాయం చెయ్యాలి. అదిగాక యువకులు ఆరు నెలలకాలం 'లేబరు క్యాంపు'లలో గడపాలి. ఈ 'లేబరు క్యాంపులు' చేస్తూవున్న ముఖ్యమైనపని, దేశంలోవున్న బంజరుభూములను సాగుబడిలోకి తీసుకురావడం. భూమియొక్క సారాన్ని అభివృద్ధిచేసే పరిశ్రమ లన్నిటికీ, అందులో ముఖ్యంగా రసాయనికంగా యెరువులు వగైరాలను తయారుచేసే పరిశ్రమలకు ప్రభుత్వం మిక్కిలి ప్రోత్సాహం ఇస్తోంది. ఇంతకాలం ప్రజలు తమఅజ్ఞానంవల్ల నిర్లక్ష్యం చేసిన యిట్టి ఐశ్వర్యాభివృద్ధికరమైన పరిశ్రమలలో అనేక వేలమంది జర్మను లిప్పుడు పని చేస్తున్నారు. జర్మనీలో, అందులో ముఖ్యంగా తూర్పుభాగంలో చిన్న చిన్న కమతగాళ్ల సంఖ్య అధికంగా వుంది. వాళ్లు అప్పులపాలై ధనికుల ఒత్తిడిలో క్రమంగా అంతరించి పోతున్నారు. వాళ్లను నిలబెట్టి కాపాడడంకోసం నాజీ ప్రభుత్వం ఎంతో పాటుపడుతోంది. ౩౧౨ [illegible] యెకరాలకు తక్కువ విస్తీర్ణంగల పొలాలు ఏకఖండికలుగా, వ్యవసాయం చెయ్యడానికి అర్హులైన పెద్ద కొడుకులకో ఇతర మగవారసులకో సంక్రమించాలిగాని కుటుంబ పంపకాలవల్ల చీలికలు కాగూడదని నిబంధన గలదు. అట్టి చిన్న చిన్న పొలాలను అమ్మగూడదు. తనఖా పెట్టగూడదు; ఇతరవిధాల అన్యాక్రాంతం చెయ్యగూడదు. సేద్యగాడు పవిత్రమైన 'ఆర్య'సంతతికి చెందినవాడై యుండాలి. పొలం సంక్రమించిన వారసుడే తన అన్నదమ్ములకు అక్కచెల్లెండ్రకు వృత్తిశిక్షణను ఇప్పించడానికి బాధ్యుడు. తమకిష్టకాలంలో ఆకమతంలో పనిచేసి జీవించడానికి అన్నదమ్ములకూ అక్కచెల్లెండ్రకూ హక్కు గలదు. సేద్యగాడి తమ్ములనుగూడా సాధ్యమైనంతమట్టుకు కుటుంబకమతంలో నిలుపు చేసి పనిచేయించడం ప్రభుత్వం యొక్క ఉద్దేశం.

ఈ విధంగా ప్రజలు తమతమ వృత్తిధర్మాలను సక్రమంగా అనుసరించేటట్లు పరిపాలించే బాధ్యత ప్రభుత్వానిది. వృత్తిధర్మాలను నిరూపించి శాసించడంలో, కొద్దిపాటిమందివ్యక్తుల లాభాలకన్న సంఘక్షేమమే, జాతి అభివృద్ధియే ప్రధానమన్న విషయాన్ని జర్మనుప్రభుత్వం మరవటంలేదు.

జర్మనీ ఉత్తరభాగం మిక్కిలి బీద ప్రదేశం. అక్కడి శీతోష్ణస్థితులు పాడిపంటలకు ఎంతమాత్రం అనుకూలంగా లేవు. కాని అక్కడ కావలసివున్న ఆహారపదార్థాలను అక్కడనే పండించడంలో జర్మనుప్రభుత్వం అసాధారణ ప్రజ్ఞను చూపిస్తోంది. ఆ ప్రాంతపు వ్యవసాయానికి శాస్త్రజ్ఞానం, ధనసాహాయ్యం, మనుష్యబలం విరివిగా ఏర్పాటుచేసి పాడిపంటలను అపారంగా అభివృద్ధిచేస్తోంది.

"౧౯౩౩ కు పూర్వం, ఇతర దేశాలతోబాటు జర్మనీలోకూడా, వివిధవృత్తులలో పనివాళ్లకు పని పాటులు కల్పించడం అంటే, పెట్టుబడిదారుల లాభాలకు లోబడి అన్నఅర్థం వుండేది. లాభాలు మిగలని వృత్తులలో పనివాళ్లకు పని చెప్పడంవల్ల వృత్తికే నష్టం వస్తుం దని వారివుద్దేశం. నాజీప్రభుత్వంలో ఆ అభిప్రాయం మారిపోయింది.

1. J. W. F. Thelwall - Economc conditions in Germany, 1984.

పెట్టుబడిదార్లు తమ లాభాలసంగతి గమనించ కుండానే, పనిలేని పనివాళ్లకు పనిపాట్లు కల్పించడం కోసమే, అటువంటివాళ్లను కొందరను పనులలో చేర్చు కోవాలి. పనిపాటులు లేనివాళ్లసంఖ్య అధికంగా వుంటే, యిదివరకు పనిలోవున్న వాళ్లుకూడా తమ కూలి వేతనాలను కొంతవరకు తగ్గించుకుని, అనగా మునుపటి గంటకూలిరేటునే రోజు ౧ కి మునుపటికన్న తక్కువగంటలకాలం పనిచేసి, పనిలేనివాళ్లకు పని దొరకడానికి కొంత అవకాశ మియ్యాలి. పెట్టుబడి దార్లూ పనివాళ్లూకూడా పనిలేనివాళ్లను డబ్బుచందా లిచ్చి పోషించడానికిబదులు ఈ విధంగా వారికి పని పాటులు కల్పించి పోషిస్తున్నారు అంతర్జాతీయవర్త కమూ, ఎగుమతి దిగుమతులూ లాభప్రదంగా సాగుతూ వున్నంతకాలం, ఉత్పత్తియైన సరుకు లన్నీ విరివిగా అమ్ముడవుతూ వున్నంతకాలం ఈ యేర్పాటు సక్ర మంగానే జరుగుతుంది". 2

నిరుద్యోగులను పనిపాటులు లేకుండా కూర్చో పెట్టి చందాల ద్వారాగాని, లేదా కాలవలు తవ్వించ డంలాంటి ఏదో వకప్రత్యేకమైన పనిని కల్పించిగాని పోషించడంకన్న ఇదియే ఉత్తమమైన పద్ధతిఅనీ, పనివాళ్లకూ దేశానికీ కూడా ఈ విధంగా తక్కువ హాని కలుగుతుందనీ అనేకు లంగీకరించారు. కాని యీ కార్యక్రమం సక్రమంగా నెరవేరాలంటే ఉత్పత్తియైన సరకులన్నీ విడుదల కావాలి; పనిపాటులు లేనివాళ్లు తమ కియ్యబడిన పనులను వేతనాలను వద్దనకుండా అంగీ కరించాలి; ఈ యేర్పాట్లవలన మొదటికే మోసంవచ్చి, ఆ వృత్తులకు ఏ విధమైన హానీ జరగగూడదు.

జర్మనీలో బాలురకూ బాలికలకూ ౬ మొదలు ౧౪ యేళ్లువయస్సు వచ్చేవరకూ పూర్తిగాను, ౧౪ యేళ్లుమొదలు ౧౭ యేళ్లు వయస్సువరకూ రోజుకు కొన్నిగంటలకాలమూ విద్య నిర్బంధం. విద్యార్థి తన ౧౪-వ యేట, అనగా ౮ యేళ్లు స్కూలులో చదివిన తర్వాత, ప్రభుత్వంచేత ఏర్పాటుచేయబడ్డ 'ఎంప్లా య్మెంటు సంస్థల' (**Employment bureaus**) సహా యంవల్లగాని లేదా తన స్వప్రయత్నంవల్లగాని యేదో వక వృత్తిలో ప్రవేశించి, వారానికి ఒకరోజుచొప్పున ఆ వృత్తికి సంబంధించిన విద్యను వృత్తిస్కూళ్లలో అభ్యసించవచ్చును.

ఎలిమెంటరీ స్కూళ్లలో చదువు ౮ ఏళ్లు. అది ముగిసినతర్వాత విద్యార్థులు మిడిల్ స్కూళ్లలో చేర వచ్చును. మిడిల్ స్కూలు చదువు ఆరేళ్ల కాలం జరిగి, పదహారోయేటితో ముగుస్తుంది. అచ్చటినుంచి విద్యార్థులు ఇంకా ఉన్నతవిద్యలకు పోవచ్చును. ధనసహాయం కలిగివుండి, ఆరోగ్యంలోను, రాజకీయాభిప్రాయాల లోను, తెలివితేటలలోను, జాతినియమాలలోను నాజీ పార్టీయొక్క పరీక్షలకు అగగలిగినయెడల ఉన్నత సాంకేతిక లేక సామాన్య యూనివర్సిటీ చదువులకు పోవచ్చును.

విద్యార్థికి ౧౮-వ యేడు వచ్చేవరకూ ప్రతి రోజూ సంపూర్ణంగానో, లేక రోజుకు కొన్నిగంటల చొప్పుననో స్కూలువిద్యను నిర్బంధంగా నేర్పుతూ వున్న దేశాలు ప్రపంచకంలో బహు కొద్దిగా వున్నాయి. అందులో జర్మనీ వకటి. యుద్ధానంతరం ఆదేశంలో సంభవించిన ఆర్థిక దుస్థితిలో వృత్తివిద్యా సంస్థలూ, వృత్తిసహాయకసంస్థలూ చాలా అభివృద్ధిచెంది మిక్కిలి సమర్థతతో నిర్వహింపబడుతున్నాయి. ఈ విధంగా వ్యక్తిసౌఖ్యానికీ రాష్ట్రాభివృద్ధికీ కూడా అవ కాశాలు కలవని వారి నమ్మకం. "యువకులు తగిన వృత్తు లలో ప్రవేశించడంకోసం వారికి సరియైన పద్ధ తులమీద దారి చూపి సహాయ్యం చెయ్యడం జాతీయ సామ్యవాదుల ఉద్దేశం. అందుకోసమై ఆరోగ్యకరమైన కొత్తపద్ధతులను ప్రారంభించాలి. అనా రోగ్యకరమైన పాతపద్ధతుల అంటు తగిలి కొత్తపద్ధతులు పాడుకాగూడదు"; అనగా జర్మనుప్రభుత్వం చేస్తూ వున్న వృత్తిసహాయంయొక్క ముఖ్యోద్దేశం వృత్తులలో జర్మనులు కానివారలకు ప్రవేశం కలగనీయకపోవడం—ఆ విధంగా జర్మనుజాతిని పవిత్రం చెయ్యాలి; ఉద్యోగాలను సంపాదించుకోవడంలో వ్యక్తులకు సహాయం చెయ్యడం.

---

2. J. W. F. Thelwall; P. 15.

-అది రెండోపక్షం. ఈ విధంగా ప్రతివిషయంలోను జాతీయ సామ్యవాదుల సిద్ధాంతాలను అతిజాగ్రత్తతో అనుసరిస్తున్నారు. వృత్తులను నిర్ణయించుకోవడమును గురించి ప్రజలకు సలహాలియ్యడం, సహాయం చెయ్యడం ప్రభుత్వం విధియని జర్మనుప్రభుత్వం ౧౯౨౭ లోనే అంగీకరించి అందుకోసం ప్రత్యేక కార్యాలయాలను ఏర్పాటుచేసింది. ౧౯౩౫ లో అటువంటి ఆఫీసులు ౩౬౩ వుండేవి. అందులో పనిచేస్తూవుండే ఉద్యోగుల సంఖ్య ౯౦౦. వారిసలహాలనూ సాహాయ్యమునూ పొందుతున్న విద్యార్థులసంఖ్య నానాటికి హెచ్చిపోతోంది.

౩౦-౬-౧౯౩౩ నాటికి ౩,౯౪,౨౭౮ మంది
౩౦-౬-౧౯౩౪ ,, ౬,౦౦,౫౧౮ ,,
౩౦-౬-౧౯౩౫ ,, ౮,౪౮,౩౭౧ ,,

ఒక్క బెర్లిను నగరంలోనే అటువంటి ఆఫీసులు ఎనిమిది వున్నాయి (౧౯౩౫). ఆ నగరంలో ప్రతియేటా సుమారు ౫౦ వేలమంది విద్యార్థులు తమ చదువులను ముగించుకొని స్కూళ్లను వదలుతున్నారు. అందులో సగంమంది తమ వృత్తులకొరకు ఈ కార్యాలయాల సహాయం పొందుతున్నారు. వారిలో నూటికి సుమారు ౬౦ మందికి ఈ ఆఫీసులసహాయంవల్ల తగిన వృత్తులు లభిస్తున్నాయి.

అనేక కంపెనీలలోను దుకాణాలలోను అంతమంది పనివాళ్లు అవసరం లేకపోయినా, నిర్బంధంవల్ల గాక పరస్పర అంగీకారంవల్లనే, వీలైనంతమట్టుకు యీవృత్తి సహాయక కార్యాలయాలచేత సిఫారసు చేయబడిన యువకులనుమాత్రమే చేర్చుకుంటున్నారు. అయితే, నిరుద్యోగులకు సహాయం చెయ్యడంకోసం పెట్టుబడిదారులను నిర్బంధం చెయ్యగల అధికారం ప్రభుత్వానికి కలదు. ఒక ప్రదేశంలో స్థిరనివాసంలేని పనివాళ్లు ఆ ప్రదేశంలోవున్న వృత్తులలో పనులకు కుదరగూడదు. అవసరాన్నిబట్టి ప్రభుత్వం, ఇతర వృత్తులలో పనిచేస్తూవున్న పనివాళ్లను నిర్బంధంగా వ్యవసాయవృత్తిలోకి మార్చవచ్చును. ఈ విషయాలలో ప్రభుత్వాజ్ఞలను తిరస్కరించినవారిపై ప్రభుత్వము జరిమానాలు, ఖైదు మొదలైన శిక్షలను విధించవచ్చును.

నాజీ ప్రభుత్వం ఈ యధికారాలను విరివిగా చలాయిస్తోంది.

వృత్తి నిరూపక కార్యాలయాలద్వారా జరగవలసిన పనులను నాజీప్రభుత్వం యీక్రిందివిధంగా సూచించింది :—

౧. నాజీనీతి నియమాలప్రకారం వృత్తుల విలువనుసరించి, వాటిని తెలివితేటలతో ఏరుకోవడం గురించి యువకులకూ, తలిదండ్రులకూ, జనసామాన్యానికీ బోధించడం. ఇది మొదటివిధి.

౨. యువకు లందరూ కొన్నివృత్తులలో మూగి మరికొన్నిటిని సంపూర్తిగా త్యజించడంవల్ల జాతియొక్క ఆర్థిక, సాంఘిక నిర్మాణానికి హాని కలుగుతోంది. కాబట్టి యువకులను తగినవృత్తులలో ప్రవేశపెట్టడంకోసం సరియైనప్రయత్నాలు చెయ్యడం.

౩. యువకులు తమకు సంపూర్ణమైన అభిరుచి గల వృత్తులనే ఏరుకునేటట్లు చూడాలి. కానిమొదల, అవృత్తీ, వ్యక్తులూకూడా యెంతమట్టుకు అభివృద్ధి చెందవలెనో అంతమట్టుకు అభివృద్ధిచెందజాలవు.

౪. వృత్తిశిక్షణ, ఉన్నతవిద్య మొదలైన విషయాలననుసరించి యథార్థమైన సంగతులను ప్రజలలో వ్యాపింపజెయ్యడం.

౫. విద్యార్థులకు సమర్థతో వృత్తిశిక్షణ ఇయ్యగల ఫ్యాక్టొరీలు, కార్ఖానాలు వగైరాలను ఏర్పాటు చెయ్యడం.

౬. వృత్తినిరూపణానికి సంబంధించిన ప్రయత్నాలన్నీ బాలురతోపాటు బాలికలకుకూడా వర్తించాలి. ఈనాటి యువకుల కర్తవ్యాలనేకము లున్నాయి."

గొప్పవారు, కొద్దివారు అన్న వ్యత్యాసాలతో ఎంతమాత్రం నిమిత్తం లేకుండా వృత్తినిరూపణ కార్యాలయాల సహాయం ప్రజ లందరూ పొందాలనీ, వివిధ వృత్తులకు సంబంధించిన సంగతిసందర్భా లన్నిటినీ రేడియో, సినిమా, వార్తాపత్రికలు, ఉపన్యాసాలు, కొన్ఫరెన్సులు, మొదలైన అన్నివిధాలా ప్రజలందరికీ తెలియజెయ్యాలనీ ప్రభుత్వంయొక్క ఉద్దేశం.

స్కూళ్లలోకూడా ఈ మార్గాలన్నిటివల్లా ఈ విషయాలను విద్యార్థులకూ విద్యార్థినులకూ బోధిస్తున్నారు. ఆయావృత్తులలో పనిచేసేవారికి ఎట్టి దైహిక, మానసిక, సాంఘిక లక్షణా లుండవలెనో వారికి తెలియజేస్తున్నారు.

యువకుల, యువతుల 'వృత్తిసమర్థత'ను నిర్ణయించేమార్గాలు :— విద్యార్థి తనఅభిరుచులనుసరించి, ఇష్టాయిష్టాలనుసరించి, ఆటపాటలనుసరించి, తాను తెలియజేసే సంగతులు; అతడికి స్కూలులో మొదటినుంచీ ఇప్పటివరకూ వచ్చినమార్కులు; స్కూలు ఉపాధ్యాయుడియొక్క, హిట్లరు యువజనసంఘ నాయకుడియొక్క, స్కూలువైద్యునియొక్క, విద్యార్థితలిదండ్రులయొక్క అభిప్రాయాలు; ఇదివరలో విద్యార్థిని పరిశీలనదృష్టితో చూచివుండినవారితో సంభాషణ; మానసికశాస్త్రపరిశోధనల ఫలితాలు, వగైరా.

వృత్తినిరూపక కార్యాలయాల సహాయం ఎలిమెంటరీస్కూళ్లలోను మిడిలుస్కూళ్లలోను విద్యను ముగించిన ౧౪ మొదలు ౧౮ యేళ్లు వయస్సుగల యువకులు యువతులు అందరకూ లభిస్తోంది. కాని అందులో చాలామంది ఎలిమెంటరీస్కూళ్ల విద్యమాత్రం ముగించినవారు.

౧౯౩౮-౩౯-వ యేట ఆవిధంగా సహాయం పొందిన ౮,౪౮,౩౭౧ మంది యువతీ యువకులలో ౪,౩౩,౪౩౫ మంది ఎలిమెంటరీస్కూళ్లలో చదివిన ౧౪, ౧౫ యేళ్ల వయస్సుగలవారు. మిగిలినవారు మిడిలుస్కూళ్లలోను హైస్కూళ్లలోను విద్యను ముగించినవారు. ౧౮ ఏళ్లలోపు వయస్సుగల యువకులకు యువతులకు వివిధవృత్తులలోను వ్యాపారాలలోను చేరేటందుకు సహాయం చెయ్యడమే వృత్తినిరూపకసంస్థలయొక్క ముఖ్యోద్దేశం.

ఈ విషయంలో స్కూళ్లు చేస్తూవున్న సహాయం యేమిటి? జర్మనుప్రజల ఆర్థికజీవితంతోటి వృత్తిజీవితంతోటి విద్యార్థులకు పరిచయం కలుగజెయ్యడం; వాటిని గురించిన సంగతి సందర్భాలవన్నిటిని వారికి బోధించడం; ఒక్కొక్క విద్యార్థినిగురించి వృత్తినిరూపక కార్యాలయానికి అవసరమైన సంగతుల నన్నిటిని సేకరించి ఆకార్యాలయానికి అందచెయ్యడం. ౨౬-౨-౧౯౩౦ తేదీగల ప్రష్యను విద్యామంత్రియొక్క ఆజ్ఞయందు ఈవిషయం ఇట్లు వర్ణింపబడివుంది.

"స్కూలులలో, క్లాసుపాఠాలద్వారా గాని ఉపన్యాసాలు సినీమాలు మొదలైన సాధనాలద్వారా గాని విద్యార్థులకు ప్రజల ఆర్థికజీవితాన్ని గురించీ వృత్తులను గురించీ విపులంగా వర్ణించి బోధించాలి. అందుకు తగిన పుస్తకాలను స్కూలు పుస్తకభాండాగారాలలో వుంచి విద్యార్థులచేత చదివించాలి. క్లాసుపాఠాలను కూడా అందుకు అనుకూలంగా ఏర్పాటుచెయ్యాలి. ముఖ్యంగా మతబోధ, జర్మనుభాష, వేదాంతశాస్త్రపుప్రశ్నముపాఠాలు — వీటిలో శరీరకష్టంవల్లకలిగే మానసికాభివృద్ధిని, వృత్తులను వివేకంతో యెన్నుకోవలసిన ఆవశ్యకతను, పిల్లలకు బోధించాలి. పైగా స్కూళ్లు ముఖ్యపటికంటె ఎక్కువ శ్రద్ధతో విద్యార్థుల శక్తిసామర్థ్యాలను అభిరుచులను గమనించాలి. ఈవిధంగా విద్యార్థుల వృత్తిసమర్థతలను తెలుసుకోడానికి అవకాశాలుండాలి"; అనగా స్కూళ్లు ప్రతిరోజూ ప్రత్యేకంగా కొన్నిగంటలుమాత్రమేకాకుండా, సమయం చిక్కినప్పుడల్లా వృత్తిధర్మాలనుసరించీ, వృత్తులకు సంబంధించిన యితర విషయాలనుగురించీ విద్యార్థులకు బోధిస్తూవుండాలి. ఒక్కొక్క విద్యార్థియొక్క యిష్టాయిష్టాలను అభిరుచులను జాగ్రత్తతో పరిశీలిస్తూవుండాలి.

జర్మను స్కూళ్లలో జరుగుతూవున్న చర్యను బట్టి చూస్తే, అవి యీఆదర్శాలను అతిశ్రద్ధతో ఆచరణలో పెడుతున్నాయని స్పష్టంగా తెలుస్తోంది. స్కూలు చదువు ముగిసిన ఒక్కొక్క విద్యార్థినిగురించి వృత్తినిరూపకసంస్థ స్కూలు అధికారులను అనేకప్రశ్న లడుగుతుంది. స్కూలు అధికారులు వాటికన్నిటికీ సరియైన సమాధానాలను చెప్పాలి.

"వృత్తినిరూపకసంస్థలచే నియమింపబడ్డ ఉద్యోగులు అప్పుడప్పుడు స్కూళ్లను సందర్శించి వృత్తులను ఏరుకోవడంగురించీ, వృత్తినిరూపణ ఉద్దేశాలను

సరించీ విద్యార్థులతో చర్చిస్తూవుంటారు. సాయం కాలపుపూట్ల వారు విద్యార్థుల తలిదండ్రులతో కాన్ఫరెన్సులు జరుపుతారు. కాన్ఫరెన్సులలో, యువకులకు వివిధవృత్తులలోగల అవకాశాలననుసరించీ, ఆయావృత్తుల పద్ధతులననుసరించీ, వృత్తిస్కూళ్లలోను సాంకేతికపు స్కూళ్లలోను విద్యార్థుల కీయబడుతూవున్న తర్ఫీదును సరించీ, ఫ్యాక్టొరీలవగైరా సంస్థలలో పనిచేర్చుకోవడానికి విద్యార్థులకుగల అవకాశాలననుసరించీ, చర్చిస్తారు. విద్యార్థి తన సమర్థతలననుసరించి, యిష్టాయిష్టాలననుసరించి, అభిరుచులననుసరించి, తాను ఏ వృత్తిలో ప్రవేశింపగోరేదీ తనకు తాను ఆత్మపరీక్ష చేసుకొని తెలుసుకోవలసినదని ప్రోత్సాహం చేస్తున్నారు."

అసలు, చట్టంప్రకారం, విద్యార్థులకు వృత్తి విషయకమైన సంగతులను వృత్తిసర్గాలను బోధించవలసినవిధి ఎలిమెంటరీ స్కూళ్లపై గలదు. అనుభవంలో అది యెంతవరకు సాగుతోంది? ఎలిమెంటరీ స్కూళ్లు కూడా వివిధవృత్తులననుసరించి అనేకసంగతులను సేకరించి విద్యార్థులకు అర్థమయ్యేటట్లు బోధిస్తున్నాయి. స్కూలు అధికారులు అపూర్వమైన శ్రద్ధతో విద్యార్థుల సమర్థతను గ్రహిస్తున్నారు. ఈవిధంగా వారు తమ విద్యార్థులననుసరించి అనేక విషయాలను ఇప్పడిప్పుడు అవగాహన చేసుకుంటున్నారు ఇదివరకువలె యువకులకు నిరర్థకమైన, దేశహానికరమైన వృత్తులలో గాక సార్థకమైన అర్థోత్పాదకమైన వృత్తులలో ప్రవేశపెట్టవలసిన అవసరం యెన్నటూ మరువరాదని నాజీ ప్రభుత్వం స్కూళ్లనూ, వృత్తినిరూపక సంస్థలనూ యెప్పటికప్పుడు హెచ్చరిస్తోంది. దేశక్షేమం, రాష్ట్రసేవ, వీటిని యువకులు మరవరాదు. నాజీప్రభుత్వం ప్రజలను తమతమ యిష్టాయిష్టాలనుబట్టిగాక సంఘం యొక్క అక్కరలనుబట్టియే ఆయావృత్తులలో ప్రవేశపెడుతూవున్నమాట నిశ్చయం. జాతియొక్క పురోభివృద్ధికోసం, సంఘనిర్మాణంలో ఎవరిఅదృష్టంప్రకారం వారికి దొరికిన స్థానాలలో వ్యక్తులు సంతుష్టపడి వుండాలి. సంఘధర్మ మది. అంతేగాని సర్వసమానతపేర విద్యార్థులు అందరూ ఏవో కొన్నివృత్తులలో మాత్రమే మూగడం సంఘక్షేమం కాదు.

ఈ విధంగా యువకుల స్వాతంత్ర్యం కొంత మట్టుకు నశించవచ్చును. ప్రాచీనహిందువులు ప్రజల జుట్టుకూ బొట్టుకూ నీతినియమాలను ఏర్పచినట్లే నాజీ ప్రభుత్వంకూడా జర్మనుయువకులను "మీరు ఇల్లా నడుచుకోవాలి" .అని దిద్దడంలో మితి మీరి చరించవచ్చును. కాని ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో వ్యక్తిస్వాతంత్ర్యానికీ, దేశాభివృద్ధికీ ముక్కుదురుగా వుంది. పైగా ఉద్దేశంలోను ఆచరణలోనుకూడా, నాజీసిద్ధాంతాలకు లోబడి యువకులు తమ కభిరుచిగల వృత్తులను ఏరుకోవడమే జర్మను ప్రభుత్వంయొక్క అభిప్రాయం. "వృత్తినిరూపక కార్యాలయాల ఉద్దేశం విద్యార్థులకు సలహా చెప్పడం, సహాయంచెయ్యడం, ప్రోత్సాహంచెయ్యడం; అంతేగాని వారిని నిర్బంధించడం కాదు, తొందరపెట్టడం కాదు."[1]

విద్యార్థి తన స్వంతపూచీమీద తనవృత్తినిసరించి తాను నిర్ధారణచేసుకొనేటట్లు ప్రభుత్వంవారు అతనికి సలహా చెప్పి సహాయంమాత్రం చేస్తారు.విద్యార్థికీ విద్యార్థికీ వుండే భేదాలను గ్రహించడంకోసం చాలా శ్రమతీసుకుంటున్నారు. ప్రతిజిల్లాలోను అధమం ఒకమానసికశాస్త్రవేత్తయినావుంటాడు. అతడు విద్యార్థులలో తెలివితేటలు చురుకుదనం మొదలైన లక్షణాలను పరీక్షచేస్తాడు. ప్రశ్నలకుసమాధానాలు చెప్పేటప్పుడు అతడు విద్యార్థుల ధోరణిని ప్రవర్తనను జాగ్రత్తతో పరిశీలిస్తాడు. అధికారులు విద్యార్థులపుట్టుపూర్వోత్తరాలను తెలుసుకుంటున్నారు. వారివంశవృక్షాలను వంశీకుల వృత్తాంతాలను పరిశోధిస్తున్నారు. ఆ విధంగా సమకూర్చబడ్డ విషయాలను సమన్వయంచేసి, ఆఫలితాలనుబట్టి విద్యార్థి ఏయే విధమైన పనిపాటులకు మిక్కిలి తగివుంటాడో సలహా యిస్తున్నారు.నరాలలో పటుత్వంలేని బలహీనులు, అజాడ్యంతో బాధపడుతూవున్న దగ్గరబంధువులు కలవారు నిదానం అవసరమైన పనిపాటులకు అర్హులు కారు - ఈవిధంగా వుంటాయి వారిసలహాలు. ఏయేవృత్తులలో

1. Handirck F. Johannes, P. 239.

విద్యార్థులు మిక్కిలి రాణించవచ్చునో నిశ్చయించి ఆయా వృత్తులలో వారిని ప్రవేశపెట్టడంకోసం అధికారులు మిక్కిలి పాటుపడుతున్నారు. స్కూలు ఉపాధ్యాయుడియొక్క, వైద్యునియొక్క, హిట్లరుయువజనసంఘ నాయకునియొక్క రిపోర్టులను వృత్తినిరూపకసంస్థఅధికారి జాగ్రత్తతో పరిశీలిస్తాడు. ఆజిల్లాలో వున్న మానసిక శాస్త్రవేత్తయొక్క సలహాను తీసుకుంటాడు. తలిదండ్రులవద్దనుంచి అనేకవిషయాలను గ్రహిస్తాడు. సంగతి సందర్భాల నన్నిటినీ గ్రహించడంలో ఏసాధనాన్నీ నిర్లక్ష్యం చెయ్యడు. 'ఆర్య' రక్తం, జాతియొక్క పవిత్రత - అన్న భావాలు అధికారుల మనోదృష్టిలో ఎల్లప్పుడూ వుంటాయి.

అనేక రకాలైన విద్యార్థులను గురించీ, వృత్తులను గురించీ, వృత్తినిరూపకసంస్థకు బాగా తెలుసుకొని వుండాలి. ఏదో వకశాఖలో మాత్రం సంకుచితమైన ప్రావీణ్యము వుంటే చాలదు. సంకుచిత దృష్టిగల ప్రవీణులను సాధ్యమైనంతవరకు ఇటువంటి సంస్థలలో నియమించరు. అట్టివారికి విశాలమైన మనోవికాసమూ, ప్రపంచానుభవమూ, దూరదృష్టీ సానుభూతీ, దయార్ద్ర హృదయమూ వుండవని జర్మను అధికారుల నమ్మకం.

యుద్ధం మొదలైన కారణాలవల్ల వికలాంగులయినవారికికూడా పైన చెప్పినవిధంగా చాలా సహాయం చేస్తున్నారు. జర్మనుచట్టప్రకారం వృత్తులలోను వ్యాపారాలలోను నూటికి కొంతమందిచొప్పున వికలాంగులను పనులలో చేర్చుకోవాలన్న నిర్బంధం కలదు.

పనిపాటులు లేనివారిని 'పనిపాటులకోసం వేచియున్నవారు' అని అంటారుగాని 'నిరుద్యోగులు' అని పిలవరు. అట్టివారికి సామాన్యయంత్రశాస్త్రమూ, వివిధాలైన లోహాలలో పనీ నేర్పుతారు. ఈవిధంగా సోమరులకు పని దొరకడమేకాకుండా వారిలో ఇంతవరకూ బైటపడని శక్తిసామర్థ్యాలుకూడా బైటపడవచ్చును.

బెర్లినుయూనివర్సిటీ వృత్తినిరూపకసంస్థకు చెందిన పుస్తకభాండాగారం జర్మనీదేశాని కంతకూ పెద్దది. అదిగాక అంతకంటె చిన్నపుస్తకభాండాగారాలు ఇంకా తొమ్మిది దేశంలో వున్నాయి. వివిధవృత్తులలో ప్రవేశింపగోరే సెకండరీస్కూలు విద్యార్థులకు హైస్కూలు విద్యార్థులకు ఉపయోగకరమైన అనేకసంగతులు ఈ పుస్తకభాండాగారాలలో సేకరింపబడివున్నాయి. బెర్లినుసంస్థలోవున్న పుస్తకభాండాగారంలో ౧౨౫ వృత్తులనుగురించి సమగ్రమైన వృత్తాంతము దొరుకుతుంది. ఆ వృత్తులకు సంబంధించిన అనేకపుస్తకాలు కరపత్రాలు వార్తాపత్రికలు అచ్చట వున్నాయి.

ఈమధ్య బెర్లిను సంస్థలో ౨౦ వేర్వేరు వృత్తుల ప్రతినిధులు తమ తమ వృత్తులనుగురించి వుపన్యాసాలిచ్చారు. తమతమ వృత్తులలో నీరోజు కారోజు దినచర్యలో పనివాని కవసరమైన లక్షణాలనుగురించి వారు చర్చించారు. మొదటిరోజు మొదలు ఆఖరురోజువరకు ప్రతిదినమూ ఆవుపన్యాసాలను వినడానికి మూగిన విద్యార్థులతోనూ, వారితలిదండ్రులతోనూ, ఉపాధ్యాయులతోనూ హాలు కిటకిటలాడిపోయింది.

ఈ ప్రయత్నాలన్నీ కేవలం నిరుద్యోగసమస్యానివారణార్థంమాత్రమే కాదు. నాజీధర్మప్రచారానికీ, నూతన సాంఘిక రాజకీయ విజ్ఞానాన్ని ప్రజలలో వెదజల్లడానికీ అవి మిక్కిలి శక్తివంతములైన సాధనాలుగా ఉపయోగపడుతున్నాయి. అది సహజమే! ఇంతకుముం దెన్నడూ ప్రపంచచరిత్రలో ఇంత విరివిగా వ్యాపించిన ఆర్థికదుస్థితినీ, నిరుద్యోగసమస్యనూ కని విని యెరుగము. అసాధారణమైన యిట్టిక్లిష్టపరిస్థితుల నెదుర్కోవడంకోసం అన్నిదేశాలవారూ అసాధారణమైన ప్రజ్ఞనూ, పద్ధతులనూ అవలంబించవలసివచ్చింది. ఈ విషయంలో ఇతర దేశాలకంటె జర్మనీ యెక్కువ నేర్పరి కనబరిచింది నూతన పద్ధతులను ఎక్కువ దృఢవిశ్వాసంతో కఠోర వ్రతచర్యతో అవలంబించింది. 'యుక్తవయస్సు వచ్చిన ప్రతివ్యక్తీ ఏదో సార్థకమైన పనిపాటులలో నిమగ్నుడై యుండాలిగాని సోమరిగా వుండరాదు' అన్న సిద్ధాంతాన్ని జర్మనులు సంపూర్తిగా ఆచరణలో పెట్టారు. ఒక్కొక్కప్పుడు ఆపనిపాటులు సార్థకమైనవి అవునా కాదా అన్న సందేహంకూడా కలుగుతుంది. జర్మనీ యొక్క పునరుద్ధారణకు మనుష్యసేవ, వస్తుసామగ్రిని ఉత్పత్తిచెయ్యడం-యీ రెండూ మిక్కిలి

అవసరం. పనిచెయ్యగల ప్రతి జర్మనుడూ కష్టపడి పని చెయ్యాలి; వస్తుసామగ్రిని విరివిగా ఉత్పత్తిచెయ్యాలి. ప్రజలంతా ప్రాలుమాలిక లేకుండా తమవృత్తినరాళ్లను నిర్వర్తించాలి. పైగా పూర్వం మనదేశంలో ప్రబోధచంద్రోదయ నాటకంలో వర్ణింపబడ్డట్లు నాజీ ప్రభుత్వం ఏర్పడకపూర్వం జర్మనుసంఘంలో తలకొక మతం. తలకొక వేదాంతం, తలకొక దారి. స్వాతంత్ర్యం పేర సంఘం విచ్ఛిన్నమై విశృంఖలంగా ప్రవర్తించడంవల్ల యేర్పడ్డ భయంకరమైన పరిస్థితులను అరికట్టి ప్రజలనందరిని ఒక్క కోటికి తీసుకొనిరావాలి; వారందరూ తమ బాగుతోపాటు సంఘక్షేమాన్ని సర్వదా ప్రవర్తించునట్లు చెయ్యాలి. ఇది సామాన్యమైనవిషయం కాదు. ఇప్పుడు ఇంచుమించు ప్రతిజర్మనుడికీ జాతీయసామ్యవాదసిద్ధాంతాలయెడల మతవిశ్వాసమూ, మతభక్తీ, మతోత్సాహమూ ఏర్పడుతున్నాయి. ఈభావాలను నేటి జర్మను ప్రభుత్వం తమదేశపు వృత్తులను పునరుద్ధరించడంకోసం, జాత్యభివృద్ధి కనుకూలమైన వృత్తినియమాలను బలపరచడంకోసం ఉపయోగిస్తోంది.

ఈవిధంగా సంఘపునర్నిర్మాణ కార్యక్రమాన్ని మతోత్సాహంతో నింపి, వ్యక్తిలాభానికీ సంఘక్షేమానికీ అనుకూలమైన వృత్తినరాళ్లను నియమాలను కట్టుబాట్లను ఏర్పరిచి తద్ద్వారా ప్రజల వృత్తులనూ ఐశ్వర్యాన్నీ అభివృద్ధిచేసే ప్రయత్నం ప్రాచీనహిందూ ఆర్యులకూ, నేటికాలపు రష్యను కమ్యూనిస్టులకూ, జర్మను జాతీయ సామ్యవాదులకూ సామాన్య లక్షణం అనిచెప్పవచ్చును. వాటితోపాటు, ప్రాచీన హిందువులవలెనే నేటికాలపు నాజీజర్మనులుకూడా ఇల్లు, పొలము,- యీ రెండు సంస్థలకు ప్రాధాన్యం ఇస్తున్నారు. ప్రజాప్రభుత్వాలున్న దేశాలలో వీటికి పరపతి నశించి, యివి చెప్పరానివి, అనుకోరానివి అయినమాట నిజమే. దుర్భరమైన ఆర్థిక దుస్థితిలో ప్రారంభింపబడ్డ సంఘపునర్నిర్మాణ కార్యక్రమంలో రాజదండముయొక్క సహాయంతో తిరిగి ప్రాణంపోసి బ్రతికించిన యీపూర్వకాలపు సంస్థలను భూమిపై ఎంతకాలం నిలపగలం? ఎప్పటికీనా? ఈప్రశ్నలకు జవాబియ్యగలవాడు సృష్టి స్థితి లయ కారకుడైన భగవంతు డొక్కడే.

---

# క్రొత్తపాట

'వాధూల్'

మొయిలునడకలఁ గ్రొత్తహొయలు తోఁచినది!
మెఱపుచిందులఁ గ్రొత్తమిసిమి మించినది!
[illegible]కలమ్మును గ్రొత్తనడక నేర్చినది!
హృదయమ్ము క్రొంగ్రొత్త పదము పాడినది!

సీతమ్మశోకమ్ము, శ్రీకృష్ణలీల,
శ్రీరాము సత్యవాక్పారీణతయును
గానమ్ముచేసిన కవిలోకమునకు
మునలిసీతులవలని మోసమ్ము చాలు,
మతము పేరిటి ప్రాఁతకతలు చాల్చాలు,
అని చాటు మాట, యీ నా క్రొత్తపాట!

కవిసమయాల శృంఖలములఁ దవిలి,
ఉత్ప్రేక్ష, లుపమలు, నూరకే చొనిపి,
రంభోరువులు, హేమకుంభస్తను లని,
అవయవమ్ముల ననభ్యముగ వర్ణించు
విరసప్రబంధాలవృత్తమ్ము లింక
కాలగర్భమ్మునఁ గడతేర్పవలయు,
అను తేటమాట, యీ నా క్రొత్తపాట!
అశరీరయౌ సఖియాశ్లేషమునకు
పవలురేలను దీయబాధలఁ బొగిలి,
విరహాగ్నికీలల వేఁగి, తపించి,
తనియక,— భావగీతములను వ్రాసి,
తమ నూతనలయందుఁ గుములులోకమ్ము
వారిపై విరఁజిమ్మవలనుగాదింక
అను క్రొత్తమాట, యీనా క్రొత్తపాట!

దారిద్ర్యమందు,— స్వాతంత్ర్యమ్ము లేక
కష్టజీవిక ననుక్షణము భారముగ
గడపుచు— ముక్తికై యడలెడు మనకు—
జ్ఞానమ్మునకుఁ గానరాని యమూర్త
భావాలు వృత్తమా— పద్యాలవేల
అను తెల్విమాట, యీనా క్రొత్తపాట!

కనకసౌధాల సుఖాపేక్షఁ గులుకు
స్వార్థపరులును సౌహార్దహీనులును
ఊడిగము చేయింప, వాడు మొగాన
కాయకష్టమున రక్తము చెమటోడ్చి,
నవయు కార్మికుమాట, నా క్రొత్తపాట!

దారిద్ర్యతమసాన జలధిప్రళయము
తలపించు కార్మికుతన్వి కన్నీటి తేటఁ
గూర్చినమాట, నా క్రొత్తపాట!
జలధిప్రళయములోపలఁ జిన్నినావ
అనిపించు కార్మికుచినిపాప నవ్వు రేకఁ
గూర్చినమాట నా క్రొత్తపాట!

---

# వాతావరణ పరిశోధనము

గొబ్బూరి వేంకటానందరాఘవరావు

[మొన్నటి గాలిసుపాను ఆంధ్రదేశాన్నంతనూ భీభత్సంచేసి వదలిపెట్టింది. దేశానికి ఎంతనష్టం వచ్చిందో మన కందరికీ తెలిసినవిషయమే. కొంచెము ముందుగానే ఈవిధంగా గాలివాన వస్తుందని తెలిసివుంటే పల్లెటూరి పేద రైతులు మొదలైనవారు ఎంత జాగ్రతపడేవారో. ఆవిధంగా గాలివాన రాకటనుగురించి తెలుసుకోడానికి అవకాశం ఉందా?—ఉందనే ఈవ్యాసరచయిత శ్రీ వేంకటానందరాఘవరావుగారిజవాబు. ప్రతిపాఠశాలలోను ఇంగ్లాండులో లాగ 'వెదర్ క్లబ్బు'లు పెడితే బాగుంటుందని వారి సలహా. అట్టిక్లబ్బులు ఒకటి యలమంచిలి (విశాఖపట్నంలో స్థాపితమయిందనీ, విజయనగరం, అనకాపల్లిపాఠశాలలలో స్థాపింపబడనున్నాయనీ వినికిడి. విషయం ఇటువంటిదవడంచేత ఈవ్యాసం అవశ్యపఠనీయం. —భా. సం.]

మన దేశములో బంధుమిత్రు లొకచోట సమావేశ మైనపుడు ముందుగా కుశలప్రశ్నము లైనతరువాత విశేషములనుగూర్చి సంభాషణలు జరుగుచుండును. ఆడువా రొకచోట సమావేశ మైనపుడు "మీయింటిలో ఏమి వండుకొనినా" రను ప్రశ్నలతో సంభాషణ ప్రారంభింతురు. ఇంగ్లండు దేశములో వాతావరణవిషయమైన ప్రసంగముతో సంభాషణ ప్రారంభమగును. ఆ చలిదేశములో ప్రజలు ఎండకొఱకును వెలుగుకొఱకును నిజముగా వాచిపోవుచుందురు. మబ్బు పట్టిన దినములు లోకమంతటను దుర్దినములుగానే భావింపబడుచున్నవి. మేఘచ్ఛన్నమైన దినములలో బుద్ధివికాస ముండదు. హెచ్చరిక తక్కువ: మాంద్య మావేశించును. గ్రీష్మతాప మధికమైనపుడు పని చేయలేము. మంచు, రొజ్జగాలి, తేమ, మొదలగు పరిస్థితులలో పడిసెము, జలుబు, శైత్యము చేసి చికాకుపడుదుము. మనచుట్టు నున్న పరిసరస్థితులనుబట్టి మన దినచర్య నడుచుచుండును. వర్ష, శీతాతప, మేఘ, ఆర్ద్రతాది మన పరిసరస్థితుల సముదాయమునకే వాతావరణస్థితి యని పేరు.

మన దినచర్య, మన ఆరోగ్యము, వ్యవసాయపుపనులు, మనసంఘజీవనము, మన భావి భాగ్యోదయము - ఇవన్నియు వాతావరణస్థితిని బట్టియే నిర్ణయింపబడుచున్నవి. వ్యవసాయప్రియులైన ఆర్యులు ఈ పరిస్థితులను గమనించుకొని ఆయా నక్షత్రములకు ఆయా అధిదేవతలను నిర్ణయించుకొని, వారియెడల భయభక్తులు గలిగి యజ్ఞయాగాదులు చేసి స్తుతించి హవిర్భాగములిచ్చి కొలుచుచుండిరి. కృత్తికలు సూర్యునిలో నున్న దినములు మిక్కిలి వేడిగానుండి వేంద్రము పుట్టించుట చేత కృత్తిక అగ్ని దైవత్య మనిరి. స్వాతిని వాయుదైవత్య మనిరి. బందరు ఉప్పెన-గాలివానలు- వరదలు- మొదలగు ప్రమాదములు సాధారణముగా స్వాతికార్తిలో వచ్చుచుండును. మేఘాధిపతి ఇంద్రుడు-వర్షాధిపతి వరుణుడు. శాస్త్రదృష్టితో పరిశీలించినపుడు వేదవాఙ్మయమునందును శ్రౌతకర్మలయందును వాతావరణ పరిస్థితుల ప్రాముఖ్యమే ముఖ్యముగా తెలియనగుచుండును.

పిమ్మటకూడ జ్యోతిశ్శాస్త్ర వేత్తలు ఈ పరిశోధనము విడువక సాగించుచు పెక్కుగ్రంథములు వ్రాసియున్నారు. అందు కొందరి గ్రంథములు ఇంకను నిలిచియున్నవి- గర్గాచార్యులు, హరిభట్టు, ధన్వుడు, శ్రీపతి, నారాయణభట్టు మొదలగు మహామహులు ఈ శాస్త్రమును తెలుగు గ్రంథములను రచించిరి. మేఘమాలిక శాస్త్రము, జ్యోతిష సారము, సస్యానందము మొదలగు గ్రంథము లెన్నియో కలవు. రెట్టడను కర్ణాటకవి ఆ భాషలో రచించిన రెట్టమతశాస్త్రము నూట యెబ్బది సంవత్సరముల క్రిందట తెనిగింపబడినది.

ఈ శాస్త్రము లోకోపకారకము నిక్కము, ప్రత్యక్షము, అత్యవసరము నగుటచేతను, గ్రామజీవనములో వ్యవసాయాదులకు తరుణము నెరిగించుట మిక్కిలి ముఖ్యమగుటచేతను పూర్వప్రభువులు అగ్రహారములిచ్చి జ్యోతిష్కులను రావించి గ్రామములలో నిలిపిరి. ఇప్పటికిని పురోహిత మాన్యముల జప్తు, విక్రయములు నేటి న్యాయశాస్త్రము నిషేధించుచున్నది.

స్వయంపరిశోధనలు లేకను, ప్రకృతి విజ్ఞాన మల్పమగుటచేతను, వెనుకటి శాస్త్ర గ్రంథములు సరిగా అన్వయించుకొనుటకు కావలసినకృషి తక్కువగుటచేతను మన పూర్వుల వాతావరణవిజ్ఞానము ఈనాటి పంచాంగకర్తల చేతులలో చాల నీరసస్థితికి వచ్చినది. పూర్తిపంటలు వ్రాసినపుడు పూర్తిగా కరువు పట్టుచుండుటచేతను, నాలుగు కుంచములు వర్షము వ్రాసిన సంవత్సరములలో శ్రావణ భాద్రపదములలో కూడ త్రాగుటకు నీళ్లు దొరకక వఱపులు పట్టుటచేతను, మన ప్రజలకు ఈ శాస్త్రము నందు నమ్మకము తగ్గిపోయినది. ఈ జ్యోతిష్కుల ధర్మములు కొంతవఱకు మన ప్రభుత్వమువారి (Metereological Department) వాతావరణశాఖచే నిర్వర్తింపబడుచున్నవి. ఆశాఖవారు అక్కడక్కడ ముఖ్యపట్టణములలోమాత్రము కార్యస్థానముల నేర్పరచినారు. పూనాలో ముఖ్యస్థాన ముంచినారు. ఆ శాఖలో జరుగవలసిన పని జరుగకున్నది. అమెరికాఖండములో ప్రజలును ప్రభుత్వమువారును కలసి పరస్పర సాహాయ్యము చేసికొనుచు ఎంతో ప్రజాసేవ చేయుచున్నారు. అచటి విద్యార్థులు స్కూళ్లలోను కాలేజీలలోను 'వెదర్ క్లబ్బు'లను ఏర్పరచి ప్రతిదినమును ఖగోళ, భూగోళ -విశేషములను గమనించి అంతరిక్ష పరీక్ష గావించి, వాతావరణపరిస్థితులను ముందుగా వ్యవసాయదారులకు తెలుపుదురు.

'వాన రాకట - ప్రాణముపోకట' ఎవరు చెప్పగల రని సామెత యున్నది. కాని, క్రమమైన పరిశోధనలవలన రెండును ముందుగా చెప్పవచ్చును. రాత్రి ఎంత మంచు ఏవిధముగా కురియునో తెలిపి పంటలను జాగ్రత్తగ కాచుకొనుటకు అమెరికా కర్షకులకు విద్యార్థులు ముందుగా భోగట్టా ఇచ్చుచుందురు. ఈ దేశములో గాలివాన వెలసిన 3 రోజులకుగాని ఏసంగతి తెలియదు. మొన్నటి వంశధారప్రళయము, పిమ్మటి గాలివాన ఎందరికి ఎప్పుడు తెలిసినది? ఆప్రాంతములందు వాతావరణపరిశోధన ముండిన పక్షమున ఒకటి రెండు రోజులు ముందుగా తెలిసికొనిఉండరా? జాగ్రతపడరా? ఇంతటి

కష్టముపాల్పడుదురా ? అది అకస్మిక మందు రా ? కాదని ఖండించి చెప్పెదను.

సృష్టిలో అకస్మికముగాను, హఠాత్తు గాను, ఎప్పుడును ఏమియు జరుగదు. ఒక క్షణములో పువ్వులు పూయవు, కాయలు కాయవు, పండ్లు పండవు.

అట్లే గాలివానలు- తుపానులు- ఉప్పె నలు అకస్మికముగా రావు. ఈవేళ ఇక్కడ గాలివాన విసరి తుపాను పట్టిన దనుకొంద ము. ఆగాలివాన సుమారు పదిదినముల క్రిందట అండమానుదీవులలో బయలుదేరి, ప్రకృతి నిర్ణీతమార్గముల ద్వారా పోయి పోయి యీ ప్రాంతమును జేరుకొనును గాని, అప్పటికప్పుడు సృష్టింపబడదు. ప్రతి మేఘము - ప్రతి జల్లు - ప్రతిక్షణమున కాయు ఎండ - పట్టుమబ్బు - కలుగుసీడ— కురియు మంచు - మొదలగునవి తత్పూర్వపు పరిస్థితులనుపట్టి వచ్చుచుండును. వీనిని రూఢిగా నిర్ణయించుట కు పాశ్చాత్య నిర్మితములైన యంత్రపరికరము లున్నవి. అందు కొన్ని మన స్కూళ్లలోకూడ కలవు. ఏవేళ నైనను వేడిమి యెంతో తెలిసి కొనుటకు 'థెర్మామిటరు' లున్నవి. గాలిపోటు బల (air pressure) మెంతో తెలుపుటకు 'బరా మిటర్' (Barometer) సాధనము లున్నవి. పాద రస మక్కఅలేక పోటు తెలుపు 'ఏనిరాయిడ్ మీటరు' (Aneroid Barometer) లు ఉన్నవి. ఏక్షణములో గాలిపోటు ఎంతో స్వయముగా లిఖించుకొనుటకు బేరోగ్రాఫు లున్నవి. గాలి లో తేమ-అనగా నీటియావిరి ఎంత కలదో లెక్కించి చెప్పుటకు తడిథెర్మామిటరు లున్న వి. హిమద్రవ నిరూపణమునకు హైగ్రో మీటరు లున్నవి. కురిసినవర్ష మెంతో నిర్ణ యించుకొనుటకు వర్ష మానము (Rain guage) ఉన్నది. గాలి ఎటు విసరుచున్నదో తెలుపు టకు వెదర్ కాక్ లు (Weather-cock) ఉన్నవి. గాలివేగ మెంతో తెలుపుటకును మీటర్లు ఉన్నవి.

ఈ యంత్రము లెట్లు పనిచేయుచున్న వో మన పిన్నవాండ్రు తెలిసికొనవలయును. దినపత్రికలలో ప్రకటింపబడు వాతావరణ స్థితులను తెలిసికొనుటకు ఈ విజ్ఞానము అవ సరము. అంతేకాదు. వాతావరణ స్థితులను తెలిసికొనుటకు బాలురలో సంకల్పము కలుగవలెను. సంకల్ప మున్నయెడల యంత్ర ములు లేకున్నను పనిచేయవచ్చును. న్యూట ను బాలుడై యుండగా తుపాను వీచెనట. ఆ తుపానుబల మెంతో నిర్ణయించుటకు ఒక చిత్రమైన పద్ధతిని అత డవలంబించెను. గాలి తో పోవుచు మినిటులో ఎన్ని గంతులు వేసెనో, గాలి కెదురుగా పోవుచు అదే కాలములో తాను ఎన్ని గంతులు వేసెనో అతడు లెక్కవేసిచూచెను. భేదము తుపాను బలమని నిర్ణయించెను. కాబట్టి ముందుగా బాలురలో ఈ సంకల్పము కలిగించవలెను. పిమ్మట క్రమముగా పాశ్చాత్య శాస్త్రము లను మన దేశపు శాస్త్రములను చదువుకొని సమన్వయించి దేశక్షేమమునకు పనిచేయ వలెను.

# చిత్రనటన

సామవేదం జానకిరామ శర్మ.

తెరవెనుకనుండి చిత్రచిత్రితములైన
పాత్రల ధరింపఁజేసి, ఉపాయ మింత
నవ్యమార్గాన నటియింప స్వామి! నాకు
బోధసేయవు.
మఱచిన పూర్వవృత్త
మడుగరా దెట్టిసూత్రధారుఁడవో! నీవు!

"ఇది విచిత్రమ్ము! భౌతికాహీనపాత్ర!
ఇదియె తుదిగ్రంథ మిందె నీయిచ్చవచ్చి
నన్ని గుణములు, రీతులు, నున్నవెట్లు
నటనఁజేసెదో! పఠియింతో! నవ్యరీతి!"
అని ప్రబోధించి రిపుషట్కమును లగించి
అప్రయుక్తాదిదోషమ్ము లందు జొనిపి,
వికృతహాసమ్ము జేతు!
సేవింప నిన్ను,

నా కమృతపాత్ర, సద్గ్రంథ మీక విడువ!
ఒకమహారాజపాత్రనే యొసఁగి నన్ను
ప్రకటితానేకదుర్వ్యథాస్పదునిఁ జేయ
వలదు; నీచాతినీచపాత్రలనె యొకటి
నవ్యనటన మొనర్చెడు శక్తితోడ
కరుణఁ దయసేయు,
తుదిమొదల్ గానబడని
ఈకళాశాల శలవుల కెన్నడేని
మూయబడునొక్కొ! నటకులు పూర్ణశక్తి
యోగ్యతాపత్రముల నందియుండి రెపుడో!

ఎద విచారించి, నటనలో మది భ్రమించ
నీక, ఒక్కటె ఆవర్శనియతిఁ బూని
నిన్నుఁ దెరవెన్కగా దాగియున్నవాని
దలఁచెద మరొక్కసారి, చేతులు మొగిడ్చి.

ఈమహానాటకమ్మున కెపుడు భరత
వాక్యము పఠింతో! నటియింప వశముదప్పి,
అంగనికరమ్ము శిథిలమ్ము నయ్యె, మరల
నన్ను రంగాన నిలుప కీ వెన్నటికిని.



# 'నిరుద్యోగం'

దెందులూరి వీరరాఘవరావు

శ్రావణమాసం అయినప్పటికీ, తన హయాంలో వర్షానికి అప్పిచ్చినట్టైయుని, సూర్యుడు వడ్డీతో తీర్చుకుంటున్నాడు. నేను, సెప్టెంబరు పరీక్షలు దగ్గిరికి రావడంచేత కాకినాడలోనే, ఒకరూము తీసుకుని, చదువుకుంటున్నాను. మధ్యాహ్నం మూడు గంటలైంది. అప్పుడే కాఫీ త్రాగి, మిత్రా గారి కెమిస్ట్రీ తీసి ఆక్సిజన్ (Oxygen) చదవడం మొదలు పెట్టేను. రూము తలుపు తీసికొని, ఒకవ్యక్తి ప్రవేశించేడు. అపరిచితుడులాగే కనపడ్డాడు. నిదానించి చూస్తే రెండు సంవత్సరముల క్రిందటి క్లాసు మేటులాగ ఒక చిన్నజ్యోతి నాదృష్టిముందు నాట్యం చేసింది. ఎవరైతేనేమి, ముందు చిన్నహాసమే కుశల ప్రశ్న.

"మరిచిపోయావుటోయి! అవును లే. మాలాటి వాళ్లు మీ కెలా జ్ఞాపకం ఉంటారు? అయితే, యింకా నువ్వు యీ గ్రూపుతోనే కుస్తీపడుతున్నావా?" అని పరిచితకంఠస్వని.

నాసందేహం తీరిపోయింది. నేను యింటరుజూనియరు చదువుతున్నప్పుడు నాప్రక్క నెంబరే అతనిది. అప్పుడు మే మిద్దరం సోదరులలాగ తిరిగేవాళ్లం. తండ్రి చనిపోవడంచేత, కుటుంబభారం నెత్తిమీద పడి, అంతటితోనే ముగించేసేడు చదువు. అప్పటినుండీ నే నతన్ని చూడలేదు. అందుచేత త్వరగా గుర్తు పట్టలేకపోయేను.

"ఏమోయి! రామారావూ! ఎక్కడినుండి రావడం? ఏమిటి సంగతులు? ఈ రెండేళ్లనుంచీ నీసంగతే తెలీలేదు నాకు! మీవాళ్లంతా ఖులాసాగా ఉన్నారా? రా! యిలా కూర్చో" అని ప్రశ్న పరంపర పుంఖానుపుంఖాలుగా జల్లేసేను.

"అందరూ ఖులాసాగానే ఉన్నారు. కాని నీబస వెతుక్కోవడం చాలా కష్టమైంది. ఎవరిని అడిగినా ఎవరికీ తెలీదన్నారు. ఇంక వెతుక్కోలే ననుకొని, బజారులో కొంచెం పనుంటే, అలా పోతున్నాను. ఇంతట్లోకే మన ఫ్రెండు వెంకట్రాజు కాఫీహోటల్లోంచి వస్తున్నాడు. వాణ్ణి పట్టుకున్నా కాని లేకపోతే నాకీ బస తెలియకపోను" అన్నాడు చిరుచెమట్లు తుడుచుకుంటూ.

ఈలోపుని మావానీది పైకమ్మ వచ్చింది. దాని చేతికి ఒకఅణాడబ్బులు, ఫ్లాస్కు యిచ్చి, అతిథికోసం, కాఫీ తెమ్మనమని చెప్పి పంపేను. విసుక్కుంటూ పోయింది.

"ఏం, రామారావు! ఏమిటి చేస్తున్నావు?" అని మామూలుగా అడిగేను, అతని అలసటతీరక.

నవ్వుతూ వచ్చినముఖం, ఎంచేతో విషాదరేఖాంకితమైంది. మనిషి సిగ్గుపడిపోయేడు.

"ఏమిటి చేస్తున్నాను? ఏమీ లేదు. ఎవళ్లేనా 'ఏమిటి చేస్తున్నావు' అని అడిగితే 'నిరుద్యోగం' అని చెప్పడం అలవాటైపోయింది" అన్నాడు, విచార సమ్మిళితమైన చిరునవ్వుతో.

"ఎక్కడేనా ట్రైచేసేవా?" అన్నాను.

"ఎక్కడేనా ఏమిటోయి! 'అక్కడ ట్రైచేసేను యిక్కడ ట్రైచెయ్యలేదు' అన్న నివక్షత లేకుండా ప్రతీ కంపెనీలోనూ ట్రై చేసేను. ఎన్నివిధాల మార్గాలున్నాయో, అన్నీ చూసేను. కాని ఏంలాభం! మా ఫాదరు చనిపోవడంతోనే పోయిందోయి మా అదృష్టం అంతాను. కొంపా గోడీ అమ్మేసి ఋణంఅంతా తీర్చేనేటప్పటికి, చేతిలో చిల్లిగవ్వైనా లేకుండాపోయింది. మాతల్లిని, పిల్లల్ని, మా మేనమామగారింట్లో వుంచి, నేను ఉద్యోగంకోసం తంటాలు పడుతున్నాను. ఏకంపెనీకి వెళ్లినా, గేటుముందు 'నో వేకెన్సీ' (No Vacancy) బోర్డులే! పోనీ, తీరా జేసి, బంట్రోతుకి ఏపావలాడబ్బులో పారేసి అప్లికేషను లోపలికి పంపిస్తే ఎన్నిరోజులు

చూస్తున్నా దానికి జవాబు రాదే! ఇవతల నాలాటివాళ్లు పడిగాపులు పడి చూస్తున్నా, కంపెనీ యజమానుల బంధువులు, మిత్రులు, పెద్ద పెద్ద రికమెండేషనులు పట్టుకెళ్లిన వాళ్లు క్రొత్తగా ప్రవేశిస్తున్నారే, ఉద్యోగాల్లో! మన దేవుచూసేవా డెవడు? మేనేజరుగారు అప్లికేషను చూసీ చూడకుండానే 'ఎవడో కోణకిస్కాయిగాడు' అని వేస్టుపేపరుబాస్కెట్టులో పారేస్తాడు. అదే తన వాళ్ల దెవళ్లదేనా అయితే పెద్ద రికమెండేష నేదేనా ఉంటే, నెత్తిమీద పెట్టుకుని, అప్పటికి కాళీలు లేక పోయినాసరే, కాళీలు పుట్టించి, మరీయిస్తాడు ఉద్యోగం. పోనీ, యివతలకి వచ్చినప్పుడో, లేక వైరువెళ్లేటప్పుడో, ఎలాగో, వకలాగ, బంట్రోతులు చెయ్యిపెట్టి గెంటేసినాసరే ఓర్చుకుని, మేనేజరుగారిని దర్శించి పరిస్థితులు చెప్పుకుందామంటే, "ఇప్పుడేం కాళీలు లేవు. పో!" అన్నమాటేగాని, "నువ్వేమి ప్యాసయ్యేవు? ఏంపని చెయ్యగలవు?" అనికాని, లేక "ఇప్పుడు కాళీలు లేవు. ఈసారి కాళీలు వచ్చినప్పుడు రా. చూస్తాను" అని (అలా చెయ్యనప్పటికీ) మాటఅనే దాత లేడే! నిరాశ పుట్టింది నాకు. ఉద్యోగం దొరకడం కష్టం అనుకున్నాను.

"అంచేత, ఇంకోపద్ధతి అవలంబించేను. హిందూ పేపరు, అలాటివాట్లలో ఉద్యోగస్థులు "కావలెను (**Wanted**)"అని ఎడ్వర్టయిజు చేస్తారుకాదూ? అప్లై చెయ్యగా, ఎప్పటికేనా దొరుకుతుంది అనే ఆశతో కొన్నిటికి అప్లై చేసేను. ఉత్తర ప్రత్యుత్తరాలకి ౨ అణాల స్టాంపులు వాళ్లు కోరినప్రకారం, పంపితే, జవాబులేదే! 'ఏమిట్రా, యిలాఎందుకురా ఎడ్వర్టయిజు చేస్తారు' అని మావాడిని ఒకణ్ణి అడిగితే, 'నీకు తెలీదుటరా! డబ్బు సంపాదించడానికి అదోకఎత్తు. నీలాటి వాళ్లు పంపించిన ఆ ౨ అణాల స్టాంపులు పుచ్చుకుని ఊరుకుంటారు. మనం చేసేదేమిటి వాళ్లని?' అని అన్నాడు. 'కావలెను'లేకాని, కావలసినవా రెవ్వరూ కనపడరు. బహుశా, మావాడు చెప్పినట్లు, కావలసినవి ఆ ౨ అణాల స్టాంపులే. అంచేత ఇంక 'కావలెను'లని అక్కర్లే దన్నాను.

"'ఏమిరా! ఊరికే తిరక్కుండా, ఏమేనా టెక్నికల్సు చేర్చుకోలేకపోయావురా!' అని పెద్దలంతా అంటే, ఒకసంవత్సరం కష్టపడి టైపురైటింగు, హైయ్యరుపరీక్షకి షార్టుహాండ్ లోయరుపరీక్షకీ, రాజమండ్రిసెంటరుకి, కట్టేను. నాకు స్పీడు లేకనో, హాలు సూపరింటెండెంటుల తెలివితక్కువ చేతనో మొదటి పేపరు, పూర్తి చెయ్యలేకపోయేను. అంచేత అది తన్నేసింది. ఎప్పుడూ బాగా చెప్పని అయ్యరుగారు, ఆరోజు డిక్టేషను బాగా చెప్పడంచేత, షార్టుహాండ్ ప్యాసవుతుంది అనుకున్నాను. కాని, ఎవళ్లో కాపీచేసేరని చెప్పి, ఒక్కణ్ణి తప్ప, అందరినీ ఫేలుచేసేరు. అదీ నాదురదృష్టమే.

"సర్వీసు కమిషనుపరీక్షకి వెళ్లలేకపోయావా?" అని నీలాంటివాళ్లంటే, ఆపరీక్షకి వెళ్లడానికి ఇంగ్లీషులో ౪౦మార్కులు రావాలిట! మనకి ౩౯ ఏకాదూ వస్తా! అంచేత వీల్లేకపోయింది."

"అన్నట్టు, పోస్టలు ఎక్జామినేషను, అంటూ ఏదో పెట్టేరు కాబోసు! దానికి వెళ్లేవా?" అన్నాను, జ్ఞాపకంవచ్చి.

"ఉద్యోగా లిస్తాం పరీక్షలు ప్యాసవండిరా అంటే మాలాటివాళ్లు పరీక్షలకి వెళ్లకుండా వుంటారా! అది కూడా సర్వీసు కమిషనులాటిదే. నానా తంటాలు పడితేనేగాని ఎక్జామినేషనులో కూమందుకే సీటు వచ్చింది కాదు. ఒక ౨౦ రూపాయలు ఖర్చుపెట్టి పరీక్షకి బెజవాడ వెళ్లేను. పరీక్షలైన నాలుగునెలలకి కాని పరీక్షలు ఏమయ్యాయో తెలీలేదు. వాళ్లు సెలెక్టుచేసిన వాళ్లకే తెలియ జేస్తారుట, తక్కిన వాళ్లసంగతి, పోయినట్టేట. వాళ్లకి కావలసిన గుమస్తాలు, పెద్దసంఖ్య అయినప్పటికీ వాళ్లు సెలక్టుచేసేది యిద్దరినో, ముగ్గురినో. అదేనా పెద్ద రికమెండేషను లుంటేనేట! తక్కినకాళీలు, వాళ్లబంధువులు, అదివరకే ఆక్రమించేసి ఉంటారు! వాళ్లుకూడా ఆలోచించేరులే. డబ్బు సంపాదనకి మనిషికి ౧౦ రూపాయలు ఎక్జైమిన్సుఫీజు. చూడు ఎంత డబ్బొస్తుందోను! కొత్తగా వేసిన గుమస్తాల జీతాలకి సరిపోతుంది!" అని అన్నాడు.

"అయితే! అన్నివిధాలా ప్రయత్నించే వన్న మాట. ఏం చేస్తాములే. రోజులు రావాలి" అన్నాను, ఏమీ అనకపోతే బాగుండదని.

"ఏవిధంగా చూసినా, ఎన్నివిధాల ప్రయత్నించినా ఉద్యోగం దొరకడం అనేది యీకాలంలో చాలా కష్టంఅని నాఅభిప్రాయం. "ఏమిటండీ, శాస్త్రుల్లుగారూ! నాజాతకం ఎప్పుడు బాగుంటుందో చూడండి కొంచెం" అని మాశాస్త్రుల్లుగార్ని అడిగితే, 'నీకు శనిమహాదశ పోయి, యిప్పుడు. ఇంకా సంవత్సరంన్నర, దాని టైము; తర్వాత మంచి రాజయోగం పడుతుంది' అని యేవో గ్రహాలపేర్లు నాలుగు చెప్పి పంపించేసేడు. పోనీ, ఉద్యోగం దొరకకపోతే పోయె, ఏదేనా స్వతంత్రవృత్తి చేద్దామా అంటే, దానికి పెట్టుబడి వుండాలి, బిజినెస్సు కిటుకులూ, అవీ తెలియాలి. అవి మనకి రావు. దుర్గుణాలు అలవడతాయని తెలిసున్నప్పటికీ, తెగించి సినీమాల్లోకి పోదామా అంటే, పాట రాదు కాదూ. మనం పాడితే...... చెవులు నిక్కబెట్టి నించుంటాయి, రిప్లై యివ్వడానికి. సినీమాలకి ఆపాటచాలంటావేమో! డైరక్టరుగారికి అన్నివిధాలా యిష్టపడితేనేగాని ఆయన తీసికోడు! ఇంక, ఏదేనా లాటరీల లోను వాట్లలోను మనకి 'అదృష్టం' ఉంటుందేమో అనుకున్నాను. అందుచేత, ఇలస్ట్రేటెడ్ వీక్లీ (Illustrated Weekly)లోని పజిల్సు (Puzzles) పూర్తిచెయ్యడం మొదలుపెట్టేను. అదేం మాయోకాని, పంపించినకొద్దీ పంపించాలనే వుంటుంది! అలాగ వాటికి రెండునెలలలో ౨౦ రూపాయలు తగలబెట్టేను. నమ్మి నమ్మకపో, ఎన్ని డిక్షనరీలు చూసి సాల్వ్‌చేసినా, ఫస్టుప్రైజు మాటె నాలుగుతప్పుల ప్రైజేనా రాకపోయె.

"సాయశక్తులా తంటాలు పడ్డాను. పడుతున్నాను. ఆఖరికి ఆలివర్ గోల్డ్‌స్మిత్ (Oliver Goldsmith) చేసినట్టు, పత్రికలకు వ్యాసాలు పంపించి కొద్దో గొప్పో సంపాదించొచ్చును అని అనుకున్నాను. స్వతంత్రకథ రాస్తే పెద్దలు తప్పులు పట్టుకుంటారనిచెప్పి, ఒకయింగ్లీషుకథకి అనువాదం పంపించేను, ఒకపత్రికకు. అందినట్టు తెలియజేయడానికి అందులో ఒక కార్డు పెట్టి పంపించేను. దానికి తిక్కూ లేదూ మొక్కూ లేదు. అసలు అది అందిందో లేదో తెలీదు. పైగా 'వ్యాసాలు పంపి ఆంధ్రులు ప్రోత్సహించా'లని సంపాదకుల సంపాదకీయం. ఇంకొక అనువాదం ఇంకొక పత్రికకు పంపిస్తే, ఆ సంపాదకుడు, పాపం, జవాబిచ్చేడు. 'వ్యాసాలు ఎక్కువగా రావడంచేత, తమకథ ప్రస్తుతం ప్రకటించడానికి వీలుగాలేనట్లు తోస్తూంది. క్షమించవలెను' అని. కథ వెయ్యనీ వెయ్యకపోనీ, ఏదో సమాధానం పారేస్తే బాగుంటుంది. మనకార్డు మనకి పారెయ్యడానికే అంతగర్వం అయితే, యింక వేరే చెప్పాలా!" అన్నాడు కొంచెం కోపంతో.

అప్పుడే మాపైనమ్మ కాఫీతెచ్చింది. ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసి అతని కిచ్చేను. బలవంతంమీద నేను కొంచెం ఇంకోగ్లాసులో పోసుకున్నాను.

"ఇదీ నాసంగతి. ఇలాగ ఈ 'నిరుద్యోగం' అనే సాగరంలో పడి కొట్టుకుంటున్నాను దారీ తెన్నూ తెలీక" అన్నాడు, గ్లాసు కిందపెడుతూ. "కాంగ్రెసు గవర్నమెంటువారు నిరుద్యోగ సమస్యని పరిష్కరిస్తారనుకొన్నారు ప్రజలు. ఎంతవరకూ సాగిందో తెలీదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమం గెలుస్తే, ఆంధ్రులికి బాధ లేదనుకున్నాను. కాని హైకమాండ్ (High Command) 'ఇప్పుడు కాదు నాయనలారా! కొన్నాళ్లు పోనీయండి!' అని బుజ్జగిస్తున్నాది. కారణం..."

"ఆగాడవకేంగాని, యింతకీ, యిప్పుడు నువ్వేం చేస్తున్నట్టూ?" అని అడిగేను. ఒదిలేస్తే లెక్చరు కొట్టేస్తాడని చెప్పి.

"ఏముంది, ౧౦ రూపాయ లొచ్చేలాగా ప్రైవేట్లు చెప్పుకుంటున్నాను. పోనీ అవేనా యేడాది పొడుగునా వుంటే యీబాధ పడక్కర్లేదు. పరీక్షల ముందు ఒకనెల, అంతే. తర్వాత మళ్లీ మామూలే" అన్నాడు.

వాచీలో సెకండుహాండ్ రెండుసార్లు ౬౦ని దాటింది.

"ఏమోయి! మీవూరి పంచదార ఫాక్టరీలో ఏవో కాలీలు వచ్చాయట నీ కేమేనా తెలుసునా?" అని అడిగేడు సందేహంతో.

"కూలీల మాటకేంగాని, కూలీలంతా యిప్పుడు స్ట్రయికు (Strike) చేస్తున్నారోయి!"

అందుకున్నాడు స్ట్రయికు అన్నమాట!

"ఏమిటోయి! ఎక్కడ చూసినా యీస్ట్రయికులే నోయ్. మాట్లాడితే సమ్మె. అదివరకు కూలీలంతా సమ్మె కట్టేరంటే, ఆశ్చర్యపడేవారు అందరూను. ఇప్పుడది మామూలు అయిపోయింది. పాకీదాన్ని దొడ్డి సరిగ్గా తుడవమంటే, మర్నాడు స్ట్రయికు. చాకలాడిని బట్టలు సరీగా వుతకమంటే, వాళ్లు స్ట్రయికుచేస్తారు! ఇదంతా మనవాళ్లు నేర్పిందే. వాళ్లు సదుద్దేశంతోటే నేర్పేరు. కాని ఏంలాభం? 'వద్దు. చెయ్యకండి, మేము చూస్తాం మీవిషయాలని' అని అంటే వినరే. సమ్మెకట్టడం, నలుగురిబుర్రలు బద్దలు కొట్టడం, గలభ సెక్షను యిప్పించుకోడం. పోనీ కూలీలు, ఎలాగో మేనేజరులతోటి రాజీ పడతాం అంటే మధ్యని లీడర్సు వప్పుకోరే! వీధంట తిరిగే ప్రతీపెద్దమనిషీ లీడరే! ఈ సమ్మెలకి, ఏవో కొన్ని నిబంధనలు పెడితేనేగాని, పరిశ్రమలా క్షీణ దశలో ఉంటాయి, కార్మికులా, కష్టాలకి పాల్పడుతారు!—అయితే, ఎన్నాళ్లనుంచి జరుగుతున్నాది? రాజీ కుదుర్తుందా?" అని అడిగేడు.

"ఈ వాళ్టికి ౬ రోజులైంది. రేపు పార్లమెంటరీ సెక్రటరీగారో, ఎవరో వస్తారుట, బహుశా రాజీ కుదర వచ్చు" అని నే నన్నాను.

"అలాగటోయ్! నాకు తెలలేదు. ఏవో ఖాళీ లున్నాయంటే, ఆళ్ళ కాదూమరి, మీ బ్రదరు అక్కడ పనిచేస్తున్నాడు కాబట్టి నీకు బాగా తెలుస్తుంది. నిన్న కనుక్కుందామని యిక్కడికి వచ్చాను" అని అన్నాడు.

"వాళ్లు యీగొడవలో పడివున్నారు. అంచేత యిప్పుడేం లాభం లేదనుకుంటాను" అని, ఏమనుకుంటాడో అని భయపడుతూ అన్నాను.

"యిప్పుడు కాదు. ఎప్పుడేనా లాభం లేదు! ఇంక యీఘటం యిలా పోవలసిందే" అన్నాడు శూన్య దృష్టితో.

నాకు జాలివేసింది.

అప్పుడే నాలుగున్నర అయింది.

"వాలీబాల్ కోర్టుకి (Volley-ball Court) పోదాం పదవోయ్. చాలాకాలం అయింది కాబోసు నువ్వు బంతి ముట్టుకుని" అని అన్నాను లేస్తూ.

"పద" అన్నాడు, కోటు విప్పేస్తూ.





# వయోజనవిద్య

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## పదము క్రొత్తది: విషయము ప్రాతది.

మన దేశానికి "వయోజనవిద్య" అనే యీపదము క్రొత్తది. కాని దీనిచే సూచితమయ్యే విషయము ప్రాతది.

ఈ భారతభూమిలో "మోక్ష"మనేపదార్థాన్ని సర్వకాలము అనాదిగా మన పెద్దలు కోరినారు. అది ఒక వ్యక్తికోసము, ఒక తెగకోసము, ఒక కులముకోసము, ఒక జాతికోసము కోరినది కాదు. అది సర్వమానవసంతతికోసము కోరినది. అప్పుడు మనవారు సర్వమానవసంతతి అనుకొన్నది ఇప్పుడు మనము అనుకున్నంత విస్తారమైనది కావచ్చును; కాకపోవచ్చును. సర్వ అయిరోపా నాగరికానికి మార్గదర్శకంగా వారంగీకరించే గ్రీసు దేశములోని ప్రాచీన ఆథెన్సులోనే సర్వమానవదృష్టి సోక్రటీసు, ప్లేటోలవంటి తత్త్వవేత్తలకే కుదిరియుండడానికి లేదు. అప్పటి ఆ నగరములో 'బానిస'లున్నారు. కాని వీరిని గూర్చి ఆలోచించినా గ్రీకులోని మహాసంస్కర్తలు, వాఙ్మయ నిర్మాతలు, కవులు, గాయకులు ఎవరును ఈ బానిసలను మనసున పెట్టుకొని వ్యవహరించినట్లు కన్పించదు. అయితే ఆకాలమున కప్పుడే మన దేశమునందు వేదయుగము, వేదాంతయుగము, పురాణయుగములు కడచి బౌద్ధయుగమున ప్రవేశించియుండినాము. అప్పటికే ప్రాతపడిపోయి ప్రజాసమూహానికి అర్థముకానట్టి సంస్కృతభాష నట్టేమూరాన ఉంచి ప్రాకృతభాషలలో, అంటే నాటి వ్యవహారభాషలలో, ప్రజల విజ్ఞాన వికాసాలు వ్యాపింపజేయడానికి రాతిస్తంభాలమీద ధర్మాన్ని, లోకకల్యాణ సాధకమయిన సత్యాహింసాదుల వర్తనలయావశ్యకాన్ని, చక్కని అక్షరాలలో చెక్కించి అందరును చదువుకోవలసిందని ఆజ్ఞచేసిన కరుణాసాంద్రుడశోకుని పోలిన చక్రవర్తికి సాటియైన ప్రభువు కనుపించినాడా? నాడు అచ్చుయంత్రాలూ కాగితాలూ మనకు తెలిసినంతవరకు, లేవు. అందుచేత ఈనాటివలె లక్షలకొలది ప్రచారము చేయడానికి పనికివచ్చే పుస్తకాలు పత్రికలు బయలుదేరలేదు. కాని ఈనాటి "వయోజనవిద్య" దృష్టి ఆనాడే మన దేశములో ఉండడానికి ఇంతకంటె ప్రబలతరనిదర్శనము వ్రాయనక్కరలేదు.

## శ్రవణేంద్రియ ప్రాముఖ్యము

మహాజనమునకు విజ్ఞానము వికాసము కల్పించుటకు చెవి చాలముఖ్యమయిన ఇంద్రియమని నేటి వయోజనవిద్యావిధానమువలనను కన్పించును. ఉపాధ్యాయుడు బోధించునప్పుడు, వక్త ప్రసంగించునప్పుడు పనికివచ్చిన దీచెవియే. పాశ్చాత్య దేశాలవారు ఈసాధనమును వదలలేదు. వదలలేరు. అంతేకాదు. వయోజనుల యుపయోగార్థమని ప్రత్యేకముగా చిన్నచిన్న మాటలతో వారు పుస్తకాలు వ్రాయించి అచ్చువేసి పంచిపెట్టినా మహాజనము వాటిని వినియోగించడము వయోజనవిద్యోత్సుకులనుకొన్నంత విరివిగా జరుగలేదు. అందుచేత పుస్తకాలు పుస్తకాలే గ్రామొఫోనుల కెక్కించి వినుపించడము ఆరంభమయినది. మనదేశములోను శ్రీ గాంధీజీ యుపన్యాసము, శ్రీ సరోజినీదేవి యుపన్యాసము గ్రామొఫోనుల కెక్కినవి. ఇక రేడియోలసంగతి చెప్పనే పనిలేదు. ఎంత విస్తారంగా రేడియోలద్వారా విద్యాప్రచారము చేస్తున్నారో మన దేశములోని రేడియోప్రోగ్రాములు చదువుతూఉండే వారికి రేడియో వింటూండేవారికి బాగా తెలుసును. బడిపిల్లలతో ఆరంభించి స్త్రీలకు, సాధారణవయోజనబృందానికి, వ్యవసాయదారులకు, పారిశ్రామికులకు, శాస్త్రజ్ఞులకు అందరికీ కావలసిన విజ్ఞానమంతటిని రేడియోలలో సంగీతము, నాటికలు, సంభాషణలు మున్నగు అన్నిమార్గాలలోను వినిపించుచున్నారు. మరియొక విశేషము కూడ ఉంది. ఆకాలమునందు గ్రంథసామగ్రిని బహుళసంఖ్యాకముగా ప్రతులు చేయడానికి వీలులేక శ్రవణేంద్రియమును ఉపయోగించవలసివస్తే ఈ కాలములో గ్రంథసామగ్రి అనంతముఖాల పెరిగిపోవడముచేత శ్రవణేంద్రియముద్వారా కొంత విస్తారముగానే వయోజన

విద్య ప్రచారము కావలసి వస్తున్నది. తనకు అభిమాన ముండే ఏఒక్క విషయాన్ని గురించి సంగతి సందర్భాలు తెలుసుకొందా మన్నప్పటికీ పడమటి దేశాలలోని జ్ఞానార్థి గ్రంథాలు ఏర్చుకొని అన్నిటిని చదువుకొనడము సాధ్యము కావడములేదు. కాబట్టి ఆ దేశాలలో గ్రంథాల లోకపగోష్ఠుల కెక్కువ అవకాశ మేర్పడి అసాధ్య లభి వృద్ధి యనుమున్నది; అంటే, జ్ఞానార్థులు సంఘములుగా చేరుకొంటారు. ప్రకటితమయ్యే ఉత్తమ గ్రంథాల నొక్కొక్కటి ఒక్కొక్కరుగా చదువుతారు. అంద రిని చేర్చుకొని తాను చదివినదానిసారమును ఇతరుల కుపదేశింతురు. ఈవిధంగా ఒక్కడు చదివింది పది మందిలో ప్రచారము కావడము సంభవమవుతుంది. అప్పుడు వినినదానియం దెక్కువ అభిమానము కలవారు మరల చదువుకొనినను చదువుకొందురు. నేడు పడమటి దేశాల గ్రంథాలయములలో లక్షలకొలది గ్రంథాలు చేరుచున్నవి. ఇన్నిటిలోంచి తన విషయమునకు చెందిన గ్రంథాలను వేరుచేసుకోవడము జ్ఞానార్థికి కష్టము గ మున్నది. అందుచేత నేటిదినము గ్రంథాలయములలోని గ్రంథాలకంటె అన్నిటి గ్రంథములనుగురించి వివరము లను చదువరులకు తెలియపరచు గ్రంథాలసూచికే యెక్కువ ప్రాముఖ్య మేర్పడుచున్నది. ఇవి యన్ని సం దర్భాలును శ్రవణేంద్రియమునకు ప్రయోజనవిద్యయందు గల వైశేష్యమును తెలియజేయును.

## మనపెద్దలు శ్రవణేంద్రియమున కిచ్చిన ముఖ్యస్థానము

నేటి యనుభావ లక్ష్మి మనపెద్దలకు ఉండిన దని చెప్పలేముగాని వారు శ్రవణేంద్రియమునకు కల్పించిన స్థానము అప్రతిమానముగా నాలోచించి కల్పించినదిగా తోచును. వారు శ్రవణమార్గ ప్రయోజనమును సాధించు టకు మహదుపాయముల నాలోచించిరి. త్యాగరాజు వంటి భక్తుడు సంగీతముపాడెను. నటరాజువంటి దేవుడు నృత్యము చేసెను. దీనికి సంగీతము తోడు. పురాణశ్రవ ణము, హరికథ, భజన, జంగముకథ, వీధినాటకము- ఇత్యాదులు వాడవాడకు గ్రామగ్రామమునకు సం ఘముసంఘమునకు తెగతెగకు ప్రాకినవి. రామాయణపు పాటలు, భారతపుపాటలు, కృష్ణలీలలు, వైరాగ్యపు పాటలు, తుదకు గణితప్రపద్యములు ఇన్నియును అక్ష రములరాని అశేషుదుపలుల రక్తములో జీర్ణమయినవి. ఇప్పటికిని హరికథయనిన నూర్లకొలది ప్రజలు చేరుదురు. సప్తాహము లనిన వేలకొలది సమికూడుదురు.

## రసానుభవము విజ్ఞానమున కుత్తేజకము

నే నిదివరలో మరియొకచో నీక్రింది వాక్యముల వ్రాసితిని. "ముప్పదిమంది విద్యార్థుల తరగతిని, ఒక్క ఉపాధ్యాయుడు తన కంఠస్వరముచే, తరిఫీదు చేయగలి గినచోటిని, వేలకొలది జనసమూహమున కుపన్యసించి వక్త తనభావములను వారి కెక్కించుపనిది, లక్షలు కోట్ల కొలది ప్రజకు శబ్దబ్రహ్మము నందించి వికాసము కలి గించుటకు ప్రయత్నించు రేడియోపనికి, కాదు-కాదు- వీని నన్నింటిని మించి, శబ్దబ్రహ్మము నుపా సించి ఫలమందుటకొరకు మనపెద్దలు మానవుని హృదయ తంత్రులను ఆకార రసానుభవమున కనువగునట్లు వీణాటు నఱ్ఱేశముతో సంగీతమును సాహిత్యమును విజ్ఞానమును మేళవించి, శ్రవణేంద్రియము నాధారముచేసి సర్వకాల సర్వావస్థలకును, సులభముగ పనికివచ్చు సుబోధక మార్గములను సిద్ధపరచిరి."

## ప్రాచీన అర్వాచీనముల సమన్వయము; అక్షరములయావశ్యకము

ఇది ముమ్మాటికిని నిజము. మనము ప్రయోజన విద్యను సాధించుటలో దీనిని మరువరాదు. కాని ప్రాచీన సాధనముల నుపయోగించుటయందు నవీన పరిస్థితులకు వాని నన్వయము చేయకుండుటకు రాదు. అచ్చు, వ్రాతలు ప్రబలనికాలములలో అవలంబించిన సాధనములమాత్ర ముతో ఇప్పుడు తృప్తిపడితిమో మన మొక్కయుగము వెనుకబడినవార మగుదుము. అదియునుగాక జ్ఞానమునకు విజ్ఞానము సాధనమైనట్లు విజ్ఞానమునకు అక్షరజ్ఞత నేటిదిన ము ప్రబలసాధనము. మనకు వికాసవంతులమగుటకు మన కున్న సాధనములు చాలవచ్చునుగాని అనుదినజీవితము నకు కావలసియుండి అనంతముగా పెరిగిపోవుచుండు విజ్ఞానములేని పట్టివికాసము ప్రయోజనకారి కాదు. ఉదాహరణము - మన ప్రాతకాలపు పండితు లున్నారు. వారికి వికాస మున్నది. మనకంటె ఎక్కువ వికాసము

తులు వారసత్వమునకును సంబంధము లేదు. కాని లోక వ్యవహారములో వారి కక్కడ స్థానము లేదు. జీవితపు వేనవేల శాఖలలో నిమిష నిమిషము జరుగునట్టి వివరాలు వారు గ్రహించుటకు వారి కవకాశము లేదు. అందులో కొందరు గ్రహింపరు. అల్లే అక్షరజ్ఞత లేకపోవడము చేత మన జనసమూహమునకు అనుదినవ్యవహారము లర్థమగుటకు బహువాదిదే లేకపోవుచున్నది. లోకవ్యవహార దక్షత సంపాదించుటకు అక్షరము కన్నువంటిది. అది లేనప్పుడు తనకు తెలిసికోవలెనని కోరికయున్నా మరియొకడు దయతలచి వచ్చి చెప్పేవరకు తాను వేచియుండవలసివచ్చును. గ్రంథాలయాలు పెట్టి సుశిక్షితులైన ప్రజాసేవకబృందమును నియమించి పత్రికలు చదివించి నేటివిజ్ఞానాన్ని వెదజల్లే ప్రయాస తీసికొనినా సర్వజన సామాన్యమునకిది పూర్తిగా తోడ్పడునవడానికి రాదు. ప్రతిమానవునకును అక్షరజ్ఞత ఉండి తాను కోరిన విషయము అచ్చుకాగితములమూలకముగా తెలిసికోడానికి తనకు వీలైనవేళను ఉపయోగించుకొనగలిగితే ఆనందమును పెంచడానికి అతడు సేకరించే జ్ఞానానికి దోహదము చేయడానికి మన ఇతర ప్రయత్నములు బాగా పనికివచ్చును. అంతవరకు శ్రవణేంద్రియమాత్రమూలకముగా చేసే ప్రయత్నాలు విశ్వాసాన్ని పెంచడానికి వివేచనను పురికొల్పడానికి హృదయావేదనలను విజృంభింపజేయడానికి పనికిరావచ్చును. తగినంత విషయపరిజ్ఞానము వ్యాపింపచేయడానికి చాలవు.

## ఆంధ్రగ్రంథాలయోద్యమము

అందుచేత ప్రజాసామాన్యమునకు అక్షరజ్ఞత అలవడజేయవలయునను ఆందోళన కొంతకాలముగా బలీయము కాజొచ్చినది. మన యాంధ్రసీమలో ప్రాచీన పద్ధతులను నవీనపద్ధతులను సమన్వయము చేసి వికాస విజ్ఞానములను వ్యాప్తిజేయుటకు ఆంధ్ర గ్రంథాలయోద్యమము పాటుపడిన దనుటకు సంశయము లేదు. శ్రీ కందుకూరి వీరేశలింగము ఆరంభించిన సాంఘికస్వాతంత్ర్యోద్యమము, ఆంధ్రుల ఉత్సాహముతో నడుపుకొనివచ్చిన వందేమాతరముద్యమము హోంరూలుద్యమములును గ్రంథాలయోద్యమమును పరస్పర పోషకములై పనిచేసినవి. మన మొదటి గ్రామగ్రంథాలయము శ్రీ దాదాభాయినౌరోజీ పేరిట ౧౯౦౫ లోనే ఉండిలో స్థాపితమయినది. ౧౯౧౪ వరకు ఎన్నియో గ్రంథాలయములు వెలసినవి. అప్పటికి ఇండియాలో మరియెచ్చటను గ్రంథాలయ సంఘము లేని సమయమున బెజవాడలో రామమోహనగ్రంథాలయమును స్థాపించిన మన దేశాభిమానులు ఆంధ్రదేశ గ్రంథాలయమును నెలకొల్పి గ్రంథాలయ పకవాలయముల వ్యాప్తికి దీక్షతో పనిచేసిరి. గాంధియుగము నాటికి మన నాడులో ౫౦౦ వరకు గ్రామ గ్రంథాలయములు వెలసినవి. పైని వివరించిన అన్ని ప్రాచీన సాధనములును కొంతవరకు పాశ్చాత్యులవద్దగల మెజిక్ లాంతరు ప్రదర్శనములు సంచార గ్రంథాలయము మొదలగు సాధనములను వినియోగించి మన గ్రామ గ్రంథాలయములు ఆంధ్రోద్యమ వ్యాప్తికి తోడుగావడమేగాక గాంధియుగానికి వాతావరణమును సిద్ధముచేసిన వనుటలో అతిశయోక్తి లేదు. ఇతర ప్రాంతాలలోకంటె ఎక్కువగా ఆంధ్ర ప్రాంతములలో సంఘ స్వాతంత్ర్యోద్యమములు, రాజకీయ స్వాతంత్ర్యోద్యమములు, తుదకు ఏకభాషోద్యమము హిందీయుద్యమము బలవత్తరముగా సాగుటకు మన దేశము గ్రంథాలయోద్యమముమూలకముగాను, దాని కుత్తేజకములయిన విజ్ఞానచంద్రికా గ్రంథమాలాది గ్రంథప్రచురణ ప్రయత్నముల మూలకముగాను, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికాది పత్రికలమూలకముగాను జరిపిన ప్రజావిబోధ ప్రజావికాస కార్యక్రమమే కారణమని చెప్పకతప్పదు. మన గ్రంథాలయోద్యమ మారంభించిన క్రొత్త క్రొత్త మార్గములలో బోటుగ్రంథాలయాలు గ్రంథాలయ యాత్రలు ప్రత్యేకము పేర్కొనదగినవి. ఇట్టివి ప్రపంచమున మరియెచ్చటను వినరానివని మన గొప్పకొరకు చెప్పుకొన మనుకోవలదు. ప్రపంచప్రగతికి అనుకూలమైన మార్గాలన్వేషించడములో మనము వెనుకంజ వేయమనుట సూచించడానికి మాత్రమే యని యెరుంగవలెను.

## అక్షరాస్యత వ్యాప్తి చేయు ప్రయత్నము

మన యాంధ్రదేశ గ్రంథాలయ సర్వస్వములో ౧౯౩౭-౩౮ సం.ము డిసెంబరు మాసమునందే "నిరక్షరత్వ నిర్మూలనము - అయిదు సంవత్సరాల కార్యక్రమము" అనునొక వ్యాసమున గ్రంథాలయము లోపమున

చేయువలసిన కృషి వివరించుట కావచ్చును. కాని ఈ రెండు మూడు సంవత్సరాలుగా ఇదివరలో గ్రంథాలయముల కిచ్చుచుండిన కొద్దిపాటి ద్రవ్యసహాయముకూడ దొరకక పోయినందున పని స్తంభింపవలసి వచ్చినది. మన దేశము యొక్క స్వాతంత్ర్యోత్సవము పరము. మనవృద్ధి ఎక్కువగా రాజకీయములపైననే నిలుచును. కాబట్టి యీ అక్షరాస్యత వ్యాప్తిచేయు విషయమునందును రాజకీయావశ్యకములు మనలను ముందుకు నెట్టుచున్నవి.

## వోటుకు అక్షరాస్యత ఆవశ్యకము

కాంగ్రెసువారు స్వాతంత్ర్యోత్సవము ప్రాబల్యానికి రాను చిరకాలముగా వయోజనులందరికిని వోటు ఏర్పాటు కావలెనని పోరాటము సాగించుచున్నారు. ౧౯౨౬-వ సంవత్సరము మొదలు మూడేండ్లవరకు కాంగ్రెసు ప్రతినిధులు శాసనసభలో నున్నప్పుడు అనేక పర్యాయములు మునిసిపాలిటీలలోనైనా వయోజనవోటు స్థాపించవలెనని ప్రయత్నించి శాసన సవరణకూడ సాధించనుంటిరి. కాని ౧౯౩౦ కి తరువాత శాసనసభల బహిష్కార ప్రయోగముతో ఆ ప్రయత్నము నిరర్థకమయ్యెను. ౧౯౩౫-వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా శాసనము చేయునపుడు బ్రిటిషుపార్లమెంటు వయోజనవోటు అంగీకరింపలేదు. కాని విద్యార్హతలు కలవారికి వోటివ్వవచ్చునని తీర్మానించిరి.

మన దక్షిణరాజధాని అదృష్టముకొలది మనరాష్ట్ర ప్రభుత్వమువారు అక్షరజ్ఞత కలిగితే, అంటే స్వదస్తూరీతో వోటు దరఖాస్తు పూర్తిచేయగలిగితే, వోటు హక్కిచ్చుటకు సిద్ధపడినారు. ఇతర రాష్ట్రాలలో ఈ ఔదార్యము కనుపించలేదు.

క్రొత్త శాసనముక్రింద జరిగిన ఎలెక్షనులలో కాంగ్రెసువారు పోటీలకు నిలవవలసి సంభవించినది. ఏడు ప్రాంతాలలో అప్రతిమానమైన విజయములు పొందవలసినది సంభవించినది. బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడి గాంధీకి తనమంత్రివర్గాల నీరేడు రాష్ట్రాలలోను కొంచె మించుమించుగా పూర్ణస్వాతంత్ర్యములతో నిలపవలసినకూడ జరిగినది.

## ఇతరరాష్ట్రాలలో కార్యోపక్రమణము

వయోజనవోటు కావలెనని కాంగ్రెసువారు కోరుచుండిన కోరిక అక్షరజ్ఞులమాత్రమైనంతవరకైన ఇప్పటికి మద్రాసులో ఏర్పడడముచేత ఇచట కొంత మందపడెనేమో చెప్పరాదు. కాని ఈమాత్రము హక్కుకూడ ప్రసాదితముగాని సంయుక్తపరగణాలు, బొంబయిలలో మంత్రులు వయోజనులను అక్షరాస్యులను చేయవలెనను ఇష్టము ఉద్రేకించి కలిగినది. ఆప్రాంతాలలో బొంబయి, అహమదాబాదు మొదలగు గొప్ప మెషీను యుగనాగరకము పొందినపట్టణాలుండి అచ్చటి ప్రజలలో ఎక్కువగా రుష్యా సమాన సంపత్తివాదము తదంగమయిన సర్వజన విద్యావాదము వ్యాపించి యుండడముకూడ ఒకకారణము అయినను అయియుండవచ్చును. ఏమైయిననేమి? ఆరాష్ట్రాలలో ప్రభుత్వమువారే అక్షరాస్యతను వయోజనవిద్య కాధారముగా త్వరత్వరగా పెంచుటకు ప్రయత్నము లారంభించినారు.

## బొంబయి

బొంబయిలో గ్రామ పునర్నిర్మాణ సమస్యను తీవ్రముగా కొనసాగించుటయందు భాగముగా ప్రజాసామాన్యమును అక్షరాస్యముగా కావించే ప్రయత్నముపక్రమించినారు అచ్చటి ప్రభుత్వమువారు గ్రామవిద్యాలయముల బోధకులకొరకుగా ప్రత్యేకము స్కీమేర్పరచి ప్రకటించినారు. దానిప్రకారము ఆ ప్రభుత్వము వారు వయోజనులను అక్షరాస్యులను చేయుటకే గ్రామబోధకు లుండే విద్యాలయాలకు అందుకొరకని ఎక్విప్మెంటు గ్రాంటు మేయింటెనెన్సు గ్రాంటు రెండు మంజూరు చేసి ౨౦మందిని అక్షరాస్యులనుచేసే ఒక్కొక్క బోధకునికిని రు.౨౫లు బోనసు ఇవ్వడానికి సిద్ధపడినారు. ఈ ఏర్పాటు ఒక్క బడిపంతులకే గాకుండా పంచాయతీల, కోఆపరేటివు సొసైటీల, కార్యకర్తలకుగూడ వ్యాపింపచేసినారు. మనరాష్ట్రాలో గ్రామపంచాయతీలు ౬,౦౦౦ లున్నవి. ఈ విధమైన సహాయము మన ప్రభుత్వము మంజూరుచేసినా యెంతోపని జరుగగలదని నమ్మవచ్చును. నిజానికి దేశమంతటా పంచాయతీ లేర్పరచి వారికి వయోజనవిద్య ప్రథమకర్తవ్యంగా నిర్వహించవలసిన

దంటే ఆరుమాసాలలో ఈసమస్య తీరడానికి వీలుంది. ఆపనము లింకా రావడము లేదు.

## సంయుక్తపరగణాలు; అసమానప్రయత్నము

సంయుక్తపరగణా లంటే శ్రీ పండిత జవహరిలాల్ నెహ్రూ పరగణాలు. అతను సమానసంపత్తి వాదనాయకుడు కాకపోను మూలపుకారణమైనా కారణమే. నే డితరనాయకుల లేర్పడినా, అతని రాజకీయ ప్రచారముద్వారా సాధారణ కిసానులు మేలుకొంటను దగ్గరికారణము కావచ్చును. కారణ మేమైతే నేమి యెల్ల ప్రాంతాలకంటే యెక్కువగా ఆప్రాంతములో వయోజనవిద్యాప్రచారానికి పూనుకొన్నారు. కడచిన (౧౯౩౯) జనవరి ౧౬-వ తేదీని నిరక్షరత్వ నిర్మూలన దివసముగా ప్రకటించి ఆప్రాంతములోని ప్రతిపీఠిలోను ఉద్యమోపక్రమము చేసినారు. ౧౬౦ వయోజనవిద్యాలయములు స్థాపించిరి ౭౬౮ సంచార గ్రంథాలయములు నెలకొల్పినారు. దీని కొక్కొక్క దానికిని అయిదు శాఖ లుండును. ఇందులో హిందీలోను ఉరుదూలోను ౩౦౦ పుస్తకాల కేర్పాటుచేయుచున్నారు. రెండు వార పత్రికలు, ఒక్క మాసపత్రిక సప్లయిఅయ్యే పఠనాలయములు ౩౬౦౦ ఉండగలవు. ఇందు కొరకు ఇరువైయయిదు వేలరూపాయ లిప్పటికి మంజూరు చేసికొనినారు.

## అక్షరజ్ఞానప్రచారవ్రతము

కొక దానిని అమలులో పెట్టుచున్నారు. అందులో చేవ్రాలు చేయువారు అక్షరాలు రానివారి కొక్కరికి తాము వ్రాయను చదువను నేర్పెదు మనియో దానికి ప్రత్యామ్నాయముగా రు ౨లు విరాళమిచ్చి వేయుచున్నామనియో శపదీక్షను ప్రకటింతురు. జిల్లా కొక ౨౦మంది ఉపాధ్యాయుల నీపనికిగాను గవర్నమెంటువారు నియమింతురు. వీరు ఒక్కొక్క కేంద్ర గ్రామములో ఒక్కొక్కరుగా నిలిచి చుట్టుగ్రామాలలోని నిరక్షరులకు విద్య నేర్పెదరు. ఒక కేంద్రములో పని ముగియుటతోడనే మరియొక కేంద్రమునకు బయలుదేరి పోదురు. పైన చెప్పినరీతిగా ఏర్పడేఘండు వంకటని ఈకార్యమునకు వినియోగింతురు. రాబోయేదీర్ఘ కాలపు సెలవులలో విద్యార్థు లీయుద్యమమునందు విరివిగా వినియోగపడగలరు. ౧౬-వ తేదీని ఈవ్రతదీక్ష తీసికోడానికి ౫ లక్షల ఫారములు పంచిపెట్టిరి. ఇందుమనుసరించి సందేశాలు ఆ పరగణాలగవర్నరు సర్ హారీహెయిగు, ప్రధానమంత్రి పండిత వల్లభ గోవిందపంత్, విద్యామంత్రి సంపూర్ణానందు, పండిత మదనమోహనమాళవ్యా, పండిత జవహరిలాల్ నెహ్రూ, స్థానికశాఖమంత్రి శ్రీమతి విజయలక్ష్మీపండిత్, రివిన్యూమంత్రి రాఫీ అహమ్మద్ కిద్వాయ్ మొదలగువారు పంపినవి ౫౦ పేజీల గ్రంథముగా చేసి అచ్చుట విద్యాప్రచారకాధికారి పంచిపెట్టినారు. కాంగ్రెసువారు, ముస్లింలీగువారు, హిందూసభవారు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, సామ్రాజ్యవాదులు అనే భేదము లేకుండా అందరును భాయిభాయిగా బుజములు కలిసి పనిచేయుచున్నారు.

## మన కోస్తాలోనో

మా యాంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి పక్షమున ౨౮—౧౧—౧౯౩౭ తేదీన విద్యామంత్రి స్థానికశాఖమంత్రి పరిశ్రమలు - కర్మకరులమంత్రి వీరి వద్దకు రాయబారము వెళ్లినప్పుడు నేను సంయుక్త పరగణాలలో అవలంబించుచుండే విధానమువంటి విధానము నవలంబింపవలసిన దని సూచించితిమి. గ్రంథాలయోద్యమము వయోజన విద్యోద్యమమే కాని వేరు కాదని, గ్రంథాలయములుకూడ గ్రంథములను సేకరించుటే ప్రధానోద్దేశముగా పెట్టుకొనక నిరక్షరాస్యతను నిర్మూలముచేయుటే ఆదికర్తవ్యముగా పెట్టుకొనవలసినదని సూచించితిమి. అప్పటి విద్యా మంత్రిగారు, ద్రవ్యము సులభసాధ్యము కాదని కాబోలును, నిరక్షరాస్యతానిర్మూలనముమాటను త్రోసిపుచ్చి గ్రంథాలయముల కిదివరలో ఇచ్చుచుండిన గ్రాంటులకొరకు తాము ద్రవ్యము మంజూరు చేయించుకొనుటకు ప్రయత్నించుచున్నామని సెలవిచ్చిరి.

అప్పటి మంత్రిగా రిప్పుడు కోర్టులు జైళ్ల మంత్రి యయినారు. అదివరలో విద్యాశాఖలో పార్లమెంటరీ సెక్రటరీగా నున్న శ్రీ వార్కీగారు విద్యామంత్రి యైనారు. వీ రీపదవికి వచ్చినదినములలోనే మద్రాసునగరములో దక్షిణ యిండియా వయోజనవిద్య కన్ఫరెన్సని ఒక

సమావేశము ౧౯౩౯ జనవరి ౧౧, ౧౨, ౧౩, ౧౪ తేదీలలో నాలుగుదినములు జరిగినది. ఉపక్రమ ఉపసంహారసమావేశములతో గూడ ౧౪ సమావేశము లయినవి. స్థానికసంస్థలకు స్త్రీలకు ఈవిషయమున సంబంధించిన వని మరిరెండు సమావేశములు నయినవి. ఒక ప్రదర్శనము జరిగినది. కోస్తాగవర్నరు ఎర్స్కిన్ ప్రభువు ప్రత్యేకము సందేశము పంపినారు. మద్రాసువిశ్వవిద్యాలయోపాధ్యక్షుడు, జార్జి ఎస్. అరుండేలుగారు, ఇద్దరు మంత్రులు, చెన్నపురనగరాధ్యక్షుడు మరి సుమారు ఏబదిగురు ఇతర ప్రసిద్ధవక్తలు ఈసమావేశములలో పాల్గొనిరి. కమిటీ ఏర్పడినది. తీర్మానములు చేసినారు. సమావేశములలో నొకచోట ప్రసంగించుచు నేటి విద్యామంత్రి శ్రీ వార్కీగారు అప్రత్యక్షముగా తానీసమావేశమునకు కారకుడ ననియు నిరక్షరాస్యతను నిర్మూలనము చేయుటకు తన చేతనైనంత సహాయము చేయుదు ననియు చెప్పిరి.

ఒక్క కుత్తుకకే మునిసిపాలిటీవారు మాత్రము వయోజనవిద్య తమ ఆవరణలో ప్రవేశపెట్టినారు. అందుకు రు. ౨౫౦౦ లు మునిసిపాలిటీ మొత్తము ఆదాయము నుండి వెచ్చపెట్టుటకు మద్రాసు ప్రభుత్వమువారు అంగీకరించినారు. మరి యితర ప్రాంతములలోను ఇట్టి ప్రయత్నములు జరిగితే ఆయాసంస్థల ద్రవ్యములోనుండి కర్చుపెట్టుకొ డానికి వా రంగీకరింతురని తెలియుచున్నది. అనంతపురంజిల్లాలోని హిందూపురమువారు కుత్తుకుడి లోవలెనే వయోజనవిద్య ఆరంభింతు రని తెలియుచున్నది. బళ్లారి కంటోన్మెంటులో హిందూ స్త్రీ శిక్షణవిద్యాలయమునకు చెందిన హాస్టలులో నొక వయోజనవిద్యాలయము మారంభించి రను వార్త వచ్చినది. కాని యిట్టి చిల్లరప్రయత్నములతో ఈపని సాగు నని యనుకొనినచో పొరపాటగును. సంయుక్తపరగణాలలోవలె ఏలక్ష, లక్షన్నర రూపాయలలో ప్రభుత్వమువారు మంజూరుచేసి గట్టిగా అచ్చటివలె దీక్షాపత్రములు అచ్చువేయించి చేవ్రాళ్లు చేయించి అచ్చటివలెను బొంబయిలోవలెను స్కూలుమేష్టరులు పంచాయతీ కార్యదర్శులు, కోఆపరేటివు కార్యదర్శులు, పనిచేయటానికి ప్రోత్సాహము కలిగించితేగాని తరంగములు తరంగములుగా బయలుదేరి ఉద్యమ మల్లుకొనదు. ఈ రాజధానిలో ఇదివరలో గ్రంథాలయాల కిచ్చుచుండిన గ్రాంటులే ఇప్పుడు రద్దయియున్నవి. పూర్వమువలె రు. ౨౦,౦౦౦ లు అథవా రు. ౩౦,౦౦౦ లో ఈ గ్రాంటులక్రింద మంజూరు చేయుటమైనా జరిగితే కొంతపని కావచ్చును. గ్రంథాలయములు తమ ఆవరణలోని నిరక్షరాస్యతను అయిదేండ్ల లోపుగా నిర్మూలనము చేయడానికి పూనుకొని వీథులవారీగా అక్షరాలురానివారి జనాభాతో తాము అనుసరింపదలచుకొనిన ప్రణాళికతో కూడ పంపినచో యీ గ్రాంటు లిచ్చెదమనినను గ్రంథాలయాలు — పంచాయతీల అధీనములోని ఇతరములుకూడ — సంతోషముగా ఈ పనిని నిర్వహించడమునకు పూనుకొనును. కాని ఇంతవరకు చేసినను నేటి పరిస్థితులలో తగినంత చేసినట్లు కాదు.

## గాంధీజీ వోటు నిరక్షరాస్యులకు లేదనినాడు

ఏలయందురా? గాంధీజీ యిటీవల మనరాజకీయ వాతావరణములోనికి ఒకపెద్ద బాంబును విసరినాడు. ఇంతకాలము వయోజనవోటును అక్షరమురానివారికి వచ్చినవారికీ అందరికీ ఇవ్వవలెనని తాను పట్టినపట్టును మానుకొన్నాడట! అక్షరాస్యత అర్హతగా నుండవలసినదనే నిశ్చయాభిప్రాయమునకు తాను వచ్చినాడట! అంటే అర్థమేమి? ఇప్పుడు ఏడుపరగణాలలో అతని మాటను నడపుటకు సిద్ధమయిన కాంగ్రెసు మెజారిటీలు మంత్రివర్గాలు ఏర్పడియున్నవి. ఇన్నిచోట్లను అక్షరజ్ఞులు కానివారికి వోటు లేదనే సిద్ధాంతము ప్రచారములోనికి వచ్చి తీరవలసివచ్చును. అప్పు డేమగునో చూడుడు. బ్రిటిషు పార్లమెంటువారు ఆస్తిపాస్తుల మీద చదువుమీద రెంటిమీద ఆధారపడి నూటికి ౧౩ గురకు చెందజేసిన వోటు గాంధీజీస్కీములో నూటికి ఏతొమ్మిదింటికో తగ్గిపోవలసి ఉంటుంది. బ్రిటిషువారు మార్చకపోతే అది మారకపోవచ్చును. అప్పు డెక్కువమందికి వోటుండడము బ్రిటిషువారి దయగా పరిణమించి జాతీయంతటికిని వోటు లేకుండా చేసిన ప్రజాప్రభుత్వము — ఇది మాటలలోనే విపరీతముగా తోచును— ఆమలులో నుండడము తటస్థించును.

ఇట్టివిపరీతము తో మనని గాంధీజీకి తెలియదా ? తెలుసును. కాని కాంగ్రెసువ్యవహారాలలో తనకు కలిగిన అనుభవము తన్నీయభిప్రాయానికి లాగినదని స్పష్టపరుచుచు, అందరు మంత్రులమీదను బరువు లెస్సగా మోపినాడు. అక్షరాస్యుల వోటుతో ఏర్పడే మంత్రులు చదువులేకపోవడముచేత వోటులేకపోయే మహాజనసమూహముయెడల సత్యబుద్ధికలవారేయగుదురేని నిరక్షరాస్యత అంతటా మరునిమేషమునందే అదృశ్యమగునని ఆయన వ్రాసినాడు. దీని కర్థమేమి ? తనకు సాధ్యమయినంతవరకు తాను మంత్రులచేత అన్ని ప్రాంతాలలోను ప్రబలియుండే నిరక్షరాస్యతను నిర్మూలింప జేయింతుననియేకదా! దానికి తార్కాణముగా తాను అవుంధుప్వదేశప్రభువుచేత అక్షరాస్యపు వోటు ప్రసాదింపించుతూ ఆరుమాసాలలో నిరక్షరత్వనిర్మూలనను కావింపింతునని ప్రకటింపించినాడు. ఈ ఉదాహరణమును గ్రహించి మనకోస్తా మంత్రులును ఆరునెలలలో నిరక్షరత్వనిర్మూలనము గావింతు మని ప్రకటింతురా యనునదే ప్రశ్న.

## మన మంత్రుల కథ

విద్యామంత్రి శ్రీవార్కీగారెంత ఉత్సాహముతోనున్నా మనకోస్తాలో ఈ విషయమయి ప్రభుత్వమింకా ఏచర్య ఆలోచించినట్లు కన్పించదు. ప్రధానమంత్రి శ్రీ రాజగోపాలాచార్లవారు ప్రత్యేకసమావేశములో నొకచోట హాజరయి యీ విషయము ముచ్చటించినారు. అచ్చట మాట్లాడినది అక్షరములు సులభముగా వయోజనులకు నేర్పడమెట్లా యనునది. డాక్టరు లౌబక్ అనునాయన ఫిలిప్పైను దీవులలో అక్షరత్వము ప్రజలకు కల్పించడములో చాల పాటుపడినవాడు, అనేకసంవత్సరము లక్కడే నివాస మేర్పరచుకొని పనిచేసినవాడు ఇక్కడికి దయచేసినాడు. ఇక్కడిభాష లతనికి రాకపోయినా ఇదివరలో ఈవిషయముగా పనిచేయుచుండిన పాదిరీలు వగైరాలను కలుసుకొనినాడు. అరవానికి పనికివచ్చేటట్టుగా ఒకపటము తయారుచేసినాడు. 'అణాకత్తి కొన్నాడెవడో', అది జారి 'చట్టి'మీద పడింది. 'చట్టి' పగిలింది. ఈ విధముగా బొమ్మలలో ఒక కథ తయారుచేసి వరుసవెంబడి భావస్ఫురణచేత అక్షరాలు జ్ఞాపకమువచ్చే విధానము సిద్ధపరచినాడు. దానిని వివరించడానికి ప్రత్యేక సమావేశము మిత్రులు చేర్చినారు. ప్రధానమంత్రిగారచటికి దయచేసి గ్రామస్థులకు దగ్గరిచుట్టాలయిన వస్తువులమీద, ఇండ్లు చెట్లు వగైరాలమీద, వానివాని పేర్లు వారివారి పేర్లు పెద్దక్షరాలలో వ్రాసి కనుపరుస్తే అక్షరజ్ఞానవ్యాప్తి అవుతుం దన్నారు. తమకు ప్రధానమంత్రిత్వము తగులుకున్నది గాని లేకపోతే తాము లౌబక్ దగ్గర మొదటివాలంటీరుగా పనిచేసియుందు మనినారు. కాని ప్రధానమంత్రిగారు తా మేమి చేయుదురో తెలుపలేదు. ఈ కోస్తా త్రాగుడు నిరోధకార్యక్రమనిర్వహణముగాను పూనుకొన్నందుచేత అన్ని యితరకర్మలు — అవశ్యమయిన వయినను— పెట్టుకోడానికి వీలులేని స్థితియందున్నది. మరిగతి యేమి ? ఒకవేళ గాంధీజీపరముగా రేపు త్రిపురకాంగ్రెసులో కాంగ్రెసు సభ్యత్వానికి అక్షరజ్ఞత అవశ్యకమని తీర్మానించినను తీర్మానింపవచ్చును. అప్పుడు కాంగ్రెసుమంత్రులు వోటరులసంఖ్య పెంచుకోడానికే మాత్రము కాకుండా కాంగ్రెసుసంస్థలోని మెంబరుల సంఖ్య పడిపోయి అపఖ్యాతి కలుగకుండా ఉండడానికయినా ఈ విషయమునందు చురుకుగా పనిచేయవలసి వచ్చునే.

## మూడు ముఖ్యమైన పనులు

కాంగ్రెసులో ఏమి జరిగినా జరుగకపోయినా ప్రజలు ముందడుగు వేసి ప్రజాప్రభుత్వమని ఇప్పటికీ కాంగ్రెసు వదలకుండా ప్రకటించుతుండే ప్రజాధికారమే యేర్పడవలెనంటే, గాంధీజీ కోరే అక్షరాస్యతే ఏర్పడవలెనంటే మూడుపనులు జరిగికావలెను. గాంధీజీ అవుంధు సంస్థానములో ప్రచారములోనికి వచ్చిన రాజ్యాంగ ప్రణాళికలో వీటిని ఇమిడ్పించినాడు.

మొదటిది పంచాయతీ పరిపాలన సర్వేసర్వత్ర యేర్పడవలెను. గ్రామసీమలవారి దీరాజ్యము. కాబట్టి దేశమిచ్చే పన్నులో సగమువంతువరకు గ్రామ సౌభాగ్యముకొరకు వారు ఖర్చుపెట్టుకొనే అధికారమయినా వారికి చెందవలెను. పై పరిపాలనయు వారి ప్రతినిధుల చేతులలోనే యుండుట మంచిది. అక్షర

జ్ఞత లేనిది ఈవిధానమునకు బల ముండదు. కాబట్టి దానిని అచిరకాలములో సాధింపవలెను. ముందు రాబోయే పౌరులు నేడు శిశువులు, బాలురు, బాలికలు. వీరు అక్షరజ్ఞులు కావడానికి వీరికి నిర్బంధ ప్రాథమిక విద్య యవసరము. పట్టి 'కాకి', 'గువ్వ' విద్యగాక అది అన్నముపెట్టేవిద్యే కావలెను. అందుచేత గాంధీజీ వార్ధావిద్యావిధానాన్ని ఆలోచించినాడు. ఇది క్రొత్తది కాదు. ఈ దేశము ౧౯౦౫-౦౬ సంవత్సరాలనుండి వాంఛించుచుండే జాతీయవిద్యే యిది. ఎప్పుడైతే అక్షరజ్ఞులకే కాంగ్రెసులోనైనా వోటనేది ఏర్పడునో అప్పుడు ఈవిధానాన్ని ఒక్క నిమిష మాలస్యము చేయకుండా మంత్రులమలులోకి తెచ్చి భావిస్వరాజ్యప్రజను సార్వజనిక వోటుకు హక్కుదారులను చేయవలసియుందురు. ఈ స్కీములోకి రాక నిలిచేవారు ఇప్పుడు అనక్షరాస్యులుగానుండే వయోజనులు. వీరి నక్షరాస్యులను జేయడానికి వెంటనే తగినచర్య తీసికోకుండా తప్పదు. వీరు అక్షరాస్యులయి దానిలాభ మెరిగితేనే వార్ధావిధానముకోటి విధానము విజయవంతము కావడానికి వాతావరణ మేర్పడుతుంది. ఈమాట అందరును ప్రకటించుచువస్తున్నారు. మద్రాసుగవర్న రీమాటే యన్నాడు. సంయుక్తపరగణాల గవర్నరు హెయిగు గారీమాటే యన్నారు. పండిత జవహర్లాల్ ఈమాటే అన్నాడు. కాబట్టి అక్షరాలు సులభముచేసే మార్గ మాలోచనచేతామని, చదువడానికి పుస్తకాలు లేవే వ్రాయింతమని, అక్షరాలు వచ్చినంతమాత్ర మేమిలాభం మళ్లీ మరచిపోకుండా ఉండేవిధాన మాలోచింతామని, జాగుచేయడానికి వ్యవధి లేదు. ఇవన్నీ చేయవలసినవే. కాని నిరక్షరత్వనిర్మూలనను చేసే ప్రయత్న మారంభించి దాని కుపబలంగా ఇవి యన్నిటినీ తీర్చవచ్చును.

## సర్వవ్యాప్త ప్రయత్న మావశ్యకము

జపానులో ౧౦౦కి నూర్గురక్షరాస్యులు. రష్యాలో నూటికి నూర్గు రక్షరాస్యులు. అంకెలు దొరకినంతవరకు ఇతర దేశాలలో—ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా, హాలండు, న్యూజీలండు-ఇటువంటి దేశాలలో ఎచ్చటూ-నూటికి ౯౦గురకంటె తక్కువమంది అక్షరాస్యులు లేరు. మనదేశములోని అక్షరాస్యులు నూటికి తొమ్మిదింటికి మించరు. ప్రపంచముతో అన్నివిషయములలో పోటీచేయడము తప్పని మన కింతటి తారతమ్యము కనుపించుచుండగా నింక నేమాత్రము ఆలస్యము చేయకుండా ప్రజలు తమప్రయత్నము చేసితీరవలెను. దీని బరువంతా ప్రభుత్వంమీద వేయడము సరికాదు కాని ప్రభుత్వము తగినచర్య తీసికొనకుండామాత్ర మిది సులభసాధ్యమేమో కాదు. సర్వవ్యాప్తమైన రోగానికి సర్వవ్యాప్తమైన చికిత్సచేయకుండ తప్పదు. దానిని ప్రభుత్వములోని మంత్రులు అధికారులు మనస్సుకు తెచ్చుకొంటే పనులు త్వరగా సాగును. ఈ క్రింది కార్యక్రమము ఎంతవరకు అమలులో పెట్టడానికి వీలైతే అంతవరకు అమలులో పెట్టతగునని నాసలహా.

(౧) నిరక్షరాస్యతానిర్మూలనమువిషయమున చాల తీవ్రమైన ప్రచారము జరుగవలెను. స్వరాజ్యమున కెంత తీవ్రప్రచారము జరిపితిమో అంతటి ప్రచారము కాంగ్రెసువారు దీనికిగాను జరుపవలెను. సంయుక్తపరగణాలలో చేసిన యారంభము చాల బాగున్నది. ఏ మునిసిపాలిటీవారు అక్షరాభ్యాసకార్యము ఆరంభించినా ఈప్రబోధ కార్యక్రమము ఒక్కదినమో ఒక్కవారమో ఏర్పరచి విరివిగా జరిపించడము ప్రథమ కర్తవ్యము. ఇది దేశమంతటను విరివిగా నిరంతరము జరుగవలెనన్నా అయిచ్ఛిక సేవకులు ఒకమూలనుండి ఒకమూలకుపోయి నిరక్షరాస్యతను బాపదలచుకొనినా

(౨) ఉచితప్రయాణ సౌకర్యము లేర్పడవలెను. (అ) రైల్వేకంపెనీలు ఆటలు పాటలకు పోయేవారికి కన్సెషను లిస్తున్నారు. కుక్క కరిచిన రోగులకు ఉచితప్రయాణమున కేర్పరచుచున్నారు. అట్లే వయోజన విద్యాప్రచారము చేయునట్టివారికి తగిన ఆవరణలలో తగిన సర్టిఫికేట్లు పంపినమీదట ఉచితముగా ప్రయాణముచేయడానికి రైల్వేలు వెంటనే అవకాశము చేయవలెను. దీనిని సాధించడానికి మన మంత్రివర్గాలవారు కేంద్రశాసనసభలోని కాంగ్రెసుసభ్యులు పూనుకొంటే పని జరుగుతుంది. ఇప్పటికి స్కౌటులకీ యవకాశము కొంతవర కున్నది. వయోజన విద్యాప్రచారము తలపెట్టే మిత్రులు తాత్కాలికముగా ఈ విషయము గమనించడము మేలు. నిజమునకు మనదేశములో అక్కడి

కక్కడే ప్రజాసేవకులకు అన్నము పెట్టేవారు దొరకక పోరు. కాని ప్రయాణాలకు ద్రవ్యము దొరకడము కష్టము. రైల్వేలకు (ఆ) తరువాతివి మోటారుబస్సులు. వీని యజమానులంతాను తమతమ ప్రాంతాలలో తగిన మట్టుకు పైరీతిగానే ఉచితప్రయాణ సౌకర్యాలు వయోజనవిద్యాప్రచారకులకు కలుగజేసిన బాగుండును.

(౩) శ్రీ విద్యామంత్రిగారు గ్రంథాలయముల కిదివరలో ఇచ్చుచుండిన గ్రాంటులకంటె కొద్దిగానైనా హెచ్చు గ్రాంటు లిచ్చి—మొదటిఏడాది రు. 30,000, లనుకోండి — నిరక్షరత్వ నిర్మూలనమునకే ఈ ద్రవ్యము కర్చుచేయవలసినట్లు నిర్ణయించవలెను.

(౪) శ్రీ స్థానికపాలనశాఖా మంత్రిగారు మునిసిపాలిటీలు జిల్లాబోర్డులు తమ మొత్త మాదాయములో కొంతభాగము కొన్నియేండ్లపాటైనా ఈ పనికి తీసియుంచవలెనని గట్టియేర్పాటు చేయవలెను. జిల్లాబోర్డులు ప్రత్యేకించు మొత్తములలోనుండి పంచాయతీలకు గ్రాంటు లిచ్చున ట్లేర్పరచవలెను. పంచాయతీలు నిరక్షరత్వ నిర్మూలనమునకు దగిన ప్రణాళిక పంపిననే యీ గ్రాంటులు చెందునట్లు చేయవలెను. పంచాయతుల ప్రాంతాలలోని ప్రాథమిక విద్యాలయాలు వారి స్వాధీనము చేయునట్లు నిర్ణయించినయెడల విద్యాలయములు వాని సిబ్బందీ సామగ్రి ఈ కార్యమునకు వారికి చాల యుపయోగపడును. జాయింటుకమిటీ లేర్పడడానికి అవకాశము వెంటనే కల్పించితే ప్రజానాయకు లుత్సాహముతో ఈ యుద్యమానికి దోహదము చేయుటనుగూడ సంభవించును.

౫. శ్రీ కార్మికమంత్రిగారు ప్రతి ఫేక్టరీ యజమానీ తనదగ్గర పనిచేసే పనివారల కుటుంబాలలోని వయోజనులను—స్త్రీపురుషవివక్ష చేయకుండ—తన కర్చులతో అక్షరజ్ఞులను చేయవలసినది; లేదా అట్టి యుద్యమానికి తగిన ద్రవ్యసహాయము గావించవలసిన దని ప్రోత్సహింపవలసినది. ఐచ్ఛికముగా ఫేక్టరీ యజమాను లంగీకరింపకపోతే నిర్బంధముగా ఒప్పించే చర్య జరుపవలసినది.

౬. విశ్వవిద్యాలయాలవారు ఎండకాలపు సెలవు లారంభమయ్యేలోపుగా తమవిద్యార్థులు వయోజనవిద్యాబోధకు అర్హతగడించే తరిబీతునీయవలసినది. ఈ తరిబీతునీయడములోనే అక్షరజ్ఞానము కలిగించడానికి సులభమార్గా లేవి యనేసమస్యయూ వయోజనులు చదువుకోడానికి ఏవిధగ్రంథసామగ్రి యావశ్యక మను సమస్యయూ వీరు తీర్చవలసియుండురు.

౭. విద్యార్థులయినవారు ఈ కార్యక్రమానికి కావలసినశిక్షణ పొందడానికిని తమకు ప్రయాణము జరుగడానికి భోజనానికి సదుపాయాలు కుదిరించితే ఏ ఎనిమిదివారములో పనిచేయడానికి ఉత్సాహముతో పూనుకోవలెను. శ్రీ వార్క్ గారు వారానికి రెండు దినములు ప్రతి విద్యార్థిని ఈపనిలో వినియోగింపు మనుచున్నారు. వారు చదివే పరిసరాలలో వారివిద్యకు భంగము కానిరీతులలో ఇదియు సాధ్యము కావచ్చును. మరికొందరు విద్య పూర్తిచేసే పట్టభద్రులు ఆరుమాసములో— కొందరిమతమున రెండు సంవత్సరములో— నిరక్షరత్వనిర్మూలనము చాకిరీ తమకర్చుమీద చేయవలయు ననుచున్నారు. ఇది కఠినవిషయము. ఇప్పటికే ఆర్థికముగా నిర్మూలమగుచుండే విద్యార్థిని ఇంకను దుర్గతిపాలుచేయుట మగును. కాబట్టి అనుసరింపదగినది కాదు.

౮. కాలేజీ లున్నచోట్ల, హైస్కూ ళ్లున్నచోట్ల ఆవిద్యాలయాలలో పనిచేసే ఉపాధ్యాయులు చాలమంది యుందురు. వారు పూనుకుంటే తాముండే యూళ్లలోనేగాక తమపరిసరములలో నంతటను వీరు నిరక్షరత్వ నిర్మూలనోద్యమము సాగించుటకు చాల యవకాశము లున్నవి. వీరు వెంటనే తమ టీచర్సు అసోసియేషనులతరఫున చర్య పుచ్చుకొని స్థానికముగా వయోజనవిద్యాసంఘము లేర్పరచుటకు తోడ్పడి మునిసిపాలిటీలలోను యూనియనులలోను మరి పరిసరములలోను ఈపని నెరవేర్చవలసిన దని విద్యాశాఖమంత్రిగారు హెచ్చరిక చేయింపించినారా చాలా విరివిగా పని జరుగడాని కవకాశ మున్నది.

౯. కాంగ్రెసుసంఘా లన్నిటిసత్తినను ఈ పని నిజముగా మోసినది. నేటిదినము ఈపని గాంధీజీ

నిర్మాణకార్యక్రమములోని కెక్కునవనడము వీరు గమనింపవలెను. నిజముగా ఎక్కడికి కాంగ్రెసు సంఘాలక్కడ వయోజనవిద్యాసంఘాలుగా ఏర్పడో లేక ఏతదర్థము ప్రత్యేక ముపసంఘాలను నియమించో ఈ పనిని తీవ్రముగా సాగించవలసియున్నది.

౧౦. స్త్రీలవిషయము పై జెప్పిన అన్నివర్గాలలోను ఇమిడిపోయినది నిజమే కాని నేటి మనపరిస్థితులలో వీరినిగురించి ప్రత్యేకముగా వ్రాయకతప్పదు. స్త్రీలలోనికి మగవారు ప్రవేశించి పనిచేయడానికి వీలు లేదు. ఇటీవల మద్రాసులో జరిగిన వయోజన విద్యకాన్ఫరెన్సులో డాక్టరు థామసు అనువా రుపన్యసించుతూ తాను ప్రత్యేకము స్త్రీలకని వయోజనవిద్యాలయము పెట్టి నడుపగా మొదట ఉత్సాహముగా తమస్త్రీలను చదువుకోడానకు పంపిన పురుషులే తమకు చదువు రాకయుండడము స్త్రీలకు చదువురావడము అనర్థదాయకమని వారిని తరువాత నిరోధించిరని చెప్పిరి. కాబట్టి స్త్రీ సమాజాలవారు స్త్రీలలో విద్యావతులయి ఈ విషయమున నుత్సాహముకలవారు గట్టిగా ప్రవేశించి పనిచేయవలసియున్నది.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపెడే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుటలకు మించేయెడల రెండుసంచికలలో ప్రకటింపవలసివచ్చును.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచేదృష్టిలోను, రచించేరచనలోను కొత్తదనం కావాలి. మన ఉద్యమాలు, మనదేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసిందని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

---

# హేమంత ప్రస్థానము

దిగుమర్తి సీతారామస్వామి

"పండుటాకులమర్మరధ్వనుల కలరి
పల్కరించెడు నీకాలిబాటయందు
నాయడుగు లంటి వెన్నంటి నడచివచ్చు
నీడతో నేమి నాకు మాటాడవచ్చు".

"పాడువడిన గృహోపరిభాగమట్లు
మబ్బులెడనెడ జూచు శ్యామలనభమ్ము
వెలిసిపోయిన రాటల పొలుపు సూపు
మోడులై మ్రాకు లీవనభూమి నిల్చి"

"కరగుసీరెండలో చలికాచుకొనుచు
ముసలియావులు తరలిన ప్రొద్దు లెల్ల
నెమరునకు దెచ్చికొని సోలి నిదురవోవు
స్తబ్ధశాంతిలో ప్రాణఘోషమె నటింప".

ఎంతదూరమో వచ్చితి నీవిచిత్ర
మేమొ ఇటగూడ హేమంతమే హిమార్ద్రి
విశదసీమాంత మాముక్తవృంతభావి
నిధనసుప్తలతాంతమై నిలువరించు".

"కాలగర్భములో సుడిగాలి రేగి
కడలి హాడల నభాతమ్ము నొడలువిరిచె
ఈనవోదయమున పరాధీనవిశ్వ
నగ్నజీవిక నినదించు నాగళమ్ము".

"తీరని ఈదరిద్రము మ
దీయకుటీరసకాశజీర్ణకే
దారము లందుకొన్నఫలి
తంబుగ నెంచితిగాని ఒక్కటే
తీరు — హిమాలయమ్మున హి
తిన్‌బడి నే తల దాచుకొన్నదో
చూరనుమాట ఇప్పటికి
నూ తెరయెత్తె దరిద్రభారతి".

"ఆకలి కొల్లగొన్న నిల
యాలపునాదులపైన మేడలే
దీకొని క్రౌర్యశిల్పి తెగ
దిద్దిన రేఖల జీర్ణచర్మశ
ల్యాకృతులై రహింప బహి
రావరణంబున దృష్టిబొమ్మలై
ప్రాకనికింపచుల్ (?) తిరుగ
వైతురు కర్మఫలంబులో పుటల్".

"కాలమె శృంఖలం బయి సు
ఖంబాకనాడును డొక్క నింపుకో
జాలనిదేహమందె చెర
సాలగ మ్రగ్గెడివారి నెంచి తాం
బూలరసమ్ముతో దులిపి
భోగులు వ్రాసిన నీతిశాస్త్రముల్
కాలినగాక స్వర్గమరి
గాపుగనిన్ భజియింపవచ్చునా?"

— "కుటీరగీత"లనుండి.

## మహాయానబౌద్ధధర్మోత్పత్తి—సవరణ.

### కథావత్థునందు ఖండింపబడిన సిద్ధాంతముల తులనాత్మక సూచి.

| | సిద్ధాంతముల సంఖ్య | ఆర్వాచీనములు | | | | | | | | ప్రాచీనములు | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అంధక | | | | | | | | మహాసాంఘిక | | స్థవిరవాద | | | | | | | |
| | | అంధక | అపరశైలీయ | పూర్వశైలీయ | రాజగిరిక | సిద్ధార్థక | వైపుల్య | ఉత్తరాపథక | హేతువాద | మహాసాంఘిక | గోకులిక | కాశ్యపీయ | భద్రయానిక | మహీశాసక | వాత్సీపుత్రీయ | సర్వాస్తివాద | సామ్మితీయ | కేవలస్థవిరు | ఇతరులతో కలిసినవి |
| ఆర్వాచీనములు. | | | | | | | | | | | | | | | | | | | |
| అంధక | ౭౨ | | | | | | | | | | | | | ౧ | | ౧ | ౮ | ౬౨ | ౧౦ |
| అపరశైలీయ | ౭ | ౧ | | ౯ | | | | | | | | | | | | | | ౦ | ౭ |
| పూర్వశైలీయ | ౨౯ | ౧ | ౯ | | | | | | | | | | | ౧ | | | ౩ | ౧౮ | ౧౧ |
| రాజగిరిక | ౧౧ | ౧ | | | | ౮ | | | | | | | | | | | ౧ | ౨ | ౯ |
| సిద్ధార్థక | ౯ | ౧ | | | ౮ | | | | | | | | | | | | ౧ | ౦ | ౯ |
| వైపుల్య-వేదుల | ౮ | ౧ | | | | | | | | | | | | | | | | ౭ | ౧ |
| ఉత్తరాపథక | ౪౪ | ౭ | | | | | | | ౧ | | | | | ౧ | | ౧ | | ౩౪ | ౧౦ |
| హేతువాద | ౮ | | | | | | | ౧ | | | | | | | | | | ౭ | ౧ |
| ప్రాచీనములు. | | | | | | | | | | | | | | | | | | | |
| మహాసాంఘిక | ౨౪ | | | | | | | | | | | | | | ౧ | ౧ | ౪ | ౨౦ | ౪ |
| గోకులిక | ౧ | | | | | | | | | | | | | | | | | ౧ | ౦ |
| కాశ్యపీయు | ౧ | | | | | | | | | | | | | | | | | ౧ | ౦ |
| భద్రయానిక | ౧ | ౧ | | | | | | | | | | | | | | | | ౦ | ౧ |
| మహీశాసక | ౯ | ౨ | | ౧ | | | | | ౧ | | | | | | | | ౩ | ౧ | ౮ |
| వాత్సీపుత్రీయ | ౧ | | | | | | | | | | | | | | | ౧ | ౧ | ౦ | ౧ |
| సర్వాస్తివాద | ౪ | ౧ | | | | | | ౧ | | | | | | | ౧ | | ౨ | ౧ | ౩ |
| సామ్మితీయ | ౨౨ | ౮ | | ౩ | ౧ | ౧ | | | ౪ | | | | | ౩ | ౨ | ౨ | | ౩ | ౧౯ |
| సమ్మిళితములు | ౪౦ | | | | | | | | | | | | | | | | | ౧౫౭ | |
| అనిశ్చితములు | ౧౭ | | | | | | | | | | | | | | | | | ౫౭ | |
| | | | | | | | | | | | | | | | | | | ౨౧౪ | |

# పుస్తకసమీక్ష

## దేవదాసు

రచయిత : శ్రీ శరత్ చంద్రఛటర్జీ. అనువాదకులు: శ్రీ చక్రపాణి. ప్రకాశకులు : నవశక్తి కార్యాలయంవారు. ధర ఆరు అణాలు.

ఇది విశ్వసాహిత్య పరుల్లోకూడా తనపేరు నమోదు చేయించుకున్న శరత్ బాబురచన అంటే చాలునేమో అనుకుంటాను. మొదలుపెట్టి చదువుకు పోతూంటే 'దైవమిచ్చినభార్య,' కొంత సుర్తుకు వొస్తుంది. కాని దీనికీ దానికీ తూర్పు పడమరలఅంత తేడా పోను పోను స్పష్టపడుతూంటుంది.

నాయకుడైన దేవదాసు "నావలెనే యూత్ ఉన్మత్తభావశాలి". అంచేతే అల్లా అయిపోయాడు. పుస్తకం చదువుతూనే 'పార్వతిని' కాక 'దేవదాసు' నయ్యానే అని వలవల ఏడ్చాను.

దేవదాసూ, పార్వతీ దైవప్రేరితులయిన దంపతులు. పరిస్థితులు అల్లా అడ్డు వొచ్చి వారిని వేరు చేశాయి. సమానంగానే విధిపాషాణపుదెబ్బలు తిన్నారు. అవి కాస్త వుండు మాడాక తల ఎత్తుకు తిరగబోయారు. మళ్లీ విధి మాడుపట్టున కొట్టింది. యావజ్జీవమూ ఆదెబ్బ ననుభవించారు.

దేవదాసు వయస్సు మళ్లి నరకలోకపు సరిహద్దుల్లో తచ్చాడుతూండే చంద్రముఖికి చిక్కుతాడు.
పార్వతి సరిగ్గా అల్లాంటి భువనబాబుకి దక్కుతుంది: చంద్రముఖి దేవదాసునీ, పార్వతిని భువనబాబూ ప్రేమిస్తారు. రూపలావణ్యాదులచేత కాదు. శక్తి గుణాతిశయంచేత, స్ఫాటిక స్వచ్ఛమైన ప్రేమ! వలపు నశియించియూనుకూడ నిలువ గలిగిన ప్రేమ. నిజమైన ప్రేమ! శృంగార వాసనలు ఏక్ఖడా లవలేశమైనా లేని ప్రేమ! హుః! ఈలోకపు సావిట్లో ఆ నలుగురు పసిపాపలూ, (దేవదాసూ, భువనబాబూ, పార్వతీ, చంద్రముఖీ) ఆడిన నాలుగు స్తంభాల ఆట! దొంగ విధి! అది కాస్తా ఎక్కువగా దేవదాసుని వరించింది. అంచేతే అతను నాయకుడు!

శరత్ బాబు ఈనవల రాసేటప్పుడు 'కృత్యాద్యవస్థకాక కృత్యంతావస్థ' పడ్డట్టు తోస్తుంది. లేకపోతే శరత్ బాబులాంటి సిద్ధహస్తుడు, కావ్యాన్ని అల్లా ముగించాలిసి రాదు.

మొదటినుంచీ 'చక్రపాణి', మంచి గ్రంథాలను ఏరుకుంటున్నాడు.

తెలుగులకు వివిధపాకాలనూ రుచిచూపిస్తున్నాడు. భాషవిషయంలో వాడుక్కి ఎంతో చేరువ చేరువగా వొచ్చాడు.

భాష భాష అంటూ గోలపెట్టే పెద్దలు ప్రచ్ఛన్నగ్రాంథికులు కావడమూ, కుర్రకారురచయితలు, పెద్దవారి సిద్ధాంతాలను మాత్రమే నమ్మి, తమవినికిడినే పరమప్రమాణంగా లక్ష్యవిషయంలో వుంచుకుని చేస్తున్నకృషి ఈ గ్రంథంలో ఎక్కడపడితే అక్కడ మనం చూడవచ్చును.

యిలాంటి పుస్తకాలను చాలా చాలా యింకా అనువదించమని 'చక్రపాణి'ని రసావేశంలో అడుగుతూన్నాను, ప్రార్థిస్తున్నాను, దీవిస్తున్నాను.

—శ్రీ రుక్మిణీనాథ శాస్త్రి.

---

## ఆధునిక విజ్ఞానం

రచయిత : వసంతరావు వెంకట్రావుగారు. విజయనగరం, శ్రీ వేదవ్యాస ప్రెస్సులో ముద్రితము. వెల ఆరణాలు.

"ఇది సృష్టిరహస్యం", "మంత్రాలు", "చంద్రలోకయాత్ర" అనే ఆధునిక విజ్ఞాన సంబంధమైన మూడు వ్యాసాలు గల ఒక చిన్న పుస్తకము. ఈవ్యాసా లిదివరకే భారతీ, కృష్ణా పత్రికల్లో ప్రకటితమైనాయి. ఆంగ్లభాషాజ్ఞానము లేనివారి కందరికీ దీనివలన పాశ్చాత్యవిజ్ఞానంలో గల అనేక విషయాలు చక్కగా బోధపడుతాయి. అంతే కాదు, మన ప్రాచీనకాలపు రీతిరివాజు లనేకాలు ఆధు

నిక విజ్ఞాన సిద్ధాంతాలకు సూటిగా సరిపడుతూ వుంటాయి కాని వాటిని మనవా ళ్లిప్పుడు అంధాదంధంగా అర్థం తెలియకుండా ఆచరిస్తూ వుంటారు. అల్లాంటివి ఆకాలంలో ఇట్టి వైజ్ఞానిక హేతువులవల్లనే ఏర్పరచి వుంటారనికూడా ఇందులో నిరూపించారు. కేవలం వ్యాసరూపంగా అయితే చదువుకోలేవాళ్ల కంతగా రుచించక పోవచ్చుగాని ప్రశ్నోత్తరరూపంలో మామూలుల్లో ముచ్చటల్లాగు సరళంగా వ్రాయడంచేత అందరికీ బాగా అర్థమవుతుంది. అందరూ చదువతగినది.

## శ్రీనిరంజన విజయం

గ్రంథకర్త: కొండూరు వీరరాఘవాచార్యులు గారు, తెనాలి. భారతీ ముద్రాక్షరశాలలో ముద్రితము. వెల ఆరణాలు.

నిరంజన శాస్త్రిగారనే పేరుగల ఒకానొక విశ్వబ్రాహ్మణ పండిత మహాశయుని జీవితచరిత్రము. ఈయన మంచిశాస్త్రాధ్యయన సంపన్నుడై, కర్మిష్ఠులై స్వకులాన్ని ఉన్నత స్థితిలోకి దీసుకొని రావలెనని ఉపన్యాసాలద్వారా, పత్రికా ప్రకటనలద్వారా ప్రయత్నించినట్లు గనుపడుతుంది. స్వాభివృద్ధి నభిలషించే విశ్వబ్రాహ్మణయువకుల కిది ముఖ్యంగా చదువవలసిన పుస్తకము.

## జాతీయ నీతిపద్యములు

కృతికర్త: కవిశేఖర భోగరాజు నారాయణమూర్తి గారు. ఆంధ్రదేశంలో చదువనేర్చినవా రందరూ వీరి ధారాళరచనాసామర్థ్యాన్ని నుత్తరిగినవాళ్లే. నాజన్మభూమి, గురుసేవ, అహింస, స్వదేశీ, హరిజనులు, మద్యపానము, రాజభక్తి మొదలగువిషయములనుగురించి నీతులను గరపుతూ సులభశైలిలో వ్రాయబడిన చిన్నపుస్తకము. సుమతిశతకము, వేమనపద్యములు, కుమారశతక

ములలాగ బాలబాలికలకు నియతినియమాలను బోధించ డానికి ఇది తగినపుస్తకం. వెల నాలుగణాలు.

---

### పానపిశాచ విమోచనము

ఇది ఏకనాటిక. కథావస్తువు మద్యపాన నిషేధ విషయకమైంది, రచయిత: వై. రామయోగిగారు. రాయలసీమ జిల్లాల్లో మద్రాసు ప్రభుత్వంవారు మద్యపాన నిషేధశాసనం అమలులో పెట్టిన సందర్భం పురస్కరించు కొని చిత్తూరులో ఈనాటిక ప్రదర్శితమై పేరుగాంచి నది. సుధాకరుడనే పేరుగల ఒకసంపన్నగృహస్థు తన సేవకునిద్వారా సారాయిత్రాగుడు కలవాటుపడి సంపత్తి వంతా గోలుపోయి మహా హీనదశను పొందుతాడు. కాని ఒకానొకమద్యపానినిషేధ ప్రచారకుని సుబోధన వల్ల మళ్లీ సన్మార్గంలోపడి సంసారాన్ని బాగుపరచు కొంటాడు. ఇది ఈసమయానికి సరిగ్గా పనివచ్చేది.

---

## గ్రంథస్వీకారము

---

బుచ్చిబాబుకథలు:— ప్రకాశకులు: నమ్మాళ్వార్స్, పోస్టుబాక్స్ ౧౨౫, మద్రాసు, వెల ఆరు అణాలు.

మనసంపద:— రచయిత: క్రోపాట్కిన్. అనువాద కులు: గద్దె లింగయ్యగారు. ప్రకాశకులు: ఆదర్శ గ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. వెల ఒక అణా.

కమ్యూనిజానికే జయం:— రచయిత: డిమిట్రాఫ్: అనువాదకుడు: నవయుగశాంతియా. ప్రకాశకులు: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా జిల్లా. వెల ఒక అణా.

జోసెఫ్ స్టాలిన్:— ఎమిల్ లడ్విగ్గుల సంభాషణ. అనువాదకులు: కాజ శివరామయ్యగారు. ప్రకాశకులు: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా. వెల అణన్నర.

తిరుగుబాటు (నాటకం):— రచయిత: మునిమాణిక్యం. ప్రకాశకులు: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా. ప్రతి — పావలా.

మాలపిల్ల:— కర్త: గద్దె లింగయ్యగారు. ప్రకాశకులు: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా. వెల ప్రతి: పావలా.

గురజాలయిష్ట కామేశ్వర శతకము:— గ్రంథకర్త: రావిపాటి లక్ష్మీనారాయణగారు, నరసారావుపేట, గ్రంథము - ఉచితము.

# పత్రికా స్వీకారము

ప్రజామిత్ర సంక్రాంతి సంచిక:— ఆకర్షణీయమైన రూపురేఖలతో ఈ సంచిక మాకార్యస్థానాన్ని అలంకరించింది. కేవలం బాహ్యరూపంలోమాత్రమే కాదు. అంతః సౌందర్యంలోకూడా పర్యాప్తంగానే వుంది. నవీనాంధ్ర పద్యవాఙ్మయం భావరహితమైంది కాదని, ప్రాతకాలపునీతులనే అంటిపెట్టుకొనియుండక, క్రొత్తక్రొత్తపోకడలతో ఆధునిక, ఆంధ్ర విదుషీమణుల్లాగు భాషావధూటి సైతం క్రొత్తక్రొత్త సింగారాలతో నడుస్తున్నదనే వ్యాసంతో ఆరంభమయి, రెండుసార్లు పల్నాటివీరులను స్మృతిపథంలోకి కొనితెచ్చి, ఆత్మపరీక్షలో అసలు నకలీప్రేమల్లోగల వ్యత్యాసాలను గనుబరుస్తూ, తెనుగుపూదోటలలోని పలు

కొలపూల సువాసనలతో నాలుగు దిశలూ మాయింపజేసి, భారతీయనాయకులకు ఆంధ్రకూతయెడలగల అనురాగం అనుమానాస్పదమైన దని పూజారిచేత పలికించి, విశ్వనాథకవిరాజుగారిచే ఫీల్డ్మార్షలనెకపక్కాములాడిస్తూ, యూరోపుఖండపుప్రజానియంతల యాంత్రిక తంత్రాలను లోకానికి చాటుతూ, ఆంధ్రవీరకుమారునిచేత ఆంధ్రనాయకులకు జేజేలుపెట్టించి, అంకొలవారి బొమ్మలటాంకాలు పొగిడి, సింహావలోకనంలో అనేక భారతీయసమస్యా విమర్శనపూర్వకంగా ముందు భారతికి స్వాతంత్ర్యప్రాప్తిరేః, ముఖ్యావసర మని ఉద్ఘోషిస్తూ, బాలికల ఆటపాటల్లోగల అంతరార్థం వైద్యసంబంధమైన గోసాయిచిటికెలవంటి దని నిరూపించి, కొండపల్లి దుర్గపు గతవైభవాన్ని కొనియాడుతూ, నవ్వులోగల వైజ్ఞానికమర్మమును చాటుతూ, గ్రామపునర్నిర్మాణానికి రాధారులనొట్టించి, స్త్రీప్రసంగాలతో, వైజ్ఞానికప్రాముఖ్యాలాపాలతో, రవీంద్ర పోతన్నల సామ్యసమాలోచనలతో, కొందరు విలాసినుల క్షణక్షణచిత్తవృత్తిసంవాదాలతో, ఈ సంచిక, తెలుగుచదువరుల హృదయాలకు ఆమోదం కూరుస్తుం దనడంలో సందేహ మేమీ లేదు.

" వే. "

ఆనందవాణి:— గ. సత్యనారాయణ, వి. కాళిదాసుగార్ల సంయుక్తసంపాదకత్వమున వెలువడే ఒక క్రొత్తరకపు వారపత్రిక. హాస్యం, రాజకీయం ప్రధానంగాగల వ్యాసాలూ, కథలూ రంజకంగా వున్నాయి. వెల సంచిక ౧-కి ఒక అణా.

బాలభారతి:— ఒక క్రొత్త మాసపత్రిక. నంబూరు సుబ్బరాజుగారు సంపాదకులు. కైకలూరు తాలూకా తాడినాడనుండి ప్రకటితమవుతుంది. సాలుచందా. రు ౧-౮-౦. విడిసంచిక రెండు అణాలు.

"పద్మనాయక":— దద్దనాల లక్ష్మీనారాయణయ్యగారిచే జయప్రూర్వకంగా నడుపబడుతూఉంది. శ్రీ బొబ్బిలిరాజావారిలాటి సంస్థానాధిపతులు దీనిప్రధానసంరక్షకులు. అందువలన భాగ్యవంతులకువారికి అనుకూలంగానే వుంది. అన్యవిషయప్రాధాన్యంగల వ్యాసాలు కొద్దిగా వున్నాయి. పద్మనాయకసంఘంవారి ఆర్థిక, సాంఘిక విషయప్రాముఖ్యంగల వ్యాసాలు పర్యాప్తంగా వున్నాయి.

గ్రామోద్యోగి:— బి.యల్. హనుమంతరావుగారి సంపాదకత్వమున కొండపల్లినుండి వెలువడిన మాసపత్రిక. వెల ప్రతి ౧-కి ఒక అణా.

నవయుగ:— ఇది ఒక జాతీయపక్షపత్రిక. డి. రామకృష్ణపరమహంసగారు దీనిసంపాదకులు. విజయనగరమునుండి వెల్వడుతుంది. ఇందులో ఘాటైన రాజకీయవ్యాసా లున్నాయి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.